# చతుర

అక్టోబరు 2010
రూ.10/-

- పి.చంద్రశేఖర అజాద్
**పావురం** 18 లో...
- 'మాస్తి' కన్నడిగుల ఆస్తి
126 లో...



Entered

సంపుటి -33, సంచిక - 9
393వ సంచిక, పేజీలు : 132
అక్టోబరు 2010

# చతుర



కవర్ పేజీ : మధురిమ
ఫొటోగ్రాఫర్ : రఘు
ముఖపత్రాలంకరణ : రాజుయాట



'లెక్కలన్నీ తప్పులు రాశావేంటయ్యా?' అన్నాడు యజమాని.
'తప్పులు రాయలేదు. మీరే రెండు రకాల లెక్కలు రాశారందులో'
'ఎన్నయినా రాస్తానయ్యా! నిన్ను పెట్టుకుంది దానికేగా? ఒళ్లు దగ్గర పెట్టుకుని పనిచేయి' అన్నాడు యజమాని.
'అలాగే చేస్తున్నాను' అన్నాడు శివయ్య పెడసరంగా.
'తిక్కతిక్కగా ఉందా? మాటకు మాట చెబుతావా? ఇకపై ఈ మిల్లు గుమ్మం తొక్కకు'
'తిక్క నీకు. నాజీతం నాకు పడేయ్. ఇప్పుడే పోతా.. '
యజమానిని ధిక్కరించే ధైర్యం శివయ్యకు ఎలా వచ్చింది? ఇంతకీ శివయ్య నేపథ్యం ఏంటి?
ఆద్యంతం ఆసక్తిగా కొనసాగే మనోవిశ్లేషణాత్మక నవల
**పి.చంద్రశేఖర అజాద్ పావురం**
18వ పేజీలో..

బొమ్మలు : బాలు



# 2010లో ఇంప్రింట్‌వారి
# భారతదేశంలోని తీర్ధయాత్రలు
# పుణ్యభూముల సందర్శనం



## శృంగేరి యాత్ర
గోకర్ణము, మురుదేశ్వర్, మూకాంబిక,
ఉడిపి, ధర్మస్థల, హోరనాడు, శృంగేరి
4 రోజుల యాత్ర , రూ. 4000/- బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 13/8, 10/9, 8/10, 12/11, 10/12

## తమిళనాడు దర్శన్
వెల్లూర్, తిరుత్తని, కంచి, పాండిచ్చేరి, నవగ్రహ దేవాలయాలు, తిరువెంకాడ్,
తిరుచ్చి, మధురై, కుర్తాళం, రామేశ్వరం, కన్యాకుమారి, శుచేంద్రం, త్రివేండ్రం.
7 రోజుల యాత్ర , రూ. 9500/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 28/1, 6/8, 18/9, 11/10, 8/11, 10/12

## మహారాష్ట్రా దర్శన్ అష్ట గణపతులు
షిరిడి, తుల్జాపూర్, కొల్హాపూర్, అక్కల్‌కోట్, 4 జ్యోతిర్లింగాలు
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 9500/-
యాత్ర తేదీలు : 21/1, 19/2, 7/3, 3/4, 9/5, 17/6,
21/7, 19/8, 17/9, 18/10, 17/11, 17/12

## హిమాలయ దర్శన్
బాగేశ్వర్, బైద్యనాథ్, పాతాళభువనేశ్వర్, బేరీనాగ్, జాగేశ్వర్, రాణీకేత్,
నైనితాల్. ఈ క్షేత్రముల యందు సాక్షాత్తు దేవతలు ప్రత్యక్షమగును.
రైలు, బస్సు, 10 రోజుల యాత్ర, ఖర్చు రూ. 16000/-
యాత్ర తేదీలు : 10/8, 9/9, 8/10

## గుజరాత్ దర్శన్ సోమనాథ్, నాగేశ్వర్
పంచద్వారకలు, గోపితలాప, మాతృగయ, జామ్‌నగర్, పోరుబందర్
7 రోజుల యాత్ర , బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 9500/-
రాజ్‌కోట్ వరకు రైలు అక్కడ నుండి బస్సు, యాత్ర తేదీలు : 7/7,
3/8, 24/8, 7/9, 21/9, 12/10, 26/10, 9/11, 23/11, 2/12, 23/12

## కేరళ యాత్ర
కాలడి, చోటాకినారా, రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల దేవాలయాలు
గురువాయూరు, అలిపి, మున్నార్, త్రివేండ్రం, కన్యాకుమారి
9 రోజుల యాత్ర , రైలు, బస్సు ఖర్చు రూ. 10000/-
యాత్ర తేదీలు : 13/8, 13/9, 11/10, 12/11, 17/12

## ఉజ్జయిని ఓంకారేశ్వర్ యాత్ర
ఉజ్జయిని, హర్షవర్ధినిదేవి (శక్తిపీఠం), ఓంకారేశ్వర్, మహేశ్వర్, జ్యోతి
ర్లింగములు, అంజనేయస్వామి దేవాలయం, పార్వతి దేవాలయం
4 రోజుల యాత్ర , రైలు, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 5500/-
యాత్ర తేదీలు : 14/8, 13/9, 17/10, 11/11, 18/12

## రాజస్థాన్ దర్శన్
జైపూర్, అజ్మీర్, బికనీర్, ఉదయపూర్, భరత్‌పూర్, మౌంట్‌అబు
10 రోజుల యాత్ర , రైలు, బస్సు ప్రయాణం. రూ. 14000/-
యాత్ర తేదీలు : 9/1, 20/2, 20/3, 10/4, 8/5, 9/6, 17/7,
21/8, 18/9, 9/10, 20/11, 18/12

## ఒరిస్సా, బెంగాల్, అస్సాం దర్శన్
పూరీ, సాక్షిగోపాలం, కటక్, భువనేశ్వర్, గిరిజాదేవి, కాళీమాత దేవాలయం,
గంగాసాగర్, చందాసాగర్, తారకేశ్వర్, పక్షేశ్వర్, శాంతినికేతన్, బ్రహ్మపుత్రానది,
ఉమానందా దేవాలయం, పీకాక్ ఐలాండ్ , కామాఖ్యా దేవాలయం.
12 రోజుల యాత్ర, రూ. 14000/-, రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 6/8, 3/9, 4/10, 4/11, 6/12

## కాశీ, గయ, ప్రయాగ
కాశీయందు పిండప్రదానం చేయు వారికి ఆంధ్రప్రదేశ్ తూర్పుగోదావరి
జిల్లాకు చెందిన ఋత్వికులచే తీర్థ కార్యక్రమాలు జరుపుకొనే సౌకర్యం
కల్పించబడును. 6 రోజుల యాత్ర. రూ. 5,500/- (భోజనములు కాక)
రైలు, బస్సుప్రయాణం. యాత్ర తేదీలు : ప్రతీ బుధవారం

## చార్‌ధామ్ యాత్ర
హరిద్వార్, హృషీకేశ్, యమునోత్రి, గంగోత్రి, కేదార్‌నాథ్, బదరీనాథ్.
15 రోజుల యాత్ర. రూ. 15,000/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 5/8, 19/8, 26/8, 2/9, 16/9, 30/9

## ద్వాదశ జ్యోతిర్లింగ యాత్ర
శ్రీరామేశ్వరం, శ్రీశైలం, భీమాశంకర్, శ్రీ త్రయంబకేశ్వర్, ఘృష్ణేశ్వర్,
పర్లీవైద్యనాథ్, శ్రీనాగేశ్వర్, శ్రీసోమనాథ్, ఉజ్జయిని, శ్రీ ఓంకారేశ్వర్,
శ్రీ కేదార్‌నాథ్, వారణాసి. 23 రోజుల యాత్ర. రైలు, బస్సు ప్రయాణం.
రూ. 25,000/- యాత్ర తేదీలు : 29/8, 28/9

వివరాలకు :





**దంటు నాగార్జున శర్మ, ఇంప్రింట్ ట్రావెల్స్ & టూర్స్**
ఫ్లాట్ నెం. 504, సంయుక్తా అపార్ట్‌మెంట్స్, అంబాలికా ఫర్నిచర్ పైన, రాజా డీలక్స్ ఎదురుగా, ముషీరాబాద్,
హైదరాబాద్ - 20. ఫోన్ : 040 – 2754 7708/2754 7709, సెల్ : 98850 89092

అపార్ట్‌మెంటాలజీ 33

# అత్తగారూ - సెల్‌ఫోనూ - ఒక పోలీసు



యర్రంశెట్టి శాయి

*(గత సంచిక తరువాయి)*

"అవును. అచ్చం నా ఫోన్‌లెక్క ఉంది" అంది రాధాబాయ్.

"నీ ఫోన్లెక్కకాదు.. ఇదే నీ ఫోన్"

అందరూ ఉలిక్కిపడ్డారు.

"మా ఫోన్ అదెలా అవుతుంది? మాది మా ఇంట్లోనే ఉంది కదా" అంది కవిత.

"ఏదీ.. ఉంటే తీసుకురండి"

కవిత, రాధాబాయ్ ఇల్లంతా వెతికారు గానీ ఫోన్ కనిపించలేదు.

"కనబడటం లేదు" అంది రాధాబాయ్.

ఎస్సై నవ్వాడు.

"ఎలా కనబడుతుంది? ఇది నా దగ్గ రుంటే? "

"మీ దగ్గరకెలావచ్చింది? " అడిగాడు విజయ్ కన్‌ఫ్యూజైపోతూ.

"బరాబర్ వస్తదివయ్యా. ఈ ఫోన్‌ని మీ ఇంట్లోకెళ్ళి శీను అనే దొంగ కాజేశాడు. దీన్ని ఒక షాపులో వాడు అమ్మబోతుంటే పట్టుకున్నా. స్టేషన్‌కి తీసుకపోయి బాగా తోమినాక అసలు సంగతి జెప్పిండు.. మీ ఇంట్లో దొంగతనం చేసినట్లు"

అందరం ఉలిక్కిపడ్డాం.

"మా అపార్ట్‌మెంట్స్‌లోకి దొంగవచ్చాడా? " అడిగాడు జగన్.

"అనే కదా చెప్తోంది. వాడే ఈ ఫ్లాట్ కూడా చూపించాడు"

హమీద్‌మియాకి మండిపోయింది.

పక్కనే నిలబడ్డ వాచ్‌మన్ కాలర్ పట్టుకున్నాడు.

"క్యా హై రాములూ! దొంగనేవాడు లోపలకు రాకుండా గేటు దగ్గరే థరో చెకింగ్ చెయ్యాలని నేను చెప్పినయ్ కదా!"

ఇన్‌స్పెక్టర్ వాచ్‌మన్‌తో-

"ఏయ్.. ఎక్కువ తక్కువ మాట్లాడకురా! నీగేట్లోంకెళ్ళే లోపట కొచ్చిండాడు" అన్నాడు కాస్త ఆవేశం తెచ్చుకుంటూ.

"నిన్ను డిస్‌మిస్ చేస్తా" కోపంగా అన్నాడు హమీద్‌మియా.

"నీకు ఎవడికి సలాం కొట్టి డబ్బు సంపాదిద్దామనే యావ ఎక్కువై పోవటం వల్లే ఈ న్యూసెన్స్ జరిగింది" అన్నాడు మొహిందర్ సింగ్.

"అసలింతకూ ఆ ఫోన్ ఎప్పుడు దొంగ ఎత్తుకుపొయ్యాడు కూడా మీకు తెలీనే తెలీదు కదూ? " అడిగాడు రాధాబాయిని విజయ్.

"తెలీకుండా ఎలా ఉంటుంది? తలుపులు బార్లా తెరచి నువ్ డ్రెస్సింగ్ టేబుల్ దగ్గర ముస్తాబవుతూండివుంటావ్. దొంగ కాజేసి ఉంటాడు" అంది కవిత.

"అదేం కాదు. వాడు తను టీవీ ఛానెల్ కెమెరామన్‌ననీ, మీ అమ్మను ఇంటర్‌వ్యూ చేస్తానికొచ్చాననీ చెప్పాడంట. దాంతో మీ అమ్మ తెగ రెచ్చిపోయి వాడినక్కడే వదిలి కెమెరాలో గ్లామర్‌గా కనబడ్డానికి లోపల డ్రెస్సింగ్ టేబుల్ దగ్గరకు పరుగెత్తిందంట. వాడు హాలంతా వెతికితే అల్మారాలో ఈ ఫోన్ కనిపించింది. అది తీసుకుని పారిపోయాడు" వివరించాడతను.

"వాడి మొఖం చూడగానే నాకు డౌటొచ్చింది కవితా! అందుకే త్వరగా మేకప్ ఫినిష్ చేసుకొచ్చాగానీ అప్పటికే వాడు ఫోన్ తీసుకుని పారిపోయిండు!" చెప్పింది రాధాబాయ్.

"అలా అడ్డమైనోళ్ళనూ ఇంట్లోకి రానివ్వవద్దని ఎన్నిసార్లు చెప్పినా నీకు? " తల్లి మీద విరుచుకుపడింది కవిత.

"టీవీ ఛానెలోడని రానిచ్చినా! దొంగని చెప్తే రానిస్తానా ఏంది? " కోపంగా అంది రాధాబాయ్.

వాళ్ళ సంభాషణ తెగేట్లు లేదని ఇన్‌స్పెక్టర్ కల్పించుకున్నాడు.

"హలో! మేమీడకొచ్చింది మీ ఫామిలీ డిస్కషన్స్ విననీకి కాదు. ముందు చెప్పండి.. ఇది మీ ఫోనా కాదా? "

కాదంటే అది ఎస్సై కొట్టేస్తాడని కంగారుపడి "మా ఫోనే! మా ఫోన్ అయినప్పుడు కాదని ఎలా అంటాం? "

ఎస్సై మావేపు తిరిగాడు-

"ఇగో! ఈ ఫోన్ ఈమెదేనని మీ అందరి ఎదురుగా ఆమె చెప్పింది కదా! మీరందరూ విట్నెస్!" అన్నాడు

మాతో అలా కమిట్ చేయిస్తూంటే మాకు ఏదో అవాంతరం ముంచుకురాబోతూందని భయంవేసింది.



"అవ్, మేమంతా విట్నెస్ ఉన్నయ్" అన్నాడు హమీద్‌మియా దర్పంగా.

"థాంక్యూ! మీ స్టేట్‌మెంట్ మా లేడీ కానిస్టేబుల్ పాపాయమ్మ తన సెల్‌ఫోన్‌లో కూడా రికార్డ్‌జేసింది. రేపు మీరు కాదని దబాయించినా నడవది"

హమీద్‌మియా మొఖంలో ఆందోళన కనిపించింది. ఎస్సై పాపాయమ్మ వేపు తిరిగాడు, "పాపాయమ్మా! ఈ సెల్‌ఫోన్ వీడియో ఒక్కటి చాలదూ- వీళ్ళు ముగ్గురినీ సెల్లో వేయనీకి? "

"వీడియో, ఆడియో ఏమీ లేకపోయినా గానీ లోపట వేస్తే ఎవళు సార్ మన్ను కాదనేది? "

"అవ్.. ఆ మాటా నిజమే"

"అయితే ముగ్గురికీ బేడీలు వేయాలా సార్? "

"కానీ ఇంతమందిని సెల్లోవేస్తే మళ్ళీ వీళ్ళందరికీ ఫుడ్డూ వాటరూ అన్నీ మనకు వేస్ట్. వాడొక్కడినీ అరెస్ట్ చేస్తే చాలు. వీడే ముస్తాక్ అహ్మద్ అని రాసుకుంటే కిరికిరి పోతది"

అంతవరకూ వాళ్ళమాటలు షాకయి వింటూన్న విజయ్‌యాదవ్ ఠక్కున స్పృహ లోకొచ్చాడు.

"హలో హలో! ఏంటి ఇద్దర్ని తోసేద్దాం.. ముగ్గుర్ని వేసేద్దామంటూ తెగ రెచ్చిపోతున్నారు? అసలు మమ్మల్నెం దుకు అరెస్ట్ చేస్తున్నారు? "

"ఎందుకా? ఈ సెల్‌ఫోన్ ముస్తాక్ అహ్మద్ అనే టెర్రరిస్ట్ వాడుతున్న ఫోన్! కనుక నువ్వే ముస్తాక్ అహ్మద్ అయ్యుం డాలి? లేదా నువ్ కనీసం వాడి గ్యాంగ్ మెంబరయినా అయ్యుండాలి"

ఎస్సై ఆ మాటనేసరికి మేమంతా కూడా కంగారుపడ్డాం.

టెర్రరిస్ట్‌కి సంబంధించిన కేసుల్లో ఒక సారి పొరబాటున ఇరుక్కున్నా బతికి బయటపడటం కష్టమని మాకు తెలుసు.

విజయ్‌తోపాటు కవిత, రాధాబాయ్ కూడా గాభరాపడ్డారు.

"అయితే ఆ సెల్‌ఫోన్ మాది కాదు" అంది కవర్ చేసుకోవడానికి ట్రై చేస్తూ.

"కానీ ఇందాక వీళ్ళందరూ వింటూం డగా మీరీ స్టేట్‌మెంటిచ్చారు. ఇది మీదేననీ- దొంగ ఎత్తుకుపోయాడనీనూ"

కవిత బతిమలాడే ధోరణికొచ్చేసింది.

"చూడండి సార్! ఫ్యాక్టేమిటంటే ఈ సెల్‌ఫోన్ మాది కాదు. మా మమ్మీకి రోడ్ మీద దొరికింది"

"నాక్కాదు సార్ మా అమ్మాయికి" గాభరాగా అంది రాధాభాయి.

ఆ మాటలు వినగానే ఎస్సై, లేడీ కాని స్టేబుల్ పగలబడి నవ్వారు.

"నేనెప్పుడే సార్! ఏ టెర్రరిస్టుని పట్టు కున్నా గిట్లనే చెప్తాడు సార్"

ఎస్సై విజయ్ వేపు చూశాడు.

"ఇగో చూడు ముస్తాక్ అహ్మద్.. ఈ సెల్‌ఫోన్ మీ ముగ్గురిలో ఎవరిదో మీరే జల్దీ తేల్చాలి. ఎవరిదయితే వాళ్ళనే స్టేషన్‌కి తీసుకెళ్తాం"

"ఇదిగో నా పేరు ముస్తాక్ అహ్మద్ కాదు.. విజయ్"

"సరే, నువ్వేం పేర్లు పెట్టుకుంటే నాకెం దుగ్గానీ చెప్పు.. ఎవళ్ళని సెల్లో వేయాలె? "

విజయ్ రాధాబాయ్ వేపు చూశాడు. రాధాబాయ్ కంగారుగా కవిత చెవిలో గొణిగింది- "నా మీదకు తోస్తాడేమో కవితా"

వెంటనే కవిత విజయ్ భుజం మీద చేయివేసింది.

"విజయ్ అది నీకే దొరికిందని చెప్పు"

"చెప్తే నన్ను సెల్లో వేస్తారు. నేనెందుకె ళ్ళాలి! నేను వద్దంటున్నా విన్పించుకోక మీరు తెచ్చిన ఫోన్ అది? "

"అలా అబద్ధాలు చెప్పకండి అల్లుడు గారూ! ఆ ఫోన్ మీకే కదా దొరికింద న్నారు? " అంది రాధాబాయ్

అందరం అదిరిపడ్డాం.

"వ్వాట్? మీ ఇద్దరూ జైలుకెళ్ళాల్సి వస్తుందని నామీదకు తోస్తారా? " కోపంగా అన్నాడు విజయ్.

"భయపడకండి అల్లుడుగారూ! ఆ టెర్ర రిస్ట్ కసబ్‌కి జైల్లో ఏసీ రూమ్ ఇచ్చి, రోజూ చికెన్ బిర్యానీలూ, మటన్ బిర్యానీలూ తినిపించారు కదా!" ధైర్యం చెప్పింది రాధాబాయ్.

"అదీగాక నువ్ సాఫ్ట్‌వేర్ ఇంజినీర్‌వి కదా విజయ్. నీకు లాప్‌టాప్ కూడా ఇస్తారు" ఎంకరేజ్ చేస్తూ అంది కవిత.

"ఇక అక్కడ 24 గంటలూ టీవీ ఛానెల్స్ హేపీగా చూసుకోవచ్చు"

ఎస్సైకి చిరాకేసింది.

"పాపాయమ్మా!"

"యస్సార్"

"కౌంట్‌డౌన్ స్టార్ట్‌చెయ్. వన్ అనేలోగా తేల్చుకోకపోతే ముగ్గురినీ తీసుకుపోదాం"

వెంటనే పాపాయమ్మ కౌంట్‌డౌన్

మొదలుపెట్టింది.

"నైన్.. ఎయిట్.."

"సార్! ఆ సెల్‌ఫోన్ వీళ్లకే దొరికింది సార్. నేను వద్దన్నా తీసుకొచ్చారు" అన్నాడు విజయ్ ఆందోళనగా.

"సెవెన్" అంది పాపాయమ్మ.

"విజయ్ ప్లీజ్. లేడీస్ జైలుకెళ్ళటం అంత సేఫ్ కాదు"

"మీ మమ్మీ గనక వెళ్తే పోలీస్‌కి సేఫ్ కాదంటున్నావ్ కదూ? "

"సిక్స్... ఫైవ్..."

"అల్లుడుగారూ! ఈ ఒక్కసారికీ కాదనకండి. అయినా 24 గంటల్లో మిమ్మల్ని బెయిల్ మీద ఇంటికి తెచ్చే బాధ్యత మాది" అంది రాధాబాయి.

"ఫోర్, త్రీ.."

"బెయిల్ దొరక్కపోయినా ఫర్వాలేదు విజయ్. సెల్లో వేయగానే ఛాతీనొప్పి అను! అంతే లైఫ్‌లాంగ్ నిమ్స్ హాస్పిటల్‌లో ఏసీ రూమ్‌లో ఉండవచ్చు"

"టూ.. వన్.." అంటూ పాపాయమ్మ విజయ్ చేతికి బేడీలు వేసేసింది.

చేసేది లేక మేమంతా కూడా విజయ్ వెంట పోలీస్‌స్టేషన్‌కి బయల్దేరాం.

"ఛీ.. ఇదంతా నీవల్లే జరిగింది" రాధాబాయ్‌తో అంటోంది కవిత.

"అల్లుడుగారు చేతగాని టైప్ అవటం వల్లే ఈ ప్రాబ్లెమ్. అదే మా అక్క అల్లుడు మర్డర్ చేసినా కూడా ఇంతవరకూ పోలీసులు ఇంటికి రావడానికి భయపడుతున్నారు" విసుక్కుంది రాధాబాయ్.

నేనూ శంకరమూర్తి పోలీస్ స్టేషన్ నుంచి తిరిగి వచ్చేసరికి విజయ్ ఇంటి దగ్గర కెమెరా ముందు తుగ్లక్ ఛానెల్ జర్నలిస్ట్ రాజు కనిపించాడు.

"వెంగమాంబా! ప్రస్తుతం టెర్రరిస్ట్ ముస్తాక్ అహ్మద్ ఉరఫ్ విజయ్-కుటుంబ సభ్యులు కవిత, అతని అత్తగారు రాధాబాయ్ మన తుగ్లక్ ఛానెల్‌తో




మాట్లాడ్డానికి సిద్ధంగా ఉన్నారు వెంగమాంబా!"

"కవితగారూ చెప్పండి! మీ ఇంట్లో ఎంత మంది ఉంటున్నారూ? "

"నేనూ, మా అమ్మా, నా హజ్బెండ్"

"టెర్రరిస్ట్ ముస్తాక్‌అహ్మద్ అనే విజయ్‌ని మీరు లవ్ మారేజ్ చేసుకున్నారా, ఎరేంజ్డ్ మారేజా? "

"మాది ఏరేంజ్డ్ లవ్ మారేజ్"

"ఆం ఇందులో ఏదో తిరకాసుందే.. కొంచెం వివరంగా చెప్తారా? "

"తిరకాసేముంది? నన్ను లవ్‌చేసిన తనూ, నేను పెళ్ళి చేసుకోవాలనుకున్న తనూ, మా మమ్మీ ఎరేంజ్ చేసిన పెళ్ళికొడుకూ, నన్ను పెళ్ళి చేసుకోవాలనుకున్న తనూ, నన్ను సిస్టర్‌గా ప్రేమించి తర్వాత నార్మల్‌గా ప్రేమించినతనూ, మాడాడీ సెలక్ట్ చేసినతనూ- ఇంతమందిలో ఎవర్ని చేసుకోవాలో కన్‌ఫ్యూజయ్యా! ఆ కన్‌ఫ్యూజన్‌లో వాళ్ళల్లో ఎవర్ని చేసుకున్నానో కూడా కరెక్టుగా ఇప్పటికీ తెలీదన్నమాట"

"ఓర్నాయనో మా తుగ్లక్ ఛానెల్

అందించే 'బ్రేకింగ్ న్యూస్' లాగుంది. సరే, మీ భర్త విజయ్ అనే ముస్తాక్ అహ్మద్‌కు టెర్రరిస్టులతో లింక్‌లు ఉన్నాయన్న విషయం మీకెప్పుడు తెలిసింది? "

కవిత చిరాకుపడింది.

"ఏంటి? విజయ్‌కి టెర్రరిస్టులతో లింకులా? ఇదిగో అతనికి నాతోనే సరిగ్గా లింకులు పెట్టుకోవటం తెలీటం లేదు.. ఇంక టెర్రరిస్టులతో లింకులా? "

మధ్యలో రాధాబాయ్ కల్పించుకుంది.

"ఇగో తుగ్లకబ్బాయ్! నన్ను కూడా ఏమయినా అడగరాదు? నేనూ ఈ ఇంట్లో మెంబర్నే కదా? "

"ఓకే మేడమ్. చెప్పండి రాధాబాయ్ గారూ! మీ అల్లుడు విజయ్ టెర్రరిస్ట్ అని తెలిసాక మీ ఫీలింగ్స్ ఎలా ఉన్నయ్? "

"చాలా హేపీ!"

"ఆ! హేపీయా? ఎందుకు? "

"ఎందుకేంటి? అడ్డమయిన టీవీ ఛానెలోడూ కెమెరాలు పట్టుకుని నావెంటపడి నన్ను ఫేమస్ చేస్తారు కదా? "

కవిత ఆమెను గిల్లి చెవిలో మాట్లాడింది.

"నువ్వు హేపీ అని చెప్పకూడదు. అది యాంటీ సెంటిమెంటవుతుంది!"

"మరేం చెప్పాలి? "

"మా అల్లుడు టెర్రరిస్టా అని షాకయ్యాను అను"

"ఓకే ఓకే, చూడు తుగ్లక్.. ఇందాక హేపీ అని చెప్పాను కదా! అది తర్వాతది.. అంటే రెండో ఫీలింగ్ అన్నమాట. మొదటి ఫీలింగ్‌లో మాత్రం షాకయ్యాను"

"షాకెందుకు? "

"ఎందుకేముంది? నాకంటే అతనెక్కువ టీవీ ఛానెల్లో కనబడతాడు కదా!"

"ఓకే! ఒక టెర్రరిస్టుకు అత్తగారిగా ఇప్పుడు మీరెలా ఫీలవుతున్నారు? "

"చాలా గర్వంగా ఫీలవుతున్నాను. టెర్రరిస్టుకి అత్తగారిగా నాకు చాలా బాధ్యతలుంటాయన్నట్లు- అంత మంచి టెర్రరిస్ట్‌గా మా అల్లుడిని తీర్చిదిద్దినందుకు ఎంతో శాటిస్‌ఫాక్షనన్నట్లు! నేను కాలేజీ రోజుల్లో ఫేషన్ షో క్యాట్‌వాక్ చేసి నెంబర్‌వన్ అనిపించుకున్నప్పుడు కలిగిన ఫీలింగ్స్ ఇప్పుడూ కలుగుతున్నాయ్!"

"వావ్! మీరు కాలేజ్ డేస్‌లో క్యాట్‌వాక్ చేసేవారన్నమాట!"

"యా! చానా షోక్‌తో చేసేదాన్ని"

"ఆ క్యాట్‌వాక్ ఇప్పుడు మా తుగ్లక్ టీవీ చానెల్ కోసం ఒకసారి చేసి చూపిస్తారా మేడమ్? "

"ఓ! ఇప్పుడే చేస్తా" అంటూ క్యాట్‌వాక్ మొదలు పెట్టేసరికి కవిత అడ్డుపడింది.

"మమ్మీ! మరీ చిల్లరగా ఉంటుంది. చేయకు!"

"ఈ ఛానెల్ కూడా చిల్లర ఛానెలేగా.. ఫరవాలా!" అంటూ క్యాట్‌వాక్ చేస్తూంటే కవిత తల కొట్టుకుంది. అప్పుడే తుగ్లక్ ఛానెల్ టీవీలో కనిపించింది మరో విజువల్. న్యూస్‌రీడర్ మరో జర్నలిస్టుతో ఇదే మేటర్ మాట్లాడుతోంది-

"ఇప్పుడు మా తుగ్లక్ టీవీ ప్రత్యేకంగా స్పెషల్ టీమ్స్ పంపించి ఈ టెర్రరిస్ట్ ముస్తాక్ అహ్మద్ ఉరఫ్ విజయ్ గురించి ఎన్నో భయంకరమైన వివరాలు సేకరించగలిగింది. ఈ బ్రేకింగ్ న్యూస్ వివరాలన్నీ తుగ్లక్ ఛానెల్ టీవీ ప్రేక్షకులకు అందించడానికి సిద్ధంగా ఉన్నాం.."

"ప్రశ్నల పాండూ! ఈ భయంకరమైన టెర్రరిస్ట్ విజయ్ గురించి నువ్ సేకరించిన సమాచారం ఏమిటి? "

వెంటనే ప్రశ్నల పాండు తెర మీదకొచ్చాడు.

"వెంగమాంబా! షుమారు మూడుగంటల క్రితం పోలీసులు విజయ్ అనే డ్రెడెడ్ టెర్రరిస్టుని రామ్ భరోసా అపార్ట్‌మెంట్స్‌లో అరెస్టు చేసి ఇంటరాగేట్ చేస్తున్న



తీరు ఎన్నో ప్రశ్నలు రేకెత్తిస్తోంది వెంగమాంబా!

ముస్తాక్ అహ్మద్ అనే పేరుగల టెర్రరిస్ట్- విజయ్- ఒకరేనా? అయితే పోలీసులు ఆ విషయం ఎందుకు ధ్రువపరచటంలేదు? ఒకవేళ ఒకరే అయితే పోలీస్ స్టేషన్‌కు అతి సమీపంలోనే అతను టెర్రరిస్ట్ కార్యకలాపాలు నిర్వహిస్తూంటే పోలీసులెందుకు ముందే చర్యలు తీసుకోలేదు? విజయ్‌ను అదుపులోకి తీసుకోకుండా స్వయంగా ఒక మంత్రిగారే అడ్డు పడుతున్నట్లు అందరూ అనుకుంటున్నారు! మరి ఆ మంత్రి ఎవరు? తదితర ప్రశ్నలకు ఇప్పటికీ సమాధానం లేదు. అసలు ప్రశ్నేమిటంటే విజయ్ పోలీసుల ప్రశ్నలకు సమాధానమిస్తున్నాడా? అనే ప్రశ్న ప్రశ్నార్థకంగానే మారింది.

అసలిన్ని కాంప్లికేషన్స్ ఉన్నా ఈ కేసుని సీబీఐకి ఎందుకు బదిలీ చేయలేదు? అన్న ప్రశ్న ప్రశ్నగానే ఉండిపోయింది వెంగమాంబా! ఒక మంత్రే కరుడుగట్టిన ఆ నేరస్థుడికి రక్షణ కల్పిస్తున్నాడన్న వార్తల నేపథ్యంలో.. అసలు, పోలీసులు ఈ టెర్రరిస్టుని ప్రశ్నిస్తోన్న తీరు మరెన్నో ప్రశ్నలకు ప్రశ్నగా మిగిలిపోయింది. ఈ కార్యకలాపాలు పోలీసులకు ముందునుంచే తెలుసా? ఇంకెవరెవర్కి ముఠాతో సంబంధాలున్నాయ్? ఈ ముఠా గురించి బిన్ లాడెన్ ఏమంటున్నాడు? ముంబయ్ పేలుళ్లకు ఈ టెర్రరిస్టుకీ ఏమైనా సంబంధం ఉందా? ఇలా సమాధానం దొరకని ఎన్నో ప్రశ్నలకు ఎప్పటికయినా సమాధానం దొరుకుతుందా అని ప్రజలు పదే పదే ప్రశ్నిస్తున్నారు వెంగమాంబా! ఈ ప్రశ్నకు బదులేది అనడుగుతున్నారు"

"థాంక్యూ ప్రశ్నల పాండూ!"

"మా తుగ్లక్ టీవీ ప్రేక్షకులకు ఇప్పుడు మరో సెన్సేషనల్ న్యూస్ అందించడానికి మా స్పెషల్ ఇన్వెస్టిగేషన్ టీమ్ నెంబర్-టూ ఇన్‌ఛార్జి శంకరగిరి మల్కాజ్‌గిరిలో సిద్ధంగా ఉన్నారు."

"శంకరగిరీ! ఆల్‌ఖైదాతో లింకులున్నట్లు భావించబడుతున్న సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ విజయ్ ఎప్పటినుంచో నేరాలకు పాల్పడుతున్నట్లు నీ దగ్గరున్న ఆధారాలేమిటి?"

"వెంగమాంబా! అలాంటి ఆధారాల కోసం మన తుగ్లక్ ఛానెల్ టీమ్ ముమ్మరంగా చేసిన ప్రయత్నాలు ఫలించాయ్. పోలీస్ డిపార్ట్‌మెంట్‌కి కూడా దొరకని ఒక కీలకమైన వ్యక్తిని మన టీమ్ ట్రాక్ చేసి, ట్రేస్ చేయటం జరిగింది వెంగమాంబా! ముస్తాక్ అహ్మద్ అనే విజయ్ ఎంత ప్రమాదకరమైన టెర్రరిస్టో, అతనికి ఎన్ని నేరాలతో సంబంధం ఉందో ప్రత్యక్షంగా చూసిన డప్పు శీను ఇప్పుడిక్కడే ఉన్నాడు వెంగమాంబా!"

"డప్పు శీనుగారూ.. విజయ్ అనే టెర్రరిస్ట్ గురించి మీ దగ్గర ఎలాంటి సమాచారం ఉంది?"

వెంటనే కెమెరా డప్పు శీను మీదకు ఫోకస్ అయింది. డప్పు శీను నోటితో దరువేశాడు.

*(మిగతా వచ్చే సంచికలో...)*

# SVS హాస్పిటల్

మహబూబ్‌నగర్. 08542-270603, 273333

## రాజీవ్ ఆరోగ్యశ్రీ బీమా పథకం



రాష్ట్ర ప్రభుత్వం రూపొందించిన రాజీవ్ ఆరోగ్యశ్రీ బీమా పథకం ద్వారా చేపట్టే ఆరోగ్యశ్రీ సదుపాయం మహబూబ్‌నగర్ **SVS హాస్పిటల్** నందు కల్పించబడినది.

## ఆరోగ్యశ్రీ ద్వారా వర్తించే చికిత్సలు, శస్త్రచికిత్సలు

- సాధారణ శస్త్ర చికిత్సలు:
- స్త్రీలకు సంబంధించిన వ్యాధులకు చికిత్సలు
- ఎముకల శస్త్ర చికిత్సలు
- ప్రమాద గాయాలు
- కృత్రిమ భాగాల అమరిక
- అత్యవసర చికిత్స
- సాధారణ వ్యాధుల చికిత్స
- అంటువ్యాధుల చికిత్స
- చిన్నపిల్లల అత్యవసర చికిత్స
- నవశిశువు అత్యవసర చికిత్స
- చిన్నపిల్లల చికిత్స
- ఊపిరితిత్తుల వ్యాధుల చికిత్స
- చర్మవ్యాధుల చికిత్స

**Management, S.V.S. హాస్పిటల్**

# కాప్షన్ మీదే - 22



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!
బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి, పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 19


చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082
e-mail : vipula.chatura@gmail.com


ఉత్తమ వ్యాఖ్య :

నాకు సముచిత స్థానం ఇవ్వకపోతే
పార్టీలోనే ఉంటూ బుసకొట్టి నసపెడతాను

-కె.వి. లక్ష్మణరావు,
మానేపల్లి, తూ. గో. జిల్లా



## కాప్షన్ మీదే -21

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

నువ్వు ఊదితే ఎప్పుడూ నేనే డాన్స్ చేయాలా?
ఇప్పుడు నే ఊదుతా.. నువ్వు డాన్స్‌చెయ్యి!

– వి.ఎస్.ఆర్.కె.ప్రసాద్, విజయవాడ

పుట్ట కాదిది నాగన్నా...
నా పొట్ట కొడతావేమన్నా...

– నెల్లుట్ల సుదర్శనరావు,
ఆస్టిన్ (యు.ఎస్.ఎ)

ఏమయ్యో.. చవితి, పంచమి అంటూ
తెగాడిస్తున్నావ్ ..
ఇప్పుడే బ్లూక్రాస్‌కి ఫిర్యాదు చేస్తా!

-ఎస్.వి.రమణి, హైదరాబాద్

కాలం కలిసి రాకపోతే
నాగ స్వరమే నాగుబామై కాటేస్తుంది

-వోలేటి శ్రీనివాసరావు, విజయనగరం




# సుఖం

టాంక్‌బండ్ 32 కథలు

విశ్వేశ్వరరావు న్యూయార్క్‌లోని ఓ ఖరీదైన ఫ్లాట్‌లో కూర్చుని కిటికీ గుండా బయటకు చూస్తున్నాడు. ఎటుచూసినా నింగిని తాకే ఆకాశహర్మ్యాలు! కిందకు చూస్తే రిబ్బన్లలా కన్పిస్తున్న రోడ్లు, వాటిపై చీమల బారులా సాగిపోతున్న కార్లు!!

భారంగా నిట్టూర్చాడాయన.

ఉదయం నుంచీ అదే దృశ్యం! చూసీ చూసీ బోర్‌గా ఉంది. టీవీలోనూ రొటీన్ కార్యక్రమాలు! మాట్లాడే మరో ప్రాణిలేని ఆ ఫ్లాట్లో తనూ ఓ వస్తువులా మిగిలిపోయానేమోనన్న భయం పట్టుకుందాయనను. ఉదయం కొడుకు, కోడలు ఉద్యోగాలకీ,

మనవడు స్కూలుకి వెళ్లిపోగానే ఒంటరితనమనే భూతం విశ్వేశ్వరరావును నలిబిలి చేసేస్తోంది. బయటకు వెళ్దామన్నా వీల్లేదు. కిలోమీటర్లు నడిచినా నరమానవుడు కన్పించడు. ఎవరికివారు కిటికీలు సహా మూసేసుకుని కొంపలు మునిగిపోతున్నట్టు వాహనాల్లో రయ్యిన పోతుంటారు. అక్కడికీ తను న్యూయార్క్ వచ్చిన మర్నాడు పిల్లలు బయటకు వెళ్లాక- ఫ్లాట్ లాక్‌చేసి రోడ్డుపై ఓ గంటసేపు నడిచాడు. రోడ్లపై కార్లేతప్ప మనదేశంలోలా మనుషులేరి? ఉసూరుమంటూ ఫ్లాట్‌కు తిరిగొచ్చాడు. ఆ రాత్రి కొడుకు గట్టిగానే క్లాస్‌పీకాడు. ఒంటరిగా రోడ్లమీద తిరగడం డేంజరంటూనే మరెప్పుడూ అలా తిరగొద్దని హుకుం కూడా జారీచేశాడు.

దాంతో ఒంటరిగా ఫ్లాట్‌లోనే పడుంటున్నాడు. కాసేపు చదువుకోవడం, కొంచెంసేపు టీవీ.. ఆ తర్వాత చేయడానికి పనేముంది? మాట్లాడేందుకు మనిషేడి? కొడుకు, కోడలూ వచ్చాక వాళ్ల హడావిడి వాళ్లకే సరిపోతుంది! మనవడు రాగానే చదువంటూ స్టడీరూమ్‌లో సెటిలైపోతాడు. తనని పలకరించే దిక్కేది? 'గుడ్మాణింగ్', 'గుడ్‌నైట్' లాంటి పొడిమాటలు తప్ప మరేమీ ఉండవు తమ మధ్య. అలాగని వాళ్లను తప్పుపట్టాల్సిందీ లేదు. ఉద్యోగాల ఒత్తిడి! వాళ్లుమాత్రం ఏంచేస్తారు?

కిచెన్‌లోకి వెళ్లి సూప్ తయారుచేసి తెచ్చుకుని కిటికీదగ్గర తాగుతూ కూర్చున్నాడు విశ్వేశ్వరరావు. మనసు మళ్లీ ఆలోచనల సుడిలో పడి కొట్టుకుపోసాగింది. పిచ్చిమానవులు సుఖసంతోషాలనేవి డబ్బులోనే ఉంటాయని అనుకుంటారు. మొన్నటిదాకా తనూ అలాగే అనుకునేవాడు. నిజంగా అవి డబ్బులో ఉన్నాయా? ఆ విషయానికివస్తే ప్రస్తుతం తనకేం లోటు లేదు. అమెరికాలో ఉద్యోగాలు చేస్తున్న కొడుకు- కోడలు ఎంత కావాలంటే అంత ఇస్తారు. స్టేట్ గవర్నమెంట్ మాజీ ఉద్యోగిగా తనకు దండిగా పింఛనూ వస్తుంది. ఒకప్పుడు డబ్బుకు అల్లాడిన మాట నిజమే గానీ ప్రస్తుతం ఆ బాధ లేదు. అయితేనేం? తనిప్పుడు సుఖంగా ఉన్నాడా? లేడే?

సుఖం అనేది మనసుకు సంబంధించిన విషయమని అంటారు. పోనీ అలా చూసినా తన మనసేమన్నా ఇప్పుడు ఆనందంగా సంతోషంగా ఉందా?

కోట్లు విలువచేసే వజ్రాలు గంపనిండా ఇచ్చి, 'ఇవన్నీ నీవే! కానీ నువ్వు మాత్రం ఈ గది దాటి రాకూడదు, ఎవ్వరితో మాట్లాడకూడదు' అన్న కండిషన్ పెట్టి తలుపులు బిగిస్తే ఎవడైనా ఎంతసేపు సంతోషిస్తాడు? ఓ రెండు గంటల తర్వాతైనా 'అయ్యా.. మీ వజ్రాలకీ మీకూ ఓ దణ్ణం! నా మానాన నన్ను పోనిద్దురూ' అంటాడు. తన పరిస్థితీ అచ్చం అలాగే ఉంది. పేరుకు ప్రపంచంలోనే గొప్పదేశంలో, గొప్ప నగరంలో ఉన్నాడు.. డబ్బుకు తడుముకోవాల్సిన పనిలేదు. కానీ ఏది సుఖం? ఏది సంతోషం?

ఉన్నట్టుండి అతని మనసు హైదరాబాద్ పరుగుతీసింది. సాయంత్రం అయ్యేసరికి తన మిత్రబృందం అరడజను మందీ ట్యాంక్‌బండ్ బెంచీలపై తిష్టవేస్తారు. అందరూ సీనియర్ సిటిజన్సే! హైదరాబాద్ ట్రాఫిక్కు, కాలుష్యం సమస్యల నుంచి అంతర్జాతీయ ఒప్పందాల వరకూ తమమధ్య ఎన్ని టాపిక్సో నడిచేవి. నవ్వుకునేవారు, వాదించుకునేవారు! కొందరు రాజకీయాల గురించి.. దేశంలో అవినీతి గురించి తూర్పారపట్టేవారు. రాత్రి తొమ్మిదిదాకా తెలియకుండానే సమయం గడిచిపోయేది. ఆ తర్వాత ఇంటికొచ్చి స్నానపానాదులు ముగించి పడుకునేసరికి పదకొండు! ఉదయాన్నే ఐదింటికి లేచి ఓ రెండుగంటల పాటు నడక! నడకకూ

కొందరు మిత్రులున్నారు.. పిచ్చాపాటీ మాట్లాడుతూ అనాయాసంగా నడిచేవా రంతా కలసి!

ఏడింటికి ఇంటికొచ్చేసరికి పుల్లమ్మ పాలు తెచ్చేది. 'పుల్లమ్మా.. పాలల్లో నువ్వు మస్తు నీళ్లు కలుపుతున్నావు.. నీకు డబ్బు లివ్వను' అనేవాడు తను.

'సిటీల పాలకంటే నీళ్లుదొరుకుడే కష్టం సారూ' అంటూ పోయేది పుల్లమ్మ. తను గొణుక్కుంటూ ఇంట్లోకి వచ్చి కాఫీ తయారు చేసుకునేసరికి పక్కింటి పరమే శ్వరరావు వచ్చేవాడు పేపరు చూడ్డానికి! ఇద్దరూ కాఫీ తాగుతూ- పేపరు చెరోపేజీ చదువుకుంటూ, రాజకీయాల గురించి వాదించుకుంటూ తొమ్మిదింటిదాకా గడిపే వారు. పరమేశ్వరరావు అటుపోగానే తను స్నానసంధ్యలు పూర్తిచేసి- కాసిన్ని బియ్యం, పప్పు ఎలక్ట్రిక్ కుక్కర్లో పెట్టే వాడు. వంటపూర్తయ్యే సమయానికి ఎదు రింటి పాపాయమ్మగారు అంత కూరో, పచ్చడో చిన్న కప్పులో పెట్టుకుని 'అన్న య్యగారూ..' అంటూ వచ్చేది.

'రోజూ ఎందుకమ్మా ఇవి?' అంటూనే తీసుకునేవాడు తను. ఆవిడ తనకోడలి గురించి, తన కొడుకును ఆమె చెవులు ప ట్టి ఆడిస్తున్న తీరుగురించీ కాసేపు చెప్పి ఓ అరగంట టీవీచూసి వెళ్లిపోయేది. ఆ సరికే తను భోజనం పూర్తిచేసి కూర తెచ్చి న కప్పు కడిగి ఆమె చేతికిచ్చేవాడు.

ఆ తర్వాత ఓ గంట నిద్ర!

మూడు మూడున్నరకు లేచి, ఓ కప్పు కాఫీతాగి ఇస్త్రీ ప్యాంట్ షర్ట్ వేసుకుని బయటకొచ్చేవాడు. అప్పటికే తమ ఇంటి ప్రహరీ గోడపై కూర్చుని జామపిందెలు తెంపుతున్న పిల్లకాయలను తిట్టేవాడు.. వాళ్ల వెంటపడేవాడు.. వాళ్లు నవ్వుకుంటూ పారిపోతుంటే వాళ్లపెద్దల్ని అటేడుతరాలు ఇటేడుతరాలు దులిపేస్తూ ఇంటికి తాళాలు వేసి వీధిలోకి వచ్చేవాడు. వీధిచివర పాన కాలు హోటల్లో వేడిగా పూరీనో పకోడీనో లాగించి, ఆటో ఎక్కి నాలుగున్నరకల్లా ట్యాంక్‌బండ్‌కు చేరేవాడు.. ఇక మాటక చేరీ మొదలు! అలా తెలియకుండానే హైదరాబాద్‌లో సమయం గడిచిపోయేది.

మరి ఇక్కడ అమెరికాలో సమయమే గడవదే? అయ్యో ఇంకా టైము నాలు గేనా? పిల్లలు రావడానికి ఇంకా కనీసం మూడుగంటలు పడుతుంది. సూప్‌తా గిన కప్ సింకులో పడేసివచ్చి పడకమీద నాడుం వాల్చాడు..

ఆ పడుకోవడం పడుకోవడం మళ్లీ మెళకువ వచ్చేసరికి- 'ఏంటి నాన్నా. ఒంట్లో బాగాలేదా? ఎనిమిదైంది..' అంటూ మంచంపైకి వంగి అడుగుతు న్నాడు కొడుకు. కోడలు, మనవడూ దగ్గరే నిలబడి వింతగా చూస్తున్నారు.

చాలా సిగ్గనిపించింది.. 'సారీ' అంటూ చటుక్కున లేచాడు. కానీ లేవబోయి మళ్లీ కూలబడ్డాడు..

కొడుకు కంగారుపడుతూ 'డాక్టర్ దగ్గ రకు వెళ్దామా?' అన్నాడు.

'మామయ్యగారు వచ్చిన దగ్గరనుంచీ ఎందుకో ఏదో దిగులుగా కన్పిస్తున్నా రండీ' అంది కోడలు.

అదేంలేదన్నట్టు తల అడ్డంగా ఊపాడు విశ్వేశ్వరరావు.

ఆ రాత్రి భోజనాల దగ్గర 'రఘూ.. నువ్వూ కోడలూ ఏమనుకోవద్దు! నేని క్కడ ఉండలేను! హైదరాబాద్ వెళ్లిపో తాన్రా. టిక్కెట్టు ఏర్పాటు చేయిస్తావా?' అభ్యర్థనగా అడుగుతున్న తండ్రిని ఆశ్చ ర్యంగా చూశాడు కొడుకు.

కొడుకు కోడలు మనవడ్ని వదిలి ఒం టరిగా హైదరాబాద్‌లో ఉంటానంటాడే మిటి ఈయన అన్న భావన ఆ కళ్లలో దోబూచులాడింది.

—చంద్రప్రతాప్



రామచంద్రుడు, లక్ష్మణుడు అన్నదమ్ములు.
వారి తండ్రి శివయ్య
అందరిలాంటి మనిషి కాదు.
ఎవరిమాటా వినని
మొండిమనిషి. పైగా ముక్కోపి!
అతని కొడుకులుగా వారిద్దరూ
ఎలాంటి పరిస్థితుల్ని ఎదుర్కొన్నారు?
వ్యక్తుల ప్రవర్తనలోని
విపరీత పోకడల్ని
మనో విశ్లేషణాత్మకంగా చిత్రించిన నవల
పి.చంద్రశేఖర అజాద్
**పావురం** అక్టోబరు చతుర కానుక!

## 1955 ఆగస్ట్ 14

శివయ్య ముఖం గంభీరంగా ఉంది. అతన్ని తెలియనివారు చూస్తే ఈ మనిషికి ఇంతకుముందే ఎవరితోనో గొడవ జరిగి ఉంటుందని, ఇంకా ఆ కోపంలోనే ఉన్నాడని అనిపిస్తుంది.

రెండోసారి చూసినప్పుడు ఇతని ముఖం ఇంతేనా అనిపిస్తుంది. ఎప్పుడూ కోపంతో నుదురు చిట్లిస్తాడేమో.. మూడు నిలువు గీతలు కనిపిస్తాయి. అవి నామాల్లాకాక క్రోధారుణ రేఖల్లా ఉంటాయి.

అతని పేరు తెలుసుకున్నాక మాత్రం కచ్చితంగా మూడోకన్ను ఇతనికి ఉండుంటుంది అని నిర్ణయానికి వస్తారు.

ఇప్పుడతను ఓ చిన్న ఆసుపత్రి ముందు వున్నాడు. 'లేబర్' రూమ్‌లో అతని భార్య పెద్దగా కేకలు పెడుతోంది. అవేమీ అతన్ని కంగారు పెట్టటం లేదు.

పార్వతికి నొప్పులు మొదలయినపుడు శివయ్య పక్కనే ఉన్నాడు. అప్పుడు రాత్రి పదకొండు గంటలు.

నవారు మంచంమీద పడుకుని పైకప్పుకేసి చూస్తున్నాడు. అప్పటికప్పుడు వెళ్లి ఓ రిక్షా తీసుకువచ్చాడు. అందులో పార్వతి ఎక్కాక పక్కన కూర్చున్నాడు.

ఆసుపత్రిలో చేర్చుకున్నారు.

'ఇది తొలికాన్పు. మిమ్మల్ని మళ్లీ చూస్తానో లేదో తెలియదు' అందామనుకుని ఆగిపోయింది పార్వతి.

అప్పుడు ఏమంటాడో తెలియదు.

ఒక్కోసారి అతను అనే మాటలు పురిటి నొప్పులకంటే ఎక్కువ బాధ పెడతాయి.

నిజానికి పుట్టింటివారు పురుడుపోసి పంపించాలి. పెళ్లయిన మూడు నెలలకి పార్వతినాన్న శివయ్యకి ఏదో సలహా ఇవ్వబోయాడు. శివయ్యకి సలహాలంటే చాలా కోపం. అతని మావకు ఉచిత సలహాలు ఇవ్వటం చాలా ఇష్టం. 'నాకు అనవసరంగా సలహాలు ఇవ్వటం నచ్చదు' అని మధ్యలోనే అన్నాడు.

'ఏదో పెద్దవాడ్ని చెబుతున్నాను. అమ్మాయిని ఇచ్చాను. నా కూతురి బాగోగులు గురించి ఆలోచన ఉంటుందికదా' అన్నాడు పార్వతినాన్న.

'అది పెళ్లి చేయకముందు ఉండాలి' అని ఆయన దగ్గర్నుంచి లేచి పార్వతి దగ్గరకు వచ్చాడు.

'నువ్వు మీ నాన్న దగ్గరుంటావో, నా దగ్గరుంటావో తేల్చుకో' అని బయటకు వెళ్లిపోయాడు.

శివయ్య దగ్గరే పార్వతి ఉండాలని నిర్ణయించుకుంది. ఆ తర్వాత నెల తప్పిందని ఎలానో తెలిసి పార్వతి తల్లి వచ్చి ఇంటికి తీసుకువెళ్తానంది.

'పార్వతి ఇల్లు ఇదే. ఎక్కడికీ రాదు'

'అదికాదు అల్లుడుగారూ. నలుగురూ ఏమనుకుంటారు? మేం వాళ్లు అడిగే ప్రశ్నలకి ఏం చెప్పుకోవాలి' అందామె.

'నలుగురి కోసం తీసుకెళ్తారా? అవసరంలేదు' అన్నాడు శివయ్య.

'మేం తప్పు చేసుంటే మన్నించు బాబు' అందావిడ.

'తప్పు చేసింది మీరు కాదు. మీ ఆయన. ఆయనకి చెప్పండి.. మీ కొడుకుల బాగోగులు చూసుకొమ్మని. పార్వతిని తీసుకెళ్తే మళ్లీ పంపించనవసరంలేదు. మీ ఇంటి దగ్గరే ఉంచుకోండి' అంటూ బయటకు వెళ్లాడు విసురుగా.

ఆమె బుగ్గలు నొక్కుకుంది 'ఇంత ఘోరమా' అనుకుంటూ. ఆ తర్వాత ఎవరూ ఆ ఇంటికి రాలేదు.

ఇప్పుడు శివయ్యకి పుట్టబోయేది అమ్మాయా అబ్బాయా అనే సందేహం వచ్చింది.

శివయ్యను చిన్నప్పుడు ఎవరో శాపనార్థాలు పెట్టారు.

'శివయ్యా! నీకు అమ్మాయిలే పుడతారు. అప్పుడు నీ ముఖం చూడాలనుంది. అంతే కాదు. ఆ పిల్లపెళ్లి నువ్వు చేసేదాకా నాకు బతకాలనుంది' అంది ఒకావిడ.

ఆవిడకు అలాంటి అవకాశం కలగలేదు.

శివయ్య పెళ్లికి రెండు సంవత్సరాల ముందుపోయింది.

'కొంపతీసి అది నా కూతురిగా పుడు తుందా?' అనుకున్నాడు. సరిగ్గా అప్పుడే నర్సు వచ్చి చెప్పింది 'మగపిల్లాడు' అని.

శివయ్యలో సంతోషం కనిపిస్తుందేమో నని వెతుక్కుందామె. అలాంటిదేం కనిపిం చకపోవటంతో ఆశ్చర్యంగా వెనక్కి వెళ్లింది.

శివయ్య లోపలకి వెళ్లి ముఖం చిట్లించి చూశాడు- కొడుకుని. మంచి రంగు- ఒత్తైన జుట్టుతో మెరిసిపోతున్నాడు. పార్వతికేసి తిరిగాడు.

'రాత్రి పదకొండు గంటలకి వస్తే ఉదయం పదకొండు గంటలకి కంటావా?' అన్నట్లనిపించిందామెకు.

ఏమీ మాట్లాడకుండా వెళ్లిపోయాడు.

చివుక్కుమనిపించింది. పిల్లవాడికేసి చూసి అనుకుంది, 'ఇంకొక్కరోజు ఆగలేక పోయావా? సొతంత్రం వచ్చిన రోజు పుట్టుంటే- దేశమంతా పండగ చేసుకునే వారు కదా!'

★ ★ ★

పార్వతి పుట్టింటివారికి శివయ్యకి అబ్బాయి పుట్టాడని తెల్సింది. ఇంట్లో అందరూ సమావేశమయ్యారు. చూడ్డా నికి వెళ్లాలా? వద్దా? అని సందేహించారు.

ఈ సమస్యమీద చాలా చర్చ జరిగింది.

పార్వతి నాన్న మౌనంగా కూర్చున్నాడు.

అతనికి శివయ్య ఇచ్చిన షాక్ అంతకు ముందు ఎవరూ ఇవ్వలేదు. పైగా అతని దగ్గరికి చాలామంది సలహాలు ఇవ్వటానికి కాకుండా అడగటానికి వచ్చేవారు. అది కొన్ని సంవత్సరాలుగా జరుగుతుండటంతో ఆయనకి అదే అలవాటయిపోయింది.

ఆయన పక్కన ఎవరన్నా కూర్చుని మెల్లగా ఇడ్లీలో, పూరీలో తింటుంటే 'అలా కొంచెం కొంచెం తినకూడదు. చూసేవారికి తిండి ఎక్కడ అయిపోతుందోనని, మళ్లీ దొరకదన్నంత జాగ్రత్తగా తింటున్నారను కుంటారు' అని అంటాడాయన. అంతేగాక ఇడ్లీని రెండు ముక్కల్లో పూరీని రెండు మడతలు చేసి తిని చూపించేవాడు.

'మీరు అలా చెప్పకూడదు. ఎవరి పద్ధ తుల్లో వారు తింటారు. అలా నోట్లో కుక్కుకుంటే ఆబగా తిన్నారని అనుకోరా?' అని పార్వతితల్లి మొత్తుకునేది.

'ఎవరో ఏదో అనుకుంటారని మనం ఇ తరులకు చెప్పేది చెప్పకుండా మానకూ డదు. ఎలా తెలుస్తాయి ఏమీ చెప్పకపోతే' అనేవాడు. మనుషులకి రకరకాల అభిప్రా యాలు ఉంటాయని ఆయనకి తెలియక కాదు. తను చెప్పే సలహాలు అందరూ విని, అలా నడుచుకుంటారనీ ఆయన అనుకోడు.

అభిప్రాయం, సలహా.. ఏ పేరయినా కావచ్చు దాన్ని మనం చెప్పామా లేదా అనేదే ఆయనకి కావాలి.

చాలామంది ఆయన సలహాల్లో తమకు నచ్చింది మాత్రం తీసుకునేవారు. అంతే గాని ఎప్పుడూ తగాదా పడలేదు. అలాం టిది 'శివయ్య' దెబ్బకు ఆయన దడిసిపో యాడు. ఇంకెవరికీ సలహాలు ఇవ్వకూడ దని అనుకున్నాడు. అది అంత సులభం కాదని అర్థమయింది. అది వేరే విషయం.

ఇప్పుడు మాత్రం మాట్లాడే సమయం కాదని అతనికి అర్థం అయిపోయింది.

'అమ్మా ఇంతకుముందు నువ్వు వెళ్లావు. అవమానించి పంపించాడు. ఇప్పుడింకో సారి వెళ్లి అవమానం పాలవుతానంటే నీ ఇష్టం' అన్నాడు పెద్ద కొడుకు నారాయణ.

రెండో కొడుకు నాగేశ్వరరావు కూడా అలాంటి అభిప్రాయమే చెప్పాడు.

'అన్నయ్య చెప్పింది నిజమే. ఆలోచించు' అన్నాడు.

'ఎవరం వెళ్లకపోతే పిల్ల బాధ పడుతుంది' అందామె.

'పోనీ నాన్నా, నువ్వూ వెళ్లండి' అన్నాడు నాగేశ్వరరావు.

అప్పుడు పార్వతి నాన్న కల్పించుకున్నాడు. 'నా వల్లనే ఇదంతా జరిగింది. నన్ను చూస్తే అల్లుడుగారు ఇంకా కోపం తెచ్చుకుంటారు. తగాదాలు పెంచుకోవటం ఎందుకూ? ' అన్నాడు.

'తగాదా మనం పడలేదు నాన్నా. అతను పడ్డాడు. నన్ను అడిగితే అతనంతట అతను పిలిచేదాకా మనం వెళ్లకపోవటం మంచిది' అన్నాడు నారాయణ. దాంతో పార్వతితల్లికి కోపం వచ్చింది.

'మేం ఉన్నంతకాలం నాలుగు మాటలన్నా పడాలి. ఆ పిల్లని కన్నాం. పైగా మాకుంది ఒక్కకూతురే. మేం పోయాక మీరు పార్వతి ఇంటికి వెళ్లొద్దు. వెళ్లినా, వెళ్లకపోయినా మేం చూడొచ్చామా' అంది నిష్ఠూరంగా.

పిల్లలందరికీ తల్లి అంటే ప్రేమ, గౌరవం ఉన్నాయి.

'నువ్వలా మాట్లాడితే మాకు బాధగా ఉంటుందమ్మా. మాకు మాత్రం చెల్లిపై ప్రేమ లేదా? మొత్తం సంబంధాలు తెగిపోతాయేమోనని బాధపడుతున్నాం' అన్నారు.

అలా చాలాసేపు అన్ని కోణాల్నుంచి చర్చించాక 'అమ్మ'ని మాత్రమే పంపించాలనుకున్నారు.

పార్వతి 'తల్లి' భయం భయంగానే వచ్చింది.

అప్పుడు శివయ్య ఇంట్లో లేకపోవటంతో ఊపిరి పీల్చుకుంది. మనవడ్ని చూసి మురిసిపోయింది.

'అమ్మాయి మనవడికి పేరేం పెట్టాలనుకుంటున్నారు? ' అంది.

'ఆయన ఏమనుకుంటున్నారో నాకు తెలియదమ్మా' అంది.

'ఏదొకటి అల్లుడే పెట్టుకుంటాడు. నువ్వు కల్పించుకోవద్దు' అంది.

'నాకు అంత ధైర్యం కూడానా? ' అంది పార్వతి. ఆమెకు బాధ ఎగతన్నుకొచ్చింది.

'అమ్మా మనవడ్ని చూశావుకదా. ఇంక బయలుదేరతావా? ' అంది కన్నీళ్లు దాచుకుని, తలదించుకుంటూ.

'నేను వచ్చి వెళ్లిన సంగతి తెలిస్తే మళ్లీ గొడవ పెట్టుకుంటాడేమో! ఎందుకైనా మంచిది అల్లుడు వచ్చాకే వెళ్తాను' అంది.

పార్వతి మాట్లాడలేదు. కళ్లవెంట నీళ్లు కారిపోయాయి.

'నువ్వు బాధ పడుతుంటే నేను చూడలేను. మీరిద్దరూ బాగుంటే చాలు' అంది.

రాత్రి ఇంటికి వచ్చాడు శివయ్య. అత్తగారిని గమనించలేదు. ఆమె కూడా సాధ్యమైనంత వరకు అల్లుడికి ఎదురుపడకూడదని నిర్ణయించుకుంది.

పార్వతి గుమ్మం ముందు కాపలా కాసి- శివయ్యని దూరంగా చూసి, అమ్మకి చెప్పడంతో దొడ్లోకి వెళ్లింది.

భోజనం చేసేదాకా శివయ్యతో పార్వతేం మాట్లాడలేదు. గదిలోకి వెళ్లి పడుకున్నాక మంచినీళ్ల చెంబు పక్కన పెట్టి, మెల్లగా అంది, 'మా అమ్మ వచ్చింది' అని.

ఒక్క ఉదుటున లేచి కూర్చుని, 'ఇప్పటిదాకా ఎందుకు చెప్పలేదు' అన్నాడు.

పార్వతి వణికిపోతుంటే చూసి-

'ఉదయం బయలుదేరుతున్నావా? ' అన్నాడు

'నేను వెళ్లను, మా అమ్మ వెళ్లిపోతుంది' అంది భయంగా.

'ఇంకెవరు వచ్చారు? '

'అమ్మ ఒక్కతే వచ్చింది'

'మన అబ్బాయి మీద వాళ్ల నీడపడటం కూడా నేను సహించను'

'నాకు తెలుసు'

'ఏంటి నీకు తెలిసేది. అప్పుడు చెప్పాను.. ఇప్పుడూ చెబుతున్నాను- రేపు నువ్వు పుట్టింటివారిని ఇంటికి రానీయలేదని, మాట్లాడనివ్వలేదని, అమ్మా-నాన్నల దగ్గరికి పంపించలేదని ఏడ్చినా, మొత్తుకున్నా నాకు ఇష్టం ఉండదు. కావాలంటే పిల్లాడ్ని తీసుకెళ్లి వాళ్లతోనే ఉండిపో' అన్నాడు.

'అలా అనుకుంటే మీతో వచ్చేదాన్ని కాదు. నాకు మిమ్మల్ని మించి ఎవరూ లేరు. ఎవరిమీదా నాకు ప్రేమలేదు. మీరు నమ్మినా నమ్మకపోయినా' అన్నదామె.

అప్పుడే పిల్లవాడు గుక్కపట్టి ఏడ్చాడు.

పార్వతి వాడిని భుజాన వేసుకుంది. మెల్లగా ఏడుపు మాన్పించటానికి ప్రయత్నం చేస్తోంది.

'అన్నీ నువ్వే చూసుకోవాలి. కనీసం ఐదు నెలలు అక్కడుంటే కాస్త పెద్దయ్యేవాడు. అప్పుడు నీకు వాడ్ని పెంచటం సులువయ్యేది' అంది పార్వతితల్లి ఇంటికి వెళ్తూ.

'నా గురించి మీరు బాధపడొద్దు. నాన్నకి- అన్నయ్యలకి అదే చెప్పు' అంది పార్వతి. ఆమె తలూపి 'పెళ్లికి ముందు అబ్బాయికి కోపం అన్నారుగాని, ఇంత ముక్కోపి అని తెలియదు. మన కర్మ' అని వెళ్లిపోయింది- ముక్కు చీది.

★ ★ ★

పార్వతితల్లి వచ్చి వెళ్లిందిగాని, పార్వతి అత్తగారు మాత్రం మనవడ్ని చూడటానికి రాలేదు.

ఆమె నెల్లూరు జిల్లాలో ఓ మారుమూల పల్లెటూర్లో కూతురు దగ్గర ఉంటోంది. శివయ్య తండ్రి చనిపోయాడు.

పార్వతి అమ్మా-నాన్నలకి ఒక్కతే కూతురయినా మంచి సంబంధం తీసుకొచ్చే స్తోమత లేదు. నారాయణ పదోతరగతి పాసయ్యాడు. తండ్రి మంచితనం వల్ల ఓ ప్రైవేట్ కంపెనీలో చిన్న ఉద్యోగం వచ్చింది. నాగేశ్వరరావు మాత్రం ఇంటర్మీడియట్ పాసయ్యాడు.

అతన్ని ఇంజనీరింగ్ చదివించాలా వద్దా అనే ఆలోచనలో ఉన్నారు. నారాయణ మాత్రం కష్టపడి తమ్ముడ్ని చదివిద్దాం అన్నాడుగాని తండ్రి ఒప్పుకోలేదు.

ముందు అమ్మాయి పెళ్లి చేయాలన్నాడు. ఎవరో ఈ సంబంధం గురించి చెప్పారు. శివయ్య కూడా పదోతరగతి చదివాడు. నారాయణలానే ఏదోక ఉద్యోగం చూసుకుని పార్వతిని పోషించుకుంటాడనుకున్నారు.

'వెయ్యి నూటపదహార్లు' కట్నంగా ఇచ్చుకున్నారు. పెళ్లికి పార్వతి అత్త, ఆడపడుచు వచ్చారు. తర్వాత శివయ్య పార్వతిని గుంటూరు తీసుకువచ్చాడు కాపురానికి.

అప్పట్నుంచి రాకపోకలు లేవు.

కనీసం పుట్టింటివారితోనన్నా సంబంధం ఉంటుందనుకుంటే అదీ తెంపేశాడు.

అమ్మ వెళ్లిపోయాక భయం భయంగానే శివయ్యని అడిగింది- 'అత్తయ్యకీ, వదినకీ ఓ కార్డుముక్క రాస్తే బాగుంటుందికదా' అని.

'ఎవరు రాయాలి? ' అన్నాడు ముందుగా. తర్వాత 'ఎందుకు రాయాలి? ' అన్నాడు

ఆ ప్రశ్నలకి సమాధానం చెప్పటానికి ధైర్యం చాలలేదు పార్వతికి.

'నాకు మీ వాళ్లయినా ఒకటే, నా వాళ్లయినా ఒకటే. నాతో ఓసారి తగాదా పడినా, ఎవరితోనయినా మాట పట్టింపు వచ్చినా.. నేను వాళ్లను పలకరించను, పట్టించుకోను' అన్నాడు.

పార్వతికి అప్పుడు ఇంకా భయం వేసింది. తన గురించి కాదు.. తమ ఇంట్లోకి వచ్చిన కొడుకు గురించి!




1958 ఆగస్ట్ 14.

పార్వతి అప్పటిదాకా తమ కొడుకుని 'కన్నా కన్నా' అని పిలుచుకునేది. ఈ మూడు సంవత్సరాల్లోనూ 'కన్నా'కి పుట్టు వెంట్రుకలు తీయించలేదు.

మధ్యలో ఓసారి అడిగింది. 'తీయిద్దాంలే' అన్నాడు శివయ్య. ఆ తర్వాత అడగటం మానేసింది.

'కన్నా'కి మాటలు నేర్పటానికి ప్రయత్నం చేస్తూ, ఓసారి 'తాత.. తాత' అనమంటూ చెబుతోంది. ఆ తర్వాత 'అమ్మమ్మ' అనాలనుకుని ఆగిపోయి పక్కకు చూసింది.

శివయ్య నిలబడి ఉన్నాడు.

మాటలు రాక స్థాణువైపోయింది.

'కన్నా'కి సంవత్సరం ఎనిమిది నెలల దాకా మాటలు రాలేదు. పార్వతీ కంగారు పడిపోయింది. మాటలు ఎలా అయినా నేర్పించాలని అన్ని ప్రయత్నాలు చేసింది. అయితే 'కన్నా'కి మాటలు రాలేదు.

మూగ- చెవిటి పిల్లవాడేమోనని అనుమానపడి డాక్టర్‌కి చూపించింది.

'శబ్దం వింటున్నాడు. గుక్కపట్టి ఏడుస్తున్నాడు. కొంతమందికి ఆలస్యంగా మాటలు వస్తాయి. మీరు ఆందోళన పడవద్దు' అన్నాడు డాక్టర్.

శివయ్యకి పిల్లవాడు మాట్లాడటం లేదనే బాధ లేదు. మొదటిసారి 'అమ్మా' అని పి

ల్లవాడు పిలిచినప్పుడు మాత్రం ఆ తల్లి పొంగిపోయింది.

'నిన్ను చూసే నేను బతుకుతున్నాను కన్నా' అనుకుంది.

'నువ్వు త్వరత్వరగా పెద్దవాడివయ్యి మీ నాన్నని మార్చాలి' అని చెవిలో గుసగుసగా చెప్పుకునేది.

అదేంటోగాని 'కన్నా'కి అన్ని మాటలూ మెల్లగా వచ్చాయిగాని 'నాన్నా' అనే మాట మాత్రం వారం రోజుల క్రితం వచ్చింది. ఈ మధ్యకాలంలో 'కన్నా'ని మూడు నాలు గుసార్లు కొట్టాడు శివయ్య. ఆ రోజే శివయ్య కొత్త చొక్కా వేసుకున్నాడు. అతనిమీద విరోచనం చేసుకున్నాడు పిల్లాడు.

'చిన్నవాడు.. వాడికేం తెలుసు?' అని గుక్కపట్టిన పిల్లవాడ్ని బయటకు తీసుకుపోయి కన్నీళ్లు పెట్టుకుంది పార్వతి. ఇలాంటివే 'కన్నా' తప్పులు.

ఆ రోజు కన్నా పుట్టిన రోజు. తలంటు పోసింది. జుట్టు దువ్వి జడలా వేసింది. శివయ్య దగ్గరకు తీసుకెళ్లి దణ్ణం పెట్టమంది. పెట్టను అన్నట్టు కన్నా తలూపాడు అడ్డంగా.

అసలే ఎరుపుగా ఉండే శివయ్య కళ్లు ఇంకా ఎరుపెక్కుతుంటే కన్నాని చంకన వేసుకుంది.

'ఈ సంవత్సరం పుట్టు వెంట్రుకలు ఇద్దాం. చుట్టుపక్కలవారు మీ అబ్బాయి పేరేమిటని అడుగుతున్నారు. ఏదో ఒక పేరు చెప్పండి' అంది పార్వతి.

ఏ కళనున్నాడో శివయ్య తలూపాడు.

ముందు ఓ గుడిలో వెంట్రుకలు తీయించాడు. తర్వాత వాడి పేరును 'రామచంద్రుడు' అన్నాడు.

ఆ పేరు ఎందుకుపెట్టాడో పార్వతికి అర్థం కాలేదు. తను మాత్రం 'కన్నా' అనే పిలుచుకుంటాను అనుకుంది. అదేరోజు తనకు నెల తప్పింది అని కాస్త ఆలస్యంగా తెలుసుకుంది.

★ ★ ★

**1959 జనవరి ఇరవై ఆరు.**

శివయ్య ముఖం మళ్లీ గంభీరంగా ఉంది.

అతను ఆసుపత్రి ముందు ఉన్నాడు. పార్వతిని గంటముందే ఆసుపత్రికి తీసుకు వచ్చాడు.

ఇప్పుడతనికి సంవత్సరం క్రితం తనతో తగాదాపడ్డ స్నేహితుడు గుర్తొచ్చాడు.

'నువ్వు మనిషిగా పుట్టాల్సిన వాడివి కాదురా' అన్నాడతడు.

'రేయ్... ఎక్కువ మాట్లాడుతున్నావు' అన్నాడు శివయ్య.

'అసలు ఇంతకాలం నిన్ను భరించినందుకు నా మీద నాకు ఆశ్చర్యం.. అసహ్యం కలిగాయి. నీ ముఖంలో ఎప్పుడన్నా నవ్వు కనిపిస్తుందా? ఏం చూసుకున్రా ఇంత పొగరు? నువ్వు జమీందారు కొడుకువా..? టాటాగారి అబ్బాయివా? నిద్రపోయేటప్పుడు కూడా ముఖం చిటపటలాడుతూనే వుంటుంది. నీ బతుక్కి ఒక్క స్నేహితుడైనా ఉన్నాడా? డర్టీ ఫెలో' అన్నాడు.

'నాకు అవసరం లేదు. ఇప్పుడు నువ్వు కూడా అవసరం లేదు' అన్నాడు నిప్పులు కళ్ళ నుండి కురిపిస్తున్నట్టు.

'నీతో స్నేహం చేస్తే పంచమహా పాతకాలు చుట్టుకుంటాయి. నీకు అవసరం లేనిది స్నేహమే కాదు.. సంతానమూ. నేరకపోయి ఒకడ్ని పుట్టించావు. ఈసారి ఆడపిల్ల పుట్టిందంటే ఆ పిల్ల బతుకు నరకమవుతుంది. అందుకని ఆపరేషన్ చేయించుకో' అన్నాడు.

'సూర్యం- ఇంకోమాట అన్నావంటే నీ ముఖం పగలగొడతాను' అన్నాడు.

'దానికి ముందు, సిగ్గుంటే నాకు ఇవ్వాల్సిన వంద రూపాయలు ఇవ్వరా' అన్నాడు.

శివయ్య సూర్యాన్ని తినేశాలా చూసి, జేబులో నుండి వందనోటు తీసి అతని ముఖంమీద కొట్టాడు.

'నువ్వు సంపాదించిందయితే ఇలా కొట్టవు. నీ మావ ఇచ్చిన కట్నం డబ్బనుకుంటా. కట్నం తీసుకుని మావనీ, అత్తనీ ఇంటికి రానీయనందుకు సిగ్గుప డరా' అని వెళ్లాడు సూర్యం. శివయ్యకి ఇప్పుడా సంఘటన జరిగినట్లుగానే గుర్తుం ది. అతనిలో ఈసారి ఆడపిల్ల పుడు తుందా అనే అనుమానం ఉందో, ఇంకే మన్నా ఆలోచన ఉందో చెప్పటం కష్టం. అప్పుడు నర్సు వచ్చి చెప్పింది- 'మగ పిల్ల వాడు' అని. అప్పటి నర్సే. రామచంద్రుడు పుట్టాడని చెప్పినపుడు ఎలాంటి ఫీలింగ్‌ని అతన్లో చూసిందో, ఇప్పుడూ అదే ఫీలింగ్.

ఆ ఆసుపత్రి దగ్గర్లో ఓ సెంటర్ ఉంది. రిపబ్లిక్‌డే కావటంతో అక్కడున్న దిమ్మె మీద జాతీయ జెండా ఎగురుతోంది.

పార్వతికి సంతోషం కలగలేదు.

'ఒక్కరోజు ముందుగా పుట్టుంటే బాగుం డేది. ఏం బావుకుందామని ఈ రోజు పుట్టావు' అనుకుంది దిగులుగా.

ఆ రోజు శివయ్య ఎంతకూ ఇంటికి రాక పోవటంతో పార్వతి కంగారుపడింది. అతను పనిచేసే చోటుకి వెళ్దామంటే ఇద్దరు పిల్లలు. ఎవర్ని కనుక్కోవాలో తెలి యదు. ఎవరినన్నా బతిమాలి పంపించినా 'నువ్వెందుకు వచ్చావు. నేను ఇంటికి రాక దారిలో చచ్చాననుకుందా? అది పంపిస్తే రావటానికి నీకు బుద్ధిలేదా?' అని తిడతా డేమోనని భయపడింది.

రాత్రంతా నిద్రలేకుండా గడిపింది. మధ్యలో పిల్లలకేసి చూసుకుంది. లోకంలో అందరూ మగపిల్లలు పుడితే సంతోషపడతారు. పార్వతి దృష్టిలో వాళ్లు ఎవరయినా ఒకటే. శివయ్యకి పుట్టారు కాబట్టి వాళ్లు దురదృష్టవంతులు. వాళ్ల భవిష్యత్తు గురించి ఆలోచిస్తుంటే కళ్ల వెంట నీళ్లు కారిపోయాయి.

పెద్దవాడికి, రెండోవాడికి మధ్య వున్న కాలంలో కొన్ని పరిణామాలు జరిగాయి. నారాయణ పెళ్ళి జరిగింది. శుభలేఖ తీసు కుని నారాయణ స్వయంగా వచ్చాడు.

'బావా! నువ్వూ- చెల్లీ తప్పకుండా పెళ్ళికి రావాలి' అన్నాడు.

'అంటే నన్ను నువ్వు శాసిస్తున్నావా?' అన్నాడు శివయ్య.

నారాయణ ఓ క్షణం మాట్లాడలేకపో యాడు. తర్వాత నొచ్చుకుంటూ అన్నాడు- 'నిన్ను శాసించటం ఏంటి బావా..? మా చెల్లిని నీకు ఇచ్చాం. నీ కాళ్లు మేం కడిగాం. చిన్నమాట పొరపాటు వచ్చింది. అది కూడా మా నాన్న మీ ఉద్యోగం విష యంలో సలహా చెప్పినందుకు. ఎవరితో నూ తగాద పడొద్దని, మళ్లీ మళ్ళీ ఉద్యో గాలు రావని అన్నారాయన. మీకు బాధ కలిగింది. మీకు ఇష్టంలేని పనులు మేం చేయాలనుకోలేదు. అందుకే ఇన్ని రోజులు మేం దూరంగా వున్నాం. మాకున్నది ఒకే చెల్లి. ఈ పెళ్లికి మీరిద్దరూ రాకపోతే బంధువులంతా తలోమాట అనుకుం టారు. అందుకని నీ కాళ్లూచేతులు పట్టు కుని బతిమాలటానికి వచ్చాం. శాసించటం అనే పెద్దమాట వద్దు బావా' అన్నాడు.

'నాకు పనుంది.. పెళ్లికి రావటం నాకు కుదరదు' అన్నాడు శివయ్య.

'కనీసం చెల్లినైనా నాతోపాటు తీసుకువె ళ్తాను. ఒప్పుకో బావా' అన్నాడు.

'ఇప్పుడే తీసుకువెళ్తే నన్ను గడ్డి తినమం టావా?' అన్నాడు.

'తప్పయింది. పెళ్లికి ఓ రెండురోజులు ముందు పంపించు' అన్నాడు.

అతను వెళ్లిపోయాక 'నువ్వు మాట్లాడ కుండ రాయిలా నిలబడ్డావేంటి? నేను హోటల్ కూడు తినాలి.. లేదంటే చేతులు

కాల్చుకోవాలనేగా నీ ఉద్దేశం' అన్నాడు.

'మీరు మాట్లాడుకుంటుంటే మధ్యలో నేను కల్పించుకుంటే మీకు కోపం వస్తుం దని మాట్లాడలేదు' అంది పార్వతి.

'నేను తీసుకువెళ్లమంటే ఇప్పుడే నీ అన్నతో బయలుదేరేదానివేగా' అన్నాడు.

'మీరు చెప్పాక వెళ్లకపోతే మీరు ఊరు కుంటారా? ' అంది పార్వతి.

'నాతో తెలివిగా మాట్లాడుతున్నామని ఎవరన్నా అనుకుంటే నాకు చిరాకు. మొగుడి మనసులో ఏముందో తెలుసుకో వాలి. నేను పెళ్లికి రాను అని నువ్వే అంటే సరిపోయేది' అన్నాడు సీరియస్‌గా.

'మీకు చెప్పకుండా, మీ అనుమతి లే

## కొత్తగాలి...

**సీతమ్మలు**
**ఎక్కువగా**
**మాయలేళ్ల మక్కువలో...**

– ఎస్.సూర్యకుమారి,
సికింద్రాబాద్

కుండా ఏమీ మాట్లాడను. ఏ పనీ చేయ ను. పుట్టింటి నుంచి కాలు బయటకు పెట్టినప్పుడే ఆ మాట అనుకున్నాను' అంది పార్వతి.

'ఇప్పుడేమంటావ్? ' అన్నాడు.

'అది చెప్పాల్సింది మీరు. పెళ్ళికి వెళ్ల మంటే వెళ్తాను, వద్దంటే మానేస్తాను'

'పెళ్ళికి ముందురోజు రాత్రి వెళ్లి, అయిన వెంటనే వచ్చేయ్' అన్నాడు.

ఆ మాత్రందానికే సంబరపడిపోయింది, ఆ భావం ముఖంలో కనిపించనీయకుండా! ఆమెకు బాధ కలిగించేవి, బయటకు చెప్ప లేని వాటిలో శివయ్య తనని 'పార్వతమ్మ' అని పిలవటం ఒకటి. ఆడవారికి ఎంత మంచి పేరున్నా ఓ వయసు దాటాక పేరు చివర 'అమ్మ' చేరుతుంది.

యవ్వనంలో ఉన్న తనపేరుకు చివర భర్త 'అమ్మ'ని చేర్చటమేమిటి?

ఇప్పుడేమో మొగుడి మనసులో ఏముందో తెలుసుకోవాలి అనుకుందామె. అది ఎవరి వల్ల అవుతుందో తనకి తెలి యదు. మొత్తంమీద అన్న పెళ్లికి పుట్టిం టికి వెళ్లింది.

అప్పుడు అందరూ చుట్టుముట్టారు. అందరి కళ్లూ ఆనందంతో తడిసిపో యాయి. గుండెలు బరువెక్కాయి.

శివయ్యతల్లి కూడా ఆ పెళ్ళికి వచ్చింది. మొదటిసారి మనవడ్ని చూసుకుంది.

నాగేశ్వరరావు మొదటిసారి 'రామచం ద్రుడి' ఫొటో తీయించాడు.

'మళ్లీ ఎప్పుడు కలుస్తామో తెలియదు. మనింట్లో మీ ఇద్దరి ఫొటో అయినా వుండనీ' అన్నాడు.

'నీ పెళ్ళికి మనం కలుస్తాం కదా' అనా లనుకుని మానేసింది. అప్పటికి శివయ్య ఎలా వుంటాడో.. ఆ పెళ్లికి రానిస్తాడో లేదో తెలియదు కదా? అనుకుందామె.

పెళ్లయిన వెంటనే వచ్చేసింది.

'ఎప్పటికయినా మనల్ని కలిపేది ఈ రాముడే' అన్నాడు నారాయణ వచ్చే ముందు.

పుట్టింటివారు పార్వతికి పట్టుచీర, శివ య్యకి ప్యాంట్ షర్ట్ పెట్టారు. అది భర్త ముందు పెట్టింది.

'ఇదేంటి? ' అన్నాడు.

'అల్లుడికి బట్టలు పెట్టారు' అంది.

అప్పుడు శివయ్యకి సూర్య గుర్తొచ్చి నవ్వినట్లు అనిపించింది.

'నాకు అవసరం లేదు. ఈ సారి మీ అన్నయ్య పెళ్లికి వెళ్లినప్పుడు ఈ బట్టలే పెట్టు' అన్నాడు శివయ్య.




Live the Future



GENERAL
AIR CONDITIONERS
The Extreme Machine

# దసరా, దీపావళి శుభాకాంక్షలతో...

మా ప్రియమైన ఖాతాదారులకు, బంధుమిత్ర, శ్రేయోభిలాషులందరికీ
మా హృదయపూర్వక దసరా మరియు దీపావళి శుభాకాంక్షలతో...



- ★ USB VIDEO
- ★ PIP
- ★ Full HD
- ★ 2 USB Ports
- ★ 3 HDMI Ports

LLOYD









GENERAL
AIR CONDITIONERS

**LLOYD Authorised Distributor for Anantapur Dist.**

**GENERAL Authorised Dealer for Anantapur Dist.**

# KUSHAL Technologies
COOLING SOLUTIONS

Meda Petrol Pump, Subash Road, Anantapur.
Ph: 08554-241689, 9866236812.

అందుకు సంతోషపడాలో, బాధపడాలో అర్థంకాలేదు.

పెళ్లికి ఎవరెవరు వచ్చారని మరుసటి రోజు అడిగాడు.

'అత్తయ్య వచ్చారు. మనవడ్ని చూసుకుని మురిసిపోయారు' అంది.

'వాడు నా కొడుకు. మా అమ్మగాని, మీ వాళ్లు గాని రామచంద్రుడ్ని చూసి మురిసిపోవాల్సిన అవసరం లేదు. వాళ్ల నీడ కూడా వాడి మీద పడకూడదు' అన్నాడు కోపంగా.

అవన్నీ గుర్తొస్తున్నాయి.

అలా పిల్లలిద్దర్నీ పక్కలో వేసుకుని ఆలోచనల్లోనే నిద్రపోయింది.

మధ్యాహ్నం వేళకి రిక్షా ఇంటి ముందు ఆగింది.

శివయ్య నీరసంగా ఇంట్లోకి వచ్చాడు.

పార్వతి పరుగున వెళ్లి మంచినీళ్లు తెచ్చి ఇచ్చింది. తాగి గ్లాసు కింద పెట్టాడు.

'నిన్న సాయంకాలం నుంచీ మీ కోసం చూస్తున్నాను. రాత్రంతా నిద్రలేదు. ఇప్పుడు కూడా ఏంచేయాలో తెలియక..' అంటుంటే...

'చచ్చిపోయాననుకున్నావా?' అన్నాడు.

'ఏంటండీ ఆ మాటలు?' అందామె నొచ్చుకుంటూ.

'పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించుకున్నాను' అన్నాడు. పార్వతి నోట మాట రాక అతన్నే చూస్తుండిపోయింది. తనకి ఇంకా పిల్లల్ని కనాలనిలేదు. శివయ్యది అత్తెసరు ఉద్యోగం. దాంతో ఇద్దరు పిల్లల్ని సాకటమే కష్టం అయినా ఆపరేషన్ చేయించుకునే ముందు ఓ మాటంటే సరిపోయేది కదా అనే బాధ కలిగింది.

చిన్నవాడు ఏడుపు ప్రారంభించాడు.

'లక్ష్మణుడికి ఆకలయిందేమో చూడు' అన్నాడు. ముందు పార్వతికి తనేం వింటోందో అర్థం కావటం లేదు.

'అలా చూస్తావేంటి.. చిన్నాడి గురించి చెబుతున్నాను. వాడి పేరు లక్ష్మణుడు' అన్నాడు.

పార్వతి లక్ష్మణుడ్ని తీసుకుని పాలు ఇస్తూ అనుకుంది- 'కవల పిల్లలకు రామ లక్ష్మణులని పేరు పెట్టుకుంటారు. లవకుశులని పెట్టుకుంటారు. రాముడికి సేవ చేయాలని వీడికి ఈ పేరు పెట్టాడా? ఇంకేదన్నా కారణం ఉందా?'




**1962 ఆగస్టు 15.**

రామచంద్రుడు రోజులా ఆ రోజు పుస్తకాలు తీసుకు వెళ్లలేదు. నిక్కరు, చొక్కాతో ఇంటి నుండి బయటకు వచ్చాడు. అప్పుడు ఇంకొంత మంది పిల్లలు జత కలిశారు. అందరూ కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు. కొంతమంది జేబులకు జాతీయ జెండా బొమ్మలు ఉన్నాయి. అలాంటిది తనకీ ఉంటే బాగుండేది అనుకున్నాడు. అప్పుడు రామచంద్రుడికి సంవత్సరం కిందటి సంఘటన గుర్తుకు వచ్చింది.

అమ్మా-తనూ- లక్ష్మణుడు తాతావాళ్ల ఇంటికి వెళ్లారు. అదీ చిన్న మామయ్య పెళ్లికి!

ఊహ వచ్చాక తమకు బంధువులు ఉన్నారని తెలిసింది అప్పుడే.

'పెద్దవాడివయ్యావురా' అన్నాడు తాత ఒళ్లంతా తడిమి.

'మీ తాతయ్య, మీ అమ్మమ్మ, మీ పెద్ద మామయ్య, చిన్నమామయ్య' అంటూ పార్వతి అందరినీ పరిచయం చేసింది.

అక్కడే ఓచిన్న అమ్మాయి కనిపించింది.

'దీని పేరు సీత. నీకు మరదలు అవుతుంది' పెద్దమామయ్య చెప్పాడు.

సీతని చూడగానే రామచంద్రుడికి ఎందుకో తెలియని సంతోషం కలిగింది.

అమ్మని పక్కకు తీసుకువెళ్లాడు.

'వీళ్లు మన ఇంటికి ఎందుకు రారు?' అన్నాడు. పార్వతి మాట్లాడలేదు.

'మమ్మల్ని ఇక్కడికెందుకు తీసుకురావు?' అన్నాడు అంతలోనే.

'ఇవన్నీ చెప్పినా నీకు ఇప్పుడు అర్థం కావు. అయినా మనం పెళ్లికి వచ్చాం. చూశాక వెళ్లిపోతాం. అంతే, నువ్వు ఎవర్నీ

## కొత్తగాలి...

**ఆ భారతంలో**
**దుశ్శాసన కీచకులు ఇద్దరే**
**నా భారతంలో**
**ఎందరెందరో**
**అందుకే మేరా భారత్ మహాన్**

– *చుండూరు ఉమాబాల, హైదరాబాద్*

ఏ ప్రశ్నలూ అడగవద్దు" అని చెప్పింది.

రామచంద్రుడు తలూపాడు.

పెద్దవాళ్లు మాట్లాడుకుంటుంటే వాడికి కొన్ని విషయాలు తెలిశాయి.

తన 'నాయనమ్మ'కు ఆరోగ్యం బాగోలేదనీ, అందువల్ల పెళ్లికి రాలేకపోయిందనీ. అలాగే అమ్మకి చీర, నాన్నకి బట్టలు పెడుతున్నప్పుడు అమ్మ 'వద్దు' అని కన్నీళ్లు పెట్టుకొంది. ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

అప్పుడే ఓ ప్యాంట్-షర్ట్ తీసి వారి ముందు పెట్టింది. అది చూడగానే నారాయణ కళ్లు చిన్నవయ్యాయి.

'బావగారికి ఇష్టం లేకపోతే ఎవరికన్నా యివ్వొచ్చు లేదా బయట పారేయొచ్చు. మళ్లీ మాకే పంపించటం ఎందుకు?' అన్నాడు బాధగా.

'దాన్ని అడిగితే ఏం సమాధానం చెబుతుంది. అయినా అతని సంగతి తెలుసుగా. మనకేం నామోషీ లేదు. నువ్వే కుట్టించుకో నారాయణా' అంది అమ్మమ్మ.

నారాయణ మావయ్య మాట్లాడలేదుగాని, నాగేశ్వరరావు మావయ్యకి కోపం వచ్చింది.

'ముందునుండి మనం మెతగ్గా ఉన్నాం. అతనికి ఎదురు చెప్పటం ఎందుకని వూరుకుంటే చులకన అయ్యాం. ఏమనుకుంటున్నాడు? అయినా నిన్ను అనాలి పార్వతీ. నువ్వెందుకు ఇంత భయపడుతున్నావో మాకు అర్థం కాదు' అన్నాడు.

'ఆడపిల్ల. అదేం చేస్తుంది. నోరు తెరిస్తే ఇంటిలో నుంచి బయటకు నడవమంటాడు' అంది అమ్మమ్మ.

'బయటకు నడవమంటే సరిపోతుందా? లోకం గొడ్డుపోయిందా? ఎవరూ మాట్లాడరా? నాన్న అందరికి పరిష్కారాలు చెబుతాడు. చెల్లి విషయంలో ఏమీ చెయ్యలేడా?' అన్నాడు నాగేశ్వరరావు కోపంగా.

'బలవంతాన ఎవరితోనూ కాపురం చేయించలేం చిన్నాడా.. మనం మాట్లాడితే జరిగేది ఒక్కటే. పార్వతిని మన ఇంటిలోనే ఉంచుకోవాలి. ఇప్పుడు మా వయసు దాటిపోయింది. బతికున్నంత వరకు మేం పార్వతిని చూసుకుంటాం. తర్వాత చాలా సమస్యలు వస్తాయి.'

'మేం పార్వతి అన్నయ్యలం నాన్నా' అన్నాడు బాధగా.

అప్పుడు పార్వతి మాట్లాడింది- "మనం దరం దిగులు పడాల్సింది అత్తయ్య

గురించి. ఆమె కూతురు దగ్గర బతకాల్సి వచ్చింది. అన్నయ్యగారు మంచివారు కాబట్టి సరిపోయింది. ఇంకొకరయితే మీ అమ్మని -నేనెందుకు చూడాలి- అనేవారు. అయినా నాకు ఇద్దరు మగపిల్లలున్నారు. చూస్తుండగానే పెద్దవాళ్లు అవుతారు. నేను ఆయనకి కోపం వచ్చినప్పుడు తలదించు కుంటాను. ఆయన కోపంవల్ల బాధ ఆయ నకే. నేను బాగానే ఉన్నాను. ఎవరి కాపు రాల్లో మాత్రం సమస్యలు లేవు' అంది.

నాగేశ్వరరావు ఆ మాటకి ప్రమాన్పడిపో యాడు.

పెళ్లి అయ్యాక వచ్చారు ఇంటికి.

"రాముడూ.. పెళ్లికూతుర్లా నడుస్తున్నా వేంటి? ప్రార్థన టైం అవుతోంది" అంటూ స్నేహితులు పరుగులు తీస్తున్నారు.

★ ★ ★

ఎవరో వ్యక్తి జెండాదిమ్మె ముందు నిల బడ్డాడు. హెడ్‌మాస్టారు ఆయన ముందు వినయంగా ఉన్నాడు. అప్పుడెవరో తెల్లటి పావురాల్ని తీసుకొచ్చారు. ఒక పావురాన్ని ఆయన దగ్గరకు తీసుకొచ్చారు.

దాన్ని అతను అందుకున్నాడు.

రామచంద్రుడి దృష్టి ఆ పావురం మీదే ఉంది.

ఆ పావురం కళ్లలో భయం స్పష్టంగా కనిపిస్తోంది. అటూ ఇటూ చూస్తోంది. ఎలా అయినా ఆ చేతుల నుండి తప్పించు కోవాలని మధ్య మధ్యలో ప్రయత్నం చేస్తోంది.

అప్పుడతను ఆ పావురాన్ని గాల్లోకి ఎగ రేసాడు.

రెక్కలు టపటప కొట్టుకుంటూ పిల్లల మీద నుండి ఎగిరిపోతుంటే ఓ ఈక మెల్లగా గాల్లో తేలుతోంది.

ఆ తర్వాత అతను మాట్లాడుతున్నాడు.

'స్వతంత్రం' అనే మాట వినిపించింది. రామచంద్రుడి మనసు పావురం మీద ఉంది.

## మొక్కపాటి చతురోక్తులు



బారిస్టర్ పార్వతీశంతో తెలుగువారిని కడుపుబ్బా నవ్వించిన ఘనుడు మొక్క పాటి నరసింహశాస్త్రి. వివిధ సందర్భాల్లో ఆయన నుడి విన చతురోక్తులు ..

### అదే నా మొదటి పిలక

ఓసారి మొక్కపాటిని 'మీ తొలి రచన ఏమిటి?' అని అడిగారు సాహితీమిత్రులు.

'ఒకరోజు మిత్రులంతా గోదావరి ఒడ్డున చేరాము. అందులో మా ప్రియమిత్రుడు వేదుల సత్యనారాయణ పిలక పెట్టుకొని వచ్చాడు. అందరం అతని పిలకను చూచి నవ్వాము. ఆ రాత్రి కష్టపడి ఆ పిలక మీద ఒక కథ వ్రాశాను. అది హాస్యరచన. అది నా హాస్యరస జీవితంలో మొదటి పిలక' అన్నారు.



గాల్లో జెండా రెపరెపలాడుతోంది.

'పావురానికి మాత్రం స్వతంత్రం వచ్చింది' అనుకున్నాడు రామచంద్రుడు.

★ ★ ★

రామచంద్రుడు ఇంటికి పరుగులు తీసు కుంటూ వచ్చాడు.

అంతకుముందు సంవత్సరం చాక్లెట్ మాత్రం ఇచ్చారు. హెడ్‌మాస్టారు జెండా ఎగరేసారు. ఆయనే ఏదో మాట్లాడారు. ఇప్పుడు కొత్తగా ఎవరో వచ్చారు. మిఠా యి, లడ్డు ఇచ్చారు.

ఆయనకి పెద్ద మాస్టారు ఎందుకు

భయపడ్డారో తెలియదు. పిల్లలందరికీ ఆయనంటే భయం. అమ్మకీ నాన్నంటే భయం. అమ్మకే కాదు తనకి కూడా.. అలా ఆలోచిస్తుంటే పార్వతి వచ్చింది.

మిఠాయిలడ్డు అమ్మ చేతిలో పెట్టాడు.

'అక్కడే తినక ఇంటికి ఎందుకు తెచ్చావు' అంది పార్వతి.

'తమ్ముడికీ, నాకూ, నీకూ తెచ్చాను' అన్నాడు రామచంద్రుడు.

అప్పుడామె కళ్లలో సంతోషం చూశాడు.

'మీ నాన్నకి వద్దా? ' అంది.

'నలుగురికి నాలుగు సగాలు' అన్నాడు తప్పు చేసినవాడిలా.

ఆమె నవ్వుతూ లడ్డుని సగం చేసి 'ఇది నువ్వు తిను. మీనాన్న ఎప్పుడు వస్తారో తెలియదు. తమ్ముడికి తినిపిస్తాను' అని కొంచెం తను తింది.

'అమ్మా మనం తెల్లపావురాలని పెంచుకుందామా' అన్నాడు ఆశగా.

అప్పుడు పార్వతి రామచంద్రుడికేసి వింతగా చూసింది.

ఇప్పటివరకు నాకు ఇది కావాలని రామచంద్రుడు ఎప్పుడూ అడగలేదు.

ఆమెకు వెంటనే శివయ్య గుర్తొచ్చాడు.

'మీనాన్నని అడుగు రాముడూ' అంది.

'అలాగే' అంటుంది అనుకున్న రామచంద్రుడికి నిరాశ కలిగింది.

అప్పట్నుంచి నాన్న కోసం ఎదురు చూడటం మొదలుపెట్టాడు.

రాత్రి ఎనిమిదిగంటలు దాటింది.

'నిద్రపో. నాన్న రాత్రి ఎన్నిగంటలకి వస్తారో తెలియదు. రేపు బడికి వెళ్లాలి. పొద్దున అడుగుదువుగాని' అంది పార్వతి.

రామచంద్రుడు తల అడ్డంగా వూపాడు.

నిద్ర ముంచుకు వస్తున్నా కళ్లు నులుముకున్నాడు. ఓసారి నీళ్లతో ముఖం కడుక్కుని తలుపుకేసి చూస్తున్నాడు.

పార్వతి లక్ష్మణుడి దగ్గర పడుకుని నిద్రపోతోంది.

పదిగంటలు దాటింది.

అప్పుడు తలుపుమీద చప్పుడయింది.

అదే సమయంలో కునుకుతీస్తున్న రామచంద్రుడు ఉలిక్కిపడి కళ్లు తెరిచి, సంతోషాన్ని కళ్లల్లో నింపుకుని తలుపు తీశాడు.

'నాన్నా' అన్నాడు.

శివయ్య ముఖం చిట్లించాడు.

'తెల్ల పావురాన్ని పెంచుకుందామా' అన్నాడు రామచంద్రుడు.

ఒక్కక్షణం కొడుకు ముఖంలోకి చూసి, ఈడ్చి కొట్టాడు.

ఆ చప్పుడికి పార్వతి లేచింది.

★ ★ ★

రామచంద్రుడి చెంప ఇంకా సలుపుతోంది.

పుస్తకాలు తీసుకుని సంచిలో పెట్టుకుని బడికి బయలుదేరాడు.

'ఇలా రా' అన్నాడు శివయ్య.

భయంగా దగ్గరకు వెళ్లాడు.

'నువ్వు పావురాన్ని పెంచాలనుకున్నావా? మీ అమ్మ అడగమందా? '

'నేనే పెంచుకోవాలనుకున్నాను నాన్నా'

'తెల్లపావురాన్నే ఎందుకు పెంచాలి. నల్లపావురాన్ని పెంచకూడదా' అన్నాడు శివయ్య.

రామచంద్రుడికి నల్లపావురాలుంటాయని తెలియదు.

మాట్లాడకుండా నిలబడ్డాడు.

'నువ్వు పెంచాల్సింది పావురాల్ని కాదు. గొడ్లని మేపాలి. మేపుతావా చదువు మానేసి' అన్నాడు కళ్లలోకి చూస్తూ.

రామచంద్రుడు తల అడ్డంగా వూపాడు.

'గుమ్మం ముందు నిలబెట్టి నన్ను అడుగుతావా? ఇంకెప్పుడన్నా అలా చేస్తే నిన్ను కొట్టను.. కాళ్లు విరిచేసి మూలన కూర్చోబెడతా. పావురాల్ని, చిలకల్ని పెంచుతావా? ఎవరు చెప్పారు? పెళ్లికి వెళ్లావు కదా! మీ

తాత చెప్పాడా? మావయ్యలు చెప్పారా?'

'ఎవరూ చెప్పలేదు నాన్నా.'

'మరి ఇలాంటి కోరిక ఎందుకు వచ్చిందిరా? నీ స్నేహితులు చెప్పారా? వాళ్ల ఇళ్లల్లో కుక్కల్ని పెంచుతారు. అప్పుడు కుక్కలు పెంచుకుందాం అంటావా? వాళ్లు మంచి బట్టలు తొడుక్కుంటారు. అవి కావాలంటావా? సైకిళ్లు కొనుక్కుంటే అవి తెచ్చివ్వమంటావా?'

బిక్క ముఖం వేసుకుని ప్రశ్నల్ని పాఠంలా వింటున్నాడు.

'ఇంకెప్పుడూ నాకు ఇది కావాలి అని నన్ను అడగకూడదు. నీకు ఏది ఇవ్వాలో నాకు తెలుసు. లేదంటే నీ ఇష్టం. ఇంట్లో ఉండొద్దు. బయటకు వెళ్లు. అప్పుడు పావురాలను పెంచుకున్నా, పందుల్ని పెంచుకున్నా నేనేం మాట్లాడను' అన్నాడు.

'నేను నీ దగ్గరే ఉంటాను నాన్నా. చదువుకుంటాను' అన్నాడు రామచంద్రుడు.

'సరే. పో' అన్నాడు శివయ్య.

పార్వతి ఈ సంభాషణ అంతా వింది. ఆమెకు కలిగిన బాధ అంతా ఇంతా కాదు. కన్నవారితో, బంధువుల్తో, చివరికి తను జన్మనిచ్చిన పిల్లవాడితో ఆయన మాట్లాడే తీరు ఇదేనా అనుకుంది. ఇవే మాటల్ని అనునయంగా చెబితే ఎంత బాగుండేది? పిల్లవాడి మనసు గాయపడేది కాదు. రేపు రామచంద్రుడు ఎలా తయారవుతాడు?

అసలు ఆ పేరు ఎందుకు పెట్టాడు?

'పరుశురాముడు' అని పెట్టివుంటే సరిపోయేది. తన పిల్లల్ని ఈయన ఎలా పెంచాలనుకుంటున్నాడు? ఎవరికి వ్యతిరేకంగా తయారు చేయాలనుకుంటున్నాడు?

ఆమె మనసులో రకరకాల ప్రశ్నలతో తల వేడెక్కిపోయింది.

అప్పుడు 'లక్ష్మణుడు' ఒక్కసారిగా

గుక్కపట్టి ఏడవటం మొదలుపెట్టాడు.

శివయ్య విసురుగా వచ్చి "నోర్ముయ్" అని అరిచాడు.

లక్ష్మణుడు ఒక్కక్షణం ఏడుపు ఆపి, మళ్లీ అంతకంటే బిగ్గరగా ఏడుస్తున్నాడు.

పార్వతి లక్ష్మణుడ్ని తీసుకుని శివయ్యకి దూరంగా వెళ్లిపోయింది.

★ ★ ★

రామచంద్రుడు బడిలో కూర్చున్నాడు గాని మనసు అక్కడ లేదు. నాన్న ఇంటిలో నుంచి వెళ్లిపొమ్మన్నాడు. అది తలుచుకుంటే భయంగా ఉంది. ఇంట్లో నుంచి వెళ్లిపోతే ఏమవుతుంది? ఎక్కడ ఉంటాడు తను? ఇల్లు ఉండదు. తినటా

కొత్తగాలి...

చక్కలి గిలి
నవ్వు
చెక్కిలి గిలి
లవ్వు

– అంబటి వెంకట శివారెడ్డి,
యర్రగుంట్ల

నికి తిండి ఉండదు. అమ్మ ఉండదు. తమ్ముడు ఉండడు.

వీళ్లందరూ లేకుండా తను బతకలేడు. ముఖ్యంగా నాన్న కూడా కావాలి. నాన్న డబ్బులు ఇస్తేనే ఇంట్లో ఏ సరుకులయినా కొనేది. మరి నాన్న మాత్రం నేను లేకుండా ఉండగలడా? బెదిరించటానికి ఆ మాట అన్నాడా?

పెళ్లిరోజు పెదమావయ్య తనను బయటకు తీసుకువెళ్లాడు.

కొబ్బరి బొండాం తాగించాడు.

'రాముడూ! మీనాన్నకి కోపం ఎక్కువ. మనుషులందరికీ కోపం ఉంటుంది. అది రోజుకో, రెండు రోజులకో పోతుంది. మీ నాన్నకి అలా కాదు. బతికినంతకాలం ఉంటుంది. ఆయన మారతాడో లేదో నే చెప్పలేను. నువ్వోపని చేస్తావా? ' అన్నాడు.

ఏమిటన్నట్టు చూశాడు.

'నువ్వు ఎప్పుడూ కోపం పెంచుకోవద్దు. ఎవరిమీదన్నా కోపం వస్తే అది మనసులో పెట్టుకోవద్దు. మీ నాన్నలాంటి వాళ్లు ఓపిక ఉన్నంతవరకు బాగుంటారు. ఏ మంచానో పడినప్పుడు వారికి తెలుస్తుంది, ఏ తప్పులు చేశామా అనేది. అప్పుడు లాభం ఉండదు. అసలు నరకం అప్పుడే మొదలవుతుంది. నేను మీ నాన్నని అలా మంచంలో పడాలని కోరుకోవటం లేదు. అతను మమ్మల్ని కాదనుకున్నా మాకు అతను బావ. నువ్వు నా మేనల్లుడివి. ఇప్పుడు విడిపోయిన మనకుటుంబాల్ని నువ్వు కలపాలి. సీతని నువ్వు చేసుకుంటే బాగుంటుంది. రేపేం జరుగుతుందో నాకు తెలియదు. అయినా నా మనసులో మాట నీకు చెబుతున్నా' అన్నాడు.

రామచంద్రుడు అతనికేసి చూస్తున్నాడు. నారాయణకి రామచంద్రుడ్ని చూడగానే జాలి కలిగింది.

ఆ కళ్లలో విచారం, దిగులు ఉన్నాయి.

'నువ్వు చిన్న పిల్లాడివి. ఇప్పుడే నీతో ఇలాంటి విషయాలు మాట్లాడకూడదు. అయితే మనం మళ్లీ ఎప్పుడు కలుసుకుంటామో తెలియదు. అందుకు చెబుతున్నాను. మనం మాట్లాడుకున్నట్టు మీ నాన్నకి చెప్పొద్దు. సరేనా? ' అన్నాడు.

రామచంద్రుడు తలూపాడు.

'మీ అమ్మ కూడా మీ ఇద్దరి మీద ఆశలు పెట్టుకుంది. అందుకని అమ్మని బాధపెట్టే పనులేవీ మీరు చేయవద్దు. చేయనని నాకు మాట ఇవ్వు' అని చేతిలో చెయ్యి వేయించుకున్నాడు.

ఇంటికి రాగానే సీతని చూడాలనిపిం

చింది. ముద్దుముద్దుగా మాటలు చెబు తోంది. అందరూ నవ్వుతూ వింటున్నారు. మధ్యలో పార్వతి సీతను ఎత్తుకుని ఆప్యా యంగా ముద్దులు పెట్టుకుంటోంది.

సీతంటే అమ్మకి కూడా ఇష్టం అనుకు న్నాడు రామచంద్రుడు. అప్పుడు తమ మీద నుండి ఎగిరివెళ్లిన పావురం గుర్తొ చ్చింది. అదే సమయంలో నెత్తిమీద మొట్టి కాయ పడింది.

'అబ్బా' అంటూ చూశాడు.

ఎదురుగా పంతులుగారు ఉన్నారు.

'దేహం మాత్రం ఇక్కడ ఉంది. దేని గురించి ఆలోచిస్తున్నావు' అన్నాడు.

మాట్లాడకుండా తల తడువుకుంటు న్నాడు.

'నిజం చెప్పకపోతే ఇంకో మొట్టికాయ పడుతుంది' అన్నాడాయన.

'పావురం గురించి మాస్టారూ.'

'ఏ పావురం గురించి' ఆశ్చర్యంగా అ డిగారాయన.

'నిన్న ఎగరేసిన పావురం గురించి.'

'దాని గురించి ఆలోచించటానికేముంది. ఎగరేశారు. ఎగిరిపోయింది. ఎగిరిపో యిన వాటి గురించి తలుచుకుంటే పాఠాలు ఎప్పుడు చదువుతావు? మన బుర్ర చాలా చిన్నది. అందులో పావు రాలూ, పిట్టలూ ఉంటే పాఠాలకి చోటు వుండదు. ఇంకెప్పుడూ బడిలో ఇతర విష యాల గురించి ఆలోచించవద్దు' అన్నాడు.

'ఇంకా నయం సీత గురించి ఆలోచిస్తు న్నాను అంటే ఏమనేవారో' అనుకున్నాడు.

★ ★ ★

బడినుంచి ఇంటికి వెళ్లేటప్పటికి నాన్న ఉన్నాడు. ఆయన ఎదురుగా ఎవరో పెద్ద మనిషి ఉన్నాడు. అప్పుడే వచ్చాడను కుంటా. మంచినీళ్లు తాగుతున్నాడు. గ్లాసు కిందపెట్టి 'నీ పేరేంటబ్బాయ్' అన్నాడు.

'రామచంద్రుడు' అంటూ లోపలకెళ్లాడు.

కాస్త దూరంలో నిలబడివుంది పార్వతి.

'శివయ్యా! మీ అమ్మ మంచాన పడి పోయి ఉంది. నిజానికి నువ్వామెని నీ ఇంట్లో పెట్టుకుని సేవలు చేయాలి. ఇప్ప టిదాకా నువ్వు మీ అమ్మని పట్టించుకోకపో యినా ఇప్పుడా సమయం వచ్చింది. చివరి రోజులు నీ దగ్గరుంటే బాగు' అన్నాడు.

'బాబాయి నువ్వేదో మా ఇంటికి వచ్చావు. చూసి వెళ్తే బాగు. మిగతా విష యాలు మాట్లాడొద్దు' అన్నాడు శివయ్య.

'ఆ విషయాలు మాట్లాడటానికే వచ్చాను' అన్నాడాయన కఠినంగా.

శివయ్య ముఖంలో రంగులు మారిపో యాయి.

'ఇంకెంతో కాలం మీ అమ్మ ఉండదు. ఆమె చనిపోతే తలకి కొరివి పెట్టాల్సిన వాడివి నువ్వు.'

'అది ఆమెకి ఉండాలి. నన్ను కాదని చెల్లి దగ్గరవుంది. ఇప్పుడు నేను అవసర మయ్యానా?'

'ఇంట్లో ఏం మాట్లాడితే ఏమవుతుందో నని భయపడుతూ వెళ్లింది. నువ్వు సరిగ్గా ఉంటే ఇంకొకరి దగ్గర బతకాల్సిన కర్మ ఎందుకు పట్టేది?'

'కర్మ పట్టింది కాబట్టి అదేదో పూర్తిగా అనుభవించనీ. ఇప్పటిదాక చూసినవారు- పోయాక కాటికీ పంపిస్తారు.'

## కొత్తగాలి...

**పక్షులకు రెక్కలు**
**ఫ్యానులకు రెక్కలు**
**కూరగాయల రేట్లకూ..**
**రెక్కలు**

**– పట్ల యాదగిరి**
*గుండాల, నల్గొండ జిల్లా*

'శివయ్యా' అని బిగ్గరగా అరిచాడు ఆయన.

పార్వతి, ఆమెపక్కకు చేరిన రామచంద్రుడు కూడా భయపడ్డారు.

'మనిషిలా మాట్లాడు. అసలు నీకు జన్మనిచ్చింది మీ అమ్మ. నిన్ను పెంచింది. చీదర అనుకోకుండా అన్ని సేవలు చేసింది. రెక్కలొచ్చాయి అని ఎగిరిపోకూడదు. లోకాన్ని చూసి నేర్చుకో' అన్నాడు తనని తాను నిగ్రహించుకుంటూ.

'నాకా అవసరం లేదు' నిర్లక్ష్యంగా అన్నాడు శివయ్య.

'శివయ్యా! తల్లిపాలు తాగినందుకు ఎవడికయినా కృతజ్ఞత ఉంటుంది. నువ్వు ఇద్దరు పిల్లల్ని కన్నావు. రేపు మీ అమ్మకు వచ్చిన పరిస్థితే నీకూ వస్తుంది. మనం పెద్దవాళ్లపట్ల ఎలా ఉంటామో పిల్లలూ అదే నేర్చుకుంటారు, అలాగే చేస్తారు.'

'అయిపోయిందా చెప్పటం' అన్నాడు శివయ్య.

'మీ అమ్మ ఏ ఆస్తీ ఇవ్వలేదనేగా.. అదే ఆమె పేరుతో భూమి, నగలువుంటే పరిగెత్తుకు వచ్చేవాడివి పంచుకోవటానికి. నీకు నిజంగా పౌరుషం ఉంటే నువ్వు స్వంతంగా బతికేంతవరకూ నీమీద పెట్టిన ఖర్చు లెక్కగట్టి అవతల పారేయ్'

## కొత్తగాలి...



**చేనుకు చేవ**
**రైతుకు రొఖ్ఖం... ఆనాడు**
**చేనుకు చేటు**
**రైతుకు దుఃఖం ... ఈనాడు**

– వి.సూర్యకుమారి,
హైదరాబాద్

శివయ్య మూడోకన్ను తెరవబోతున్నాడనిపించింది పార్వతికి.

'నీకు సిగ్గుంటే, చీము రక్తం ఉంటే అక్కడికి రా. మాఅమ్మ కర్మకాండలు చేయలేను. నా దగ్గర డబ్బులు లేవు. మా అమ్మ కర్మకాండలు చేయటానికి సాయం చెయ్యండని దోసిలిపట్టు' అన్నాడాయన ఆగ్రహంతో కంపించిపోతూ.

'బాబాయి నాకా కర్మ పట్టలేదు. ఆవిడ గారికి డబ్బు పంపిస్తాను. నేను మాత్రం అక్కడికి రాను. నా చేతుల మీద కొరివి పెట్టను. ఇంక మీరు వెళ్లవచ్చు' అన్నాడు.

'మీ ఇంట్లో నేను మంచీనీళ్లు తాగి పొరపాటు చేశా. నువ్వు మహాపాతకుడివి. ఈ రోజునుంచి నీతో పూర్తిగా సంబంధాలు తెగిపోయాయి' కోపంగా వెళ్లిపోయాడాయన.

శివయ్య ముఖంలో ఎలాంటి పశ్చాత్తాపం కనిపించలేదు. అతని ముఖంలో మరింత ఆగ్రహం పాకింది. అప్పుడే పార్వతికేసి తిరిగాడు.

'ఇలారా' అన్నాడు.

పార్వతి దగ్గరకి వచ్చింది.

'నాకు ఎవరి బాకీలు అవసరం లేదు. రేపు మీ అత్తగారి దగ్గరకు వెళ్ళు. వెయ్యి రూపాయలు ఇచ్చి, చెప్పు- ఈ రోజుతో నీ బాకీ తీరిపోయిందని.'

'అత్తయ్యగారు తీసుకోకపోతే'

'మంచం మీద ఉందంట కదా. అక్కడ పడేసి వచ్చేయ్' అని లేచి గదిలోకి వెళ్లి ఓ వెయ్యి రూపాయలు తీసుకువచ్చాడు.

పార్వతికి గగుర్పాటు కలిగింది.

'ఇంకొకరికి బాకీ ఉన్నాను. అది మీ నాన్నకి. అవీ తీర్చుకుంటాను' అన్నాడు.

'మిమ్మల్ని ఎవరడిగారు? ఆ విషయం ఇప్పుడెందుకూ?' అంది పార్వతి చిన్నబుచ్చుకుని.

'ఇప్పుడు అడిగాడుకదా ఓ పెద్దమనిషి.. అలాగే రేపు ఇంకొకరు అడుగుతారు' అన్నాడు శివయ్య.

'వెళ్లి రావటానికి రెండు రోజులు పడుతుంది. పెద్దవాడ్ని కూడా తీసుకువెళ్లనా? మీకు ఇబ్బంది అవుతుందేమో అని అడుగుతున్నాను.'

'తీసుకువెళ్లు' అన్నాడు




రామచంద్రుడు నాయనమ్మనీ చూశాడు.

ఆమె ముఖం తెల్లగా ఉంది. ప్రశాంతంగా ఉంది. పార్వతిని చూడగానే ఆమె కళ్లు శివయ్య కోసం వెతుక్కున్నాయి.

అతను రాలేదని తెలిశాక ఆమె కంటి కొసనుండి ఓ నీటి బొట్టు జారింది. ఉద్వేగంతో గుండెలు ఎగిసిపడ్డాయి.

'అత్తయ్య'ని చూసి పార్వతికి దుఃఖం వచ్చింది. చంకలో ఉన్న లక్ష్మణుడ్ని మంచం మీద కూర్చోబెట్టింది. మనవళ్లని ప్రేమగా తడువుకొంది.

'మీకు నేనేమీ చేయలేకపోయాన్రా' అంది.

వారి పేర్లు అడిగి తెలుసుకుని-

'మీరిద్దరూ రామలక్ష్మణుల్లా ఉండండి' అంది.

శివయ్యచెల్లి పిల్లలిద్దరినీ ప్రేమగా ఇంట్లోకి తీసుకువెళ్లింది.

'నేను మీ అత్తన్రా' అంది.

'మీ మావయ్య' అంటూ పిల్లలకు భర్తను పరిచయం చేసింది.

పార్వతీ, ఆమె విడిగా కూర్చున్నారు. బాబాయి జరిగింది చెప్పాడు.

'చివరి రోజుల్లో ఉంది అమ్మ. ఇప్పడయినా అన్నయ్యలో మార్పు వస్తుందనుకున్నాను. చివరిసారి కొడుకుని చూసుకోవాలనుకుంది అమ్మ. సరే ఆవిడ దురదృష్టం. నీ గురించి చెప్పు' అన్నాడు.

'నా గురించి చెప్పుకోవటానికి ఏమీ లేదు. మీ అన్నయ్య చెప్పిన మాట వినటం, చేయమన్నది చేయటం. వెయ్యి రూపాయలు ఇచ్చి రమ్మన్నారు. రాత్రికి వెళ్లిపోవాలి. అత్తయ్యగారు చనిపోయినా ఆయన రారు. నన్ను...' అని మాట్లాడలేక పోయింది.

'నువ్వేం చేస్తావులే?' అని సముదాయించారు.

'అసలు ఆయనకి ఇంత కోపం ఏమిటి? అత్తయ్యని అడగాలనుకున్నాను' అంది పార్వతి.

'మా తాతకి, అంటే మా నాన్న నాన్నకి కాదు.. ఆయన తమ్ముడికి ఇలాంటి కోపం ఉండేదట. ఎవరితోనూ పడేదికాదు. కోపమొస్తే ఇంట్లో మంచం తీసుకుని పొలం దగ్గరికి వెళ్లి పడునేవాడట. అది తగ్గాక వచ్చేవాడంట, ఓ వారానికి. ఇలాంటివాళ్లు అమ్మల్ని, చెల్లాయిల్ని వదులుకుంటారు. భార్యల్ని వదులుకోరు. సేవలు చేయాలి కదా' అంది.

పార్వతి ముఖంలో ఓ నీడ కదిలింది.

'ఇది వంశపారపర్యంగా వచ్చింది. పెద్ద కారణాలుండవు. ఎవరన్నా వింటే ఆశ్చర్యపోతారు. ఇలాంటి మనుషులు సైన్స్‌కి అందాలిగాని మనకు అర్థం కారు' అంది.

పార్వతి వెయ్యి రూపాయలు ఇచ్చింది.

'నాకు ఎందుకు ఇస్తున్నావు? అన్నయ్య నాకు బాకీ కాదు. అమ్మ నన్ను కన్నది కాబట్టి నా బాధ్యత నేను చేశాను. మీ అన్నయ్య వద్దు అనలేదు'

## అడ్డ గాడిదలు



మొక్కపాటి నరసింహశాస్త్రి తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి ఇద్దరూ వియ్యంకులు. ఛలోక్తులు విసురుకోవడంలో ఒకరిని మించిన వారొకరు. ఒకసారి మొక్కపాటివారు పని మీద హైదరాబాదు వెళ్ళి, ఆ సంగతి అక్కడి నుండి ఉత్తరం వ్రాసి వియ్యంకుడికి తెలియజేశారు. దానికి తల్లావఝ్ఝలవారు ఉత్తరం వ్రాస్తూ 'అయితే అడ్డగాడిద హైదరాబాదు చేరిందన్నమాట' అని హేళన చేశారు. ఆ మాటకు మొక్కపాటివారు కోపగించుకోకుండా 'ఫరవాలేదు బావా! నువ్వు కూడా రావొచ్చు. ఇవి జంటనగరాలు' అని వ్రాశారు.

'అత్తయ్యగారికి ఇవ్వాలంటే సిగ్గుగా వుంది'

'మీ ఆయన చెప్పినట్టు చెయ్యాలి కదా. అమ్మ సంతోష పడుతుందేమో' అందామె.

భోజనాలు అయ్యాక పార్వతి అత్తయ్యకి డబ్బులు ఇచ్చింది. అప్పుడామె పెదవుల మీద విరక్తితో కూడిన నవ్వు వెలిసింది.

'అమ్మ రుణం తీర్చుకున్నాడా' అని కొంచెం సేపు కళ్ళు మూసుకుంది. ఆమె మనసులో సుడిగుండాలున్నాయో, అగ్నిపర్వతాలున్నాయో తెలియటం లేదు.

మెల్లగా కళ్లు తెరిచింది.

'ఇవి నా మనవళ్లకి ఇవ్వు. నాయనమ్మ ఇచ్చిందని చెప్పు. శివయ్యకి చెప్పవద్దు. పిల్లలకి కూడా ఇప్పుడే ఇవ్వొద్దు' అని ఆయాసం వచ్చి ఆగింది.

'నా కొడుకు నా తలకి కొరివి పెట్టడని నాకు తెలుసు. ఓసారి తప్పు చేస్తే వాడు ఒప్పుకోడు. దాన్నుంచి దూరంగా పారిపోతున్నా అనుకుంటాడు. పిచ్చి సన్నాసి. అలా ఇంకా తప్పులు చేస్తాడు. మనుషులకి దూరంగా వెళ్తాడు. నాకు నరకం వస్తుందని భయం లేదు. ఇక్కడే నరకాలు చూశాను. నీకు నేనుగా అన్యాయం చేశాను. శివయ్యకి ఇంత కోపం ఉందని మీకు చెప్పలేదు. వాడ్ని కనటం ఓ తప్పయితే ఇంకో ఆడపిల్ల బతుకుని నరకం చెయ్యటం నా పెద్ద తప్పు. నన్ను క్షమించమ్మా' అని రెండు చేతులు పట్టుకుంది.

'అత్తయ్యా మీరు అలా అనొద్దు' అని ఆగిపోయింది. ఆమె కళ్లు మూతలుపడటం లేదు. ఆమె చేతులు కిందకు జారిపోయాయి.

★ ★ ★

శివయ్యకి టెలిగ్రాం అందింది.

'మదర్ ఎక్స్‌పైర్డ్. స్టార్ట్ ఇమ్మిడియట్లీ'

అతను టెలిగ్రామ్‌కేసి చూస్తుండిపోయాడు. మనసులో ఏదో మూల- అమ్మని చూడటానికి వెళ్తే- అనిపించింది. అంతలోనే ఇంకో శివయ్య ఎదురు తిరిగాడు.

ఎందుకు వెళ్లాలి? వెళ్తే అందరూ కలుస్తారు. తలో మాట అంటారు. అప్పుడు తనకి కోపం వస్తుంది. ఏదో అంటాడు. అక్కడ తగాదా జరుగుతుంది.

అమ్మని చూడక చంపాడు. చచ్చాక కూడ శివయ్య అమ్మ శవాన్నీ వదలిపెట్ట లేదు- అంటారు. వెళ్లినా అంతే. వెళ్లకపోయినా అంతే. డబ్బులు ఇచ్చి పంపాడు. తన బాకీ తీరిపోయిందనుకున్నాడు.

'తీరిపోయిందా? ' అంతలోనే అంతరంగంలో ఓ ప్రశ్న మొలకెత్తింది.

శివయ్య ఆలోచించాడు.

అప్పుడతనికి హిట్లర్ గుర్తొచ్చాడు.

ప్రపంచమంతా అతన్ని ద్వేషిస్తుంది.

అయినా హిట్లర్ ఎప్పుడూ ప్రపంచాన్ని

లెక్క పెట్టలేదు. మనుషులు ఎప్పుడూ ఏదో ఒకటి అంటారు. అది వాళ్ల స్వభావం. బతికినంతకాలం ఎవరితో ఏ మాటా పడ కూడదు. అంతగా అయితే ఏం చేస్తారు? మాట్లాడరు. ఇంటికి రారు. వెనకాల రకర కాలుగా మాట్లాడుకుంటారు.

అసలు తనను కనమని అమ్మా, నాన్నల్ని అడిగాడా? ముందే పిల్లలు వద్దు అనుకుంటే శివయ్యనేవాడు ఉండేవాడు కాదు. పుట్టాకా ఏం చేశారు? తన కోరి కలు ఏం తీర్చారు? ఎన్ని సార్లు అమ్మ తిట్టలేదు. ఎన్ని సార్లు కొట్టలేదు.

ఈ ప్రపంచంతో సమానంగా తననూ పెంచివుంటే, అన్నీ అవకాశాలు కల్పిస్తే తన బతుకిలా ఎందుకయ్యేది? ఏముంది తన బతుకులో? ఇలా ఆలోచనలు సాగు తున్నాయి.

అవే పనులు తనెందుకు చేస్తున్నాడనే ప్రశ్నను చిదిమేశాడు. శివయ్య తల్లిని సాయంకాలంకల్లా తీసివేస్తే మంచిదని బంధువులు, స్నేహితులు చెప్పారు.

'శివయ్య వస్తాడని మీకు నమ్మకం ఉందా? ' అన్నారు

'అతను వచ్చినా రాకపోయినా రేపు ఉదయం తుదికర్మలు చేస్తాం' అంది శివయ్యచెల్లి.

పార్వతికి ఏదో మూల ఆశ. తన భర్తలో ఎక్కడో మానవత్వపు అంశముం టుందని, రాత్రి బస్సు ఎక్కి ఉదయానికి వచ్చేస్తాడని. రామచంద్రుడు మొదటిసారి చావుని చూశాడు. తమని ఆప్యాయంగా తడివిన నాయనమ్మ స్పర్శ ఇంకా గుర్తొ స్తోంది. అత్తయ్య ఏడుస్తూనే చెబుతోంది నాయనమ్మ గురించి. అప్పుడే 'నాన్న నాన్న' ఫొటో చూశాడు.

లక్ష్మణుడికి ఇవేం తెలియవు.

రాత్రి భారంగా గడిచిపోయింది. ఉద యానికి నారాయణ వచ్చాడు అమ్మా-నా న్నల్తో పాటు. సీతని తీసుకురాలేదు.

ఇప్పుడు తలకొరివి ఎవరు పెట్టాలనే సమస్య వచ్చింది.

'లక్ష్మణుడు' చిన్న పిల్లవాడు కాబట్టి రామచంద్రుడితో కొరివి పెట్టిస్తే బాగుం టుందా అనుకున్నారు.

పార్వతికి ఏం చేయాలో తోచట్లేదు. అప్పుడు శివయ్య బాబాయి వచ్చాడు.

'చిన్న పిల్లలు దేవుళ్లతో సమానం అంటారు. నీ పిల్లల మీద మాకు ఎలాంటి ద్వేషం లేదు. వీళ్లలో సగమే నువ్వు. ఇంకో సగం శివయ్య ఉన్నాడు. అందుకని అల్లుడి చేతుల మీదుగానే ఆమెని పంపిస్తే బాగుంటుంది' అన్నాడు.

'ఈ విషయంలో నేనేమీ మాట్లాడలేను.

> **కొత్తగాలి...**
>
> **ఏడుస్తూ పుడతాడు**
> **ఏడిపిస్తూ చస్తాడు**
> **తన ఏడుపు**
> **ఇతరుల ఏడుపుల మధ్య**
> **పోరాడుతూ జీవిస్తాడు**
>
> – ఏ.సూర్యప్రకాశ్, నిజామాబాద్

ఆ అర్హత నాకు లేదు. మీకిష్టం వచ్చినట్లు చేయండి మావయ్యగారు' అంది పార్వతి.

'మీ పెద్దవాడితో కొరివి పెట్టించినా.. రేపు శివయ్యకి తెలుస్తుంది. అప్పుడు మీ ఇంట్లో గొడవలు మొదలవుతాయి. అయినా మా అన్నయ్య చనిపోయాక వదిన ఎన్ని కష్టాలు పడిందో మాకు తెలుసు. మా అందరివీ చిన్న సంసా రాలు. ఎవరి బతుకులు వారు చూసుకోవ టమే సరిపోయింది. ఏనాడూ ఎవరినీ పల్లెత్తుమాట అనని మంచి మనిషి మా వదిన. చివరికి శివయ్యపెళ్లి కూడా

చేసింది. తన బాధ్యత తను పూర్తిచేసి వెళ్లి పోయింది. ఆమె తుది కర్మలకి ఎలాంటి లోటూ జరగనివ్వం' అన్నాడాయన.

అలా పార్వతి అత్తగారి తుది ప్రయాణం అల్లుడి చేతుల మీదుగా ముగిసిపోయింది.

★ ★ ★

ఇంటికి వచ్చారు.

అప్పటికి శివయ్య ఇంట్లోనే ఉన్నాడు. ఏం జరిగిందని అడగలేదు. పిల్లలకు స్నానాలు చేయించింది. తనూ స్నానం చేసింది. 'టీ' చేసుకుని శివయ్య దగ్గరకు తీసుకొచ్చింది.

'డబ్బులు ఇచ్చావా?' అన్నాడు.

'ఇచ్చాను'

'ఎవరికిచ్చావు?'

'అత్తయ్యగారికే ఇచ్చాను'

'తీసుకుందా?'

'వెయ్యి రూపాయల్తో రుణం తీర్చుకుంటున్నాడా అన్నారు'

'లక్ష కావాలంటా. ఆవిడ ఇచ్చిన లక్షలూ, కోట్లూ నా దగ్గర మూలుగుతున్నాయా?' అని అరిచాడు.

'నన్ను అడిగి లాభమేముంది? ఇప్పుడు అత్తయ్యా లేరు. అయినా అత్తయ్యా మిమ్మల్ని ఏమీ అనలేదు?'

'నిజం చెప్పు. ఏమీ అనలేదా?'

'నిజమే చెబుతున్నాను. ఏమీ అనలేదు'

'మా చెల్లి అందా? ఇంకెవరన్నా ఏమన్నా అన్నారా?'

'నా ముందు ఎవరూ ఏమీ అనలేదు. ఉదయందాక మీరు వస్తారని చూశారు. చివరికి అల్లుడితోనే కర్మకాండలు చేయించాలనుకొన్నారు. అలానే చేశారు. పదకొండో రోజు పెద్దకర్మ అనుకున్నారు. వచ్చినవారు అత్తయ్యగారి మంచితనం గురించి, ఆమెపడ్డ కష్టాల గురించే మాట్లాడారు తప్ప ఇంకో ప్రస్తావన తీసుకురాలేదు' అని వంట గదిలోకి వెళ్లిపోయింది.

శివయ్యకి నమ్మాలనిపించలేదు.

రామచంద్రుడ్ని బయటికి తీసుకువెళ్లాడు.

'ఎవరెవరు వచ్చార్రా' అన్నాడు.

'పెద్దమావయ్యా, అమ్మమ్మా-నాయనమ్మా వచ్చారు' అన్నాడు.

'ఇంకా...'

'ఎవరెవరో వచ్చారు.. వాళ్లెవరో నాకు తెలియదు'

'ఎవరన్నా నిన్ను ఏమన్నా అడిగారా?'

'అంటే...'

'మీ నాన్న ఎందుకు రాలేదు. ఇలాంటివి, మీ అత్తగానీ, మావయ్యగానీ మన ఇంటి గురించి అడిగారా?'

'లేదు. అత్తయ్య మీ నాన్న ఫొటో చూపించింది. చిన్నప్పుడు అత్తయ్యా, నువ్వూ ఉన్న ఫొటో కూడా చూశాను నాన్నా' అన్నాడు రామచంద్రుడు.

శివయ్య తలూపాడు.

'నారాయణ మావయ్యని సీతని ఎందుకు తీసుకురాలేదు అని అడిగాను. సీతని బడికి పంపిస్తున్నారంట.'

'సీత గురించి నువ్వెందుకు అడిగావు?' అన్నాడు అనుమానంగా చూస్తూ. రామచంద్రుడు మాట్లాడలేకపోయాడు.

అప్పుడు చెవి పట్టుకున్నాడు. దాన్ని మెలి తిప్పుతుంటే 'అమ్మా' అన్నాడు బాధగా. అప్పటికే కందిపోయింది ఎర్రగా.

చెవి వదిలేసి క్రూరంగా కళ్లలోకి చూస్తూ చెప్పాడు- 'ఇలాంటివి నాకు ఇష్టం ఉండదు. ఎక్కడికన్నా పంపిస్తే వెళ్లి చూసి రావాలి. ఎవరితోనూ ఎక్కువ మాట్లాడకూడదు. మన ఇంటి విషయాలు చెప్పకూడదు. అర్థమయిందా?'

తలూపాడు.

అప్పుడు ఇంట్లోకి తీసుకువచ్చాడు.

పార్వతి ఆ రోజు రాత్రి అడిగింది.



'పెద్దకర్మ రోజు నన్ను వెళ్లమంటారా?'

'అవసరం లేదు. అంతేకాదు మీ పుట్టింటివారు బట్టలు పెట్టడం, నిద్రలు చేయటంలాంటివి చేయనవసరం లేదు. నాకు అలాంటివంటే అసహ్యం' అన్నాడు.

★ ★ ★

శివయ్యకి ఇప్పటివరకు గడిచిన తన జీవితం గురించిన ఆలోచనలు మొదలయ్యాయి.

అతనికి ఊహ తెలిసినప్పట్నుంచి ఉన్న అనుభవంలో ఓసారూప్యత కనిపించింది. స్నేహితులుగాని, బంధువులుగాని, చుట్టుపక్కల ఉన్నవారుకాని తనను శపిస్తున్నారు.

కొంత మంది నీకు ఆడపిల్లలు పుడితే తప్ప నీ అహంకారం తీరదని అన్నారు. ఇంకొందరు నీకు మంచాన పడిపోయే రోగం రావాలి అన్నారు. జీవితమంతా అలాంటివారి గురించి ఆలోచించటంతో సరిపోయింది. ఎంత సమయం వృధా అయిపోయిందో తలుచుకుంటే ఆశ్చర్యం,

బాధ కూడా కలిగాయి. నిజానికి శివయ్య పెళ్లి చేసుకోకూడదు అనుకున్నాడు. అప్పుడు 'నీకు పెళ్లి ఎందుకురా?' అన్న వాళ్ళు గుర్తొచ్చారు. జీవితంలో వాళ్ళు ఎప్పుడన్నా తారసపడితే ముందు అడిగే ప్రశ్న అది. 'పెళ్లి చేసుకున్నావా?' అని. లేదంటే వారెలా చూస్తారో తనకి తెలుసు.

తన పెళ్లికి రెండు సంవత్సరాల ముందు నాన్న చనిపోయాడు. అప్పుడే చెల్లి పెళ్లి జరిగింది. 'బావ' కాళ్లు కడగమన్నాడు నాన్న. 'నేను కడగను' అన్నాడు శివయ్య నలుగురి ముందు.

'కడాగాల్సిందే' అని తండ్రి పట్టుబట్టాడు.

'నేను ఇంట్లోనుంచి వెళ్లిపోతాను గాని కడగను' అన్నాడు శివయ్య. మగపెళ్లివారు శివయ్య నాన్నని సమాధాన పరిచారు.

'ఇది బలవంతంగా చేయించాల్సిన పని కాదు. ఈ పెళ్లి తంతు మనకి సాంప్రదాయంగా వస్తోంది. ఎవరు కడిగినా పర్వాలేదు. అసలు కాళ్లు కడగకపోయినా ఎవరూ ఏమీ అనుకోం'

శివయ్య నాన్న కొడుకుకేసి ఓ చూపు చూసి తనే అల్లుడి కాళ్లు కడిగాడు. ఆ తర్వాత ఇద్దరి మధ్య పెద్ద గొడవ అయ్యింది.

'నేను చెప్పిన పని చెయ్యకుండా అంత మందిలో నన్ను అవమానిస్తావా?' అన్నాడు.

'నన్ను నువ్వు చాలాసార్లు అవమానించావు' అన్నాడు శివయ్య.

'శివా- అలా మాట్లాడటం తప్పు' అంది అమ్మ.

'నువ్వు కూడా నన్ను అవమానించావు' అన్నాడు.

శివయ్య పెద్ద చదువులు చదవాలనుకున్నాడు. మంచిబట్టలు వేసుకోవాలనుకున్నాడు. ఊర్లో ఉన్న హోటళ్లలో భోంచేయాలనుకున్నాడు. వచ్చిన సినిమాలన్నీ చూడాలనుకున్నాడు. అవేవీ తీరలేదు.

అమ్మ ఎప్పుడూ చెల్లెలికి బట్టలు కుట్టించేది.

'అదేంటమ్మా నాకూ కొత్త బట్టలు కావాలి' అనేవాడు.

'నువ్వు మగపిల్లవాడిని శివా. రెండు జతలున్నా సరిపోతుంది. ఆడపిల్లంటే అలా కాదు. అయినా చెల్లికి మాత్రం ఎన్ని బట్టలున్నాయి?' అనేది.

ఎప్పుడు డబ్బులు అడిగినా 'మనకి ఆడపిల్ల ఉంది. ఆ విషయం మరిచిపోవద్దు.. దాని పెళ్లి నాటికి గొలుసులూ- బంగారపు గాజులూ అయినా చేయించాలి' అనేవారు.

'నాకు అవసరం లేదా?' అనేవాడు.

'నువ్వు మగవాడివి. నీకు కట్నం వస్తుంది. నీకు కాబోయే భార్య అవన్నీ తెచ్చుకుంటుంది' అనేవారు.

'శివా నీకు పైచదువులు చెప్పించే స్తోమత మాకు లేదు. ముందు నీ చెల్లెల్ని ఓ ఇంటిదాన్ని చేస్తే మాగుండెల మీది భారం తొలిగిపోతుంది.

నువ్వు సంపాదించుకున్నాక నీ ఇష్టం వచ్చినట్లు ఖర్చు పెట్టుకో. మన ఆదాయం ఎంతో నీకు తెలుసు' ఇలాంటి మాటల్తో విసుగు, ద్వేషం శివయ్యలో కలిగాయి.

ఆడపిల్లలేనా మనుషులు? మగపిల్లలు కాదా! వాళ్ళ కోసమే అమ్మా- నాన్నలు బతుకుతున్నారా? అన్ని జాగ్రత్తలూ వారికేనా? అలాంటప్పుడు తనని ఎవరికయినా దత్తత ఇవ్వాల్సింది. ఇంకోసారి కూడా మగపిల్లాడు పుడతారని కనివుంటారు.

అప్పట్లో ఆపరేషన్లు లేవు! ఎందుకని ఇద్దరు పిల్లలే పుట్టారో తెలియదు. ఇంకో ఆడపిల్ల పుట్టివుంటే తన బతుకు ఇంకా నరకం అయివుండేది. అందుకే శివయ్యకి ఆడవారంటే ద్వేషం. ఎవరన్నా ఆడపిల్లల గురించి సానుభూతితో మాట్లాడినా అతనికి ఆగ్రహం ముంచుకువచ్చేది.

చిన్నప్పుడు దూరంగా కూర్చుని ఆ మాటలు వినేవాడు.

ఆడపిల్ల గుండెల మీది కుంపటి అన్నప్పుడు ఇంకా రగిలిపోయేవాడు. ఎవరికి గుండెల మీద కుంపటి? ఆడపిల్లలు అమ్మా-నాన్నలకి కాదు అన్నా-తమ్ములకి గుండెల మీది కుంపటి. వాళ్ల వల్లనే మగ పిల్లల భవిష్యత్తు నాశనమవుతోంది అనే నిర్ణయానికి వచ్చాడు.

అందుకే ఎప్పుడూ చెల్లితో మాట్లాడేవాడు కాదు. 'అన్నయ్యా' అంటూ దగ్గరకు వస్తే కసురుకునేవాడు. తన వస్తువులు ఏది ముట్టుకున్నా కసురుకోవటంతో పాటు కొట్టేవాడు. క్రమంగా చెల్లికి శివయ్య అంటే భయం పట్టుకుంది. ఓ ఇంటిలో ఇద్దరు అపరిచితులు కలిసి బతుకుతున్నట్లు ఉండేది.

శివయ్య మనసులో ఒకటే ఉండేది.

'నువ్వు బాగా చదువుకో. మంచి ఉద్యోగం చెయ్యి. చెల్లి పెళ్లి నువ్వు చెయ్యి' అని నాన్న తనని అడగాలని ఉండేది. అలా ఎప్పుడూ వాళ్ల నాన్న చెయ్యలేదు. పైగా శివయ్య గురించి బంధువులుగాని, చుట్టుపక్కలవారుగాని అడిగినప్పుడు- 'మా అబ్బాయిది చిత్రమైన లోకం. ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్నవాడిలా ఉంటాడు. చదువు అంతంత మాత్రమే. మగపిల్లవాడు కాబట్టి ఏదో రకంగా బతుకుతాడు. కూలిపని చేసుకున్నా, ఎక్కడన్నా గుమస్తాగా చేరినా రోజులు గడిచిపోతాయి' అని చెప్పేవాడు. అప్పుడే శివయ్యకి తన బతుకు ఏమిటో స్పష్టంగా అర్థమయింది. ఇంట్లో తింటూ బడికి వెళ్లి చదువుకోవటం కాబట్టి తనని చదివిస్తున్నారు. అందులోనూ తమ ఊర్లో స్కూల్ ఉంది కాబట్టి. ఇంకేదన్నా ఊరికి పంపించటం అయితే చదువు మాన్పించేవారు. ఎవరి దగ్గరో పనికి కుదిర్చేవారు. ఇలాంటి ఆలోచన వచ్చాక చదువు మీద ఆసక్తి తగ్గిపోయింది. ఏదో చదవాలి కాబట్టి చదివాడు.

సొంత తండ్రి- మా అబ్బాయి ఎందుకూ పనికిరానివాడని నలుగురికీ చెబితే అంత కంటే అపజయం ఏముంటుంది. అన్యాయం ఏముంటుంది. అనేది మెదడులో నాటుకుపోయింది. చివరికి చెల్లి పెళ్లి విషయంలో కూడా తనని సంప్రదించలేదు. ఎంత కట్నం ఇచ్చారో తెలియదు. ఎన్ని ఖర్చులు పెట్టారో తెలియదు. తనకి మాత్రం ఓ కొత్త ప్యాంట్, షర్ట్ కుట్టించారు. చెల్లికి మాత్రం చీరలు తీసుకున్నారు. 'బావ' అనే వాడికి బట్టలూ, వాచ్, ఉంగరం తీసుకున్నారు. కొత్త కాపురం పెట్టటానికి ముందే సామాన్లు కొన్నారు.

## కొత్తగాలి...

**అప్పటి ప్రభుత్వాలు**
**పారదర్శకాలు**
**ఇప్పటి ప్రభుత్వాలు**
**సారా దర్శకాలు**

– చక్కా చెన్న కేశవరావు,
కావలి

మంచాలు, పరుపులు అన్నీ.

ఇవన్నీ చేసింది చాలక నేను చెల్లి మొగుడికి కాళ్లు కడగాలా అనుకున్నాడు. అంతేకాక నాన్న మీది కసి తీర్చుకోవటానికి ఇన్ని సంవత్సరాలకి అవకాశం దొరికింది. వినియోగించుకున్నాడు. ఆ తర్వాత నాన్న ఎక్కువ రోజులు బతకలేదు.

'శివయ్యని చూస్తే దిగులు పట్టుకుంది. మన మీద వాడికి ద్వేషం ఉంది. నిన్ను వాడు చూడడు. నీ బతుకు ఏమవుతుందో' అని భార్య దగ్గర కన్నీళ్లు పెట్టుకున్నాడు.

'నా ఒంట్లో ఓపిక ఉన్నంత వరకూ

నేను వాడికి భారం కాను. అయినా నా కర్మ బాగుండకపోతే ముక్కు మూసుకుంటే మూడు నిముషాలు' అందామె.

ఆయన ఏ మంచాన పడకుండా గుండె పోటుతో చనిపోయాడు. ఆ తర్వాత ఆయన చేసిన అప్పుల్ని ఆమె కొద్దిపాటి స్థలం ఉంటే అమ్మి తీర్చేసింది.

శివయ్య ఆ స్థలం అమ్మటానికి వీల్లేదన్నాడు.

'అది మీనాన్న సంపాదన. నీకు కనుక పెళ్లయి పిల్లలుంటే వారికి హక్కు ఉండేది. ఇప్పుడమ్మి బాకీలు తీర్చకపోతే, వడ్డీకి నిన్ను నువ్వు అమ్ముకోవాలి' అన్నారు పెద్ద మనుషులు.

నిజానికి శివయ్యకి ఆ స్థలం అమ్మి చిన్న వ్యాపారం చేసి అప్పులు తీర్చాలని ఉంది. ఆ మాట అన్నాడు.

'నష్టం వస్తే ఏం చేస్తావు? అయినా వ్యాపారం చేయటానికి నీకేం అనుభవం ఉంది' అంది అమ్మ.

శివయ్య వాదించదలచుకోలేదు. అతను ఆ రోజుతో అమ్మకీ- తనకూ సంబంధం తెగిపోయింది అనుకున్నాడు. అదే చెప్పి ఆ ఊరి నుంచి వచ్చేశాడు. ఎవరి దగ్గరో గుమస్తాగా చేరాడు.

'చెల్లి' అమ్మను 'మా ఇంటికిరా. మీ అల్లుడిగారికి ఎవరూ లేరు. నిన్ను సొంత తల్లిగా చూసుకుంటానన్నారు' అంది. అలా శివయ్య తల్లి కూతురు దగ్గరికి వెళ్లిపోయింది. అయితే ఆమె బంధం తెంచుకోవాలనుకోలేదు. ఓ సంబంధం చూసి బంధువుల్తో మాట్లాడింది.

'ఈ పెళ్లి చేసుకుని వాడి బతుకు వాడ్ని బతకమనండి. మేం పెళ్లికి వచ్చి వెళ్లిపోతాం. ఆ ఒక్కరోజూ ఎవరితోనూ తగాదా పడవద్దని చెప్పండి' అంది.

శివయ్యకు అదే చెప్పారు. పెళ్లి చేసుకోవాలి అనుకున్నాడు శివయ్య. తనంతట తాను ఎవర్నీ అడగడు. బ్రహ్మచారిగా ఉండటం ఇష్టమేగాని ఓడిపోవటం ఏమాత్రం ఇష్టం లేదు కాబట్టి పార్వతితో పెళ్లి జరిగిపోయింది.

ఆ తర్వాత 'మావ'గారు నువ్వు నీ భవిష్యత్తు గురించి జాగ్రత్తగా ఆలోచించి ప్లాన్ చేసుకోమని సలహా చెప్పబోయాడు. శివయ్యకి కోపం వచ్చింది.

నువ్వు నీ కూతురు గురించి అంత బాధపడితే నాతో ఏదన్నా వ్యాపారం చేయించాలి. నీకు అంత పరపతి ఉంటే మంచి ఉద్యోగం ఇప్పించాలి. అంతేగాని నా గురించి నాకు తెలియదా- అనుకున్నాడు. అందుకే పార్వతిని ఇంటి దగ్గర మీతో ఉంచుకోండి అన్నాడు. ఆ రకంగా వారి సంబంధం తెంచేసుకున్నాడు.

ఇప్పుడు ఆలోచిస్తే అందరూ తనమీద పగబట్టారు. తన పతనం చూడాలనుకుంటున్నారు. అందుకు తన పిల్లల్ని ఆయుధాలుగా తన మీదకు వదలాలనుకుంటున్నారనే నిర్ణయానికి వచ్చాడు. భవిష్యత్తులో ఏం జరుగుతోందో తెలియదు. నిజంగానే తను మంచానపడే పరిస్థితి రావొచ్చు. అప్పుడు భార్యా-పిల్లలు అందరూ తనమీద తిరుగుబాటు చేస్తారు.

అందుకు తట్టుకోవాలంటే రెండు మార్గాలు. ఒకటి బాగా సంపాదించటం. ఆస్తి తన పేరున చనిపోయేదాకా ఉంచుకోవటం. డబ్బు ఉంటే అయినవారు కాకపోతే బయటివారైనా సేవలు చేస్తారు.

రెండవది పిల్లల్ని తన చెప్పు చేతల్లో ఉంచుకోవటం. మొదటి ప్రయత్నం చేస్తూనే రెండో పద్ధతి అమలు చేయాలని గట్టిగా నిర్ణయించుకున్నాడు.

★ ★ ★

ఆ రోజు క్లాసు మాస్టారు సెలవుమీద ఉన్నారు. అందుకని ఎన్.సి.సి. మాస్టారు

క్లాసు తీసుకున్నారు.

అందరి పేర్లూ అడిగి తెలుసుకుంటూ 'రామచంద్రుడు' దగ్గర ఆగారు.

'మీ నాన్నగారు ఏం చేస్తుంటారు?' అన్నాడాయన.

'మిల్లులో గుమస్తా. లెక్కలు రాస్తుంటారు' అన్నాడు.

'మీ నాన్న పేరు దశరథుడా?'

'కాదు మాస్టారూ శివయ్య'

'నీకు అన్నలూ అక్కలూ ఉన్నారా?'

'తమ్ముడు ఉన్నాడండి'.

'అతని పేరేంటి?'

'లక్ష్మణుడు'

'కవల పిల్లలా?'

రామచంద్రుడు తల అడ్డంగా ఊపాడు.

'మీనాన్న చాలా గొప్పవాడురా. అందుకే మీకు ఆ పేర్లు పెట్టాడు. రామచంద్రుడంటే తండ్రి మాట జవదాటడు. ఇంక లక్ష్మణుడయితే అన్నయ్య కోసం భార్యని వదిలేసి అరణ్యాలకి వెళ్లాడు. అన్నే దేవుడు. మీరిద్దరూ అంత ఆప్యాయంగా ఉండాలని ఆ పేరు పెట్టాడు. నువ్వు మీ నాన్నని ఎదిరిస్తావా?'

రామచంద్రుడు తల అడ్డంగా ఊపాడు.

మాస్టారు చిరునవ్వుతో చూసి పదినిముషాలు రామాయణ కథ చెప్పాడు. ఆ తర్వాత 'హాకీ' గురించి చెప్పాడు. అప్పుడు రామచంద్రుడ్ని 'నువ్వు ఏదన్నా పాట పాడు' అన్నాడు.

'నాకు పాటలు పాడటం రాదు మాస్టారూ' అన్నాడు.

'నేర్చుకో' అని, ఇంకెవరినన్నా వచ్చి పాడమన్నాడు. అప్పుడో అబ్బాయి వచ్చి 'ఒహో ఒహో పావురమా! ఒయ్యారి పావురమా!' అంటూ పాడటం మొదలుపెట్టాడు.

రామచంద్రుడికి అలాంటి పాట ఉందని తెలియదు. చాలా ఉత్సాహంగా వింటున్నాడు. అప్పుడే గంట మోగటంతో పాట మధ్యలో ఆగిపోయింది.

'మీరు ఎన్.సి.సి.లో చేరితే బాగుంటుంది. అక్కడ డిసిప్లిన్ ఉంటుంది' అని ఆయన వెళ్లిపోయాడు.

రామచంద్రుడు పాట పాడిన అబ్బాయి దగ్గరకు వెళ్లి 'నాకు ఆ పాట నేర్పించవా'

## చతురలో ఎనిమిదో నవల



### పి.చంద్రశేఖర అజాద్

ఈ నవలలో శివయ్యలాంటి వాడిని నేను చూశాను. ప్రతి మనిషిలోనూ శివయ్య అంశ ఏదో మేరకు ఉంటుంది. మనుషుల్ని అర్థం చేసుకునే ప్రయత్నంలో ఈ నవల రాశాను. అందుకు బీజం వేసింది పిల్లలు. ఓ రచన కనీసం కొంత కాలమైనా పాఠకుల మనస్సుల్లో ఉండాలని నేను కోరుకుంటాను. నిరంతరం కథలో, నవలలో స్క్రీన్ ప్లేనో, సంభాషణలో రాస్తూ ఎప్పుడైనా సరదాగా నటించడం నా ప్రపంచం. 'లయ' సీరియల్ సంభాషణలకు సీఎంఎస్ అకాడమీవారు స్క్రిప్ట్ రచయితల సమావేశంలో పరుచూరి గోపాలకృష్ణ చేతులమీదుగా పురస్కారం అందించటం తాజా జ్ఞాపకం.

చిరునామా :
పి.చంద్రశేఖర అజాద్,
ఫ్లాట్ నెం.101, సాయి రెసిడెన్సీ,
సంగీత్ నగర్, కూకట్‌పల్లి,
హైదరాబాద్-500072

అని అడిగాడు.

'ముందు పాట నేర్చుకోవాలంటే పుస్తకంలో రాసుకోవాలి' అని ఆ పాటంతా చెప్పాడు.

రామచంద్రుడు తన నోట్ బుక్‌లో ఆ పాటని రాసుకుంటుంటే పాటకి పల్లవి, చరణాలు ఉంటాయని తెలిసింది.

★ ★ ★

శివయ్యని మిల్లు యజమాని పిలిచాడు.

'ఏంటయ్యా లెక్కలన్నీ తప్పులు రాశావు' అన్నాడు.

'నేను తప్పులు రాయలేదు. కావాలంటే ఇంకోసారి చూసుకోండి' అన్నాడు శివయ్య ముఖం చిట్లించి.

## కొత్తగాలి...

**వెన్నెల్లో కొత్తదంపతులు**
**సిగ్గేసింది కాబోలు**
**చందురుడు**
**మబ్బుచాటుకు వెళ్లాడు**

– తూలుగు రమణారావు
అక్కరాపల్లి, శ్రీకాకుళం జిల్లా

'చూశాకే అడుగుతున్నా. ఇదేంటి కూడి చెప్పు' అని పుస్తకం శివయ్య ముందు పెట్టాడు.

'నేను ఇంతకు ముందు పెన్సిల్‌తో రాసినప్పుడు కూడాను. తర్వాత వేరేగా పెన్‌తో రాసారు. మనం రాసేది రెండు లెక్కలు కదా' అన్నాడు శివయ్య.

దాంతో ఆయనకు కోపం వచ్చింది.

'పదహారు లెక్కలు రాసుకుంటామయ్యా. నీకు ఉద్యోగం ఇచ్చింది చెప్పిన పని చేయటానికి. నువ్వు మిల్లు పెట్టుకున్నప్పుడు ఒకే పుస్తకం పెట్టి రాద్దువుగాని. కాస్త ఒళ్లు దగ్గరుంచుకుని పనిచెయ్యి.

'అలానే చేస్తున్నాను' అన్నాడు శివయ్య.

దాంతో యజమాని కోపం నషాళానికి అంటుకుంది. 'ఏంటయ్యా నువ్వు చేసేది? నీ ముఖం ఎప్పుడన్నా అద్దంలో చూసుకున్నావా? ఎప్పుడు పేలాలు ఏగుతున్నట్టు ఉంటుంది. నన్నే నువ్వు లెక్క చేయటం లేదు. అసలు నీకు ఈ పని ఇవ్వటమే నేను చేసిన తప్పు. ఇంకోసారి ఇలా మాట్లాడితే మిల్లు గుమ్మం తొక్కనివ్వను. ఏదో పిల్లల తండ్రివని జాలిపడుతుంటే తిక్క తిక్కగా ఉంది' అన్నాడు.

'ఎక్కువ మాట్లాడొద్దు' అన్నాడు శివయ్య.

యజమాని అదిరిపోయాడు.

'నాకు ఈ ఉద్యోగం ఇచ్చినప్పుడు నాది ఈ ముఖమే. నాకు పిల్లలున్నారు. వాళ్ల మీద నీకు జాలెందుకు? నీ పిల్లలమీద జాలిపడు. నువ్వు, నన్ను మిల్లు ముందుకు రానీయకపోవటం ఏమిటి? నీ బోడి మిల్లు దగ్గరకు నేనే రాను. నిన్ను నమ్ముకుని నేను పుట్టలేదు. నువ్వు పోషిస్తావని నేను పిల్లల్ని కనలేదు. తిక్క నీకు ఉంది. నాకు రావాల్సింది లెక్క చూసి పారేయ్. ఇప్పుడే వెళ్లిపోతాను' అన్నాడు రొప్పుతూ.

అప్పుడతను శివయ్య కళ్లలోకి చూశాడు. మిల్లులో పనివాళ్లను కోప్పడటం మామూలే. అందుకు ఎవరూ ఏమీ అనుకోరు. ముందు ఎదురు చెప్పరు. శివయ్యకి కోపం ఎక్కువ అని కొంతమంది పనివాళ్లు చెప్పారు. మొదటిసారి కాస్త కఠినంగా మాట్లాడాడు. దానికింతగా ఎదురు తిరుగుతాడనుకోలేదు.

'అదేదో నువ్వే లెక్క చూసుకుని చెప్పు. ఈ మిల్లు కాకపోతే ఇంకోమిల్లు అనుకుంటున్నావేమో. ఏ మిల్లులోనూ నువ్వు పని చెయ్యలేవు. నీ ప్రవర్తన ఇలా ఉంటే'

'నువ్వు కూడా ఇలా మాట్లాడితే ఎవరితోనూ పని చేయించుకోలేవు' అని తనకు

రావలసిన డబ్బులు తీసుకుని వచ్చేసాడు.

'వీడు మూర్ఖుడా! అమాయకుడా? అసలు ఏం చూసుకుని వీడికి ఇంత అహంకారం?' అనుకున్నాడాయన.

శివయ్య కోపంగా ఇంటికి వచ్చాడు.

పార్వతి పనిలోవుంది. పక్కకు చూస్తే రామచంద్రుడి పుస్తకాలు కనిపించాయి.

ఓ పుస్తకం అందుకుని తిరగేస్తుంటే 'పావురం' పాట కనిపించింది. దాంతో 'రాముడూ' అని పెడబొబ్బ పెట్టాడు. అప్పుడే స్నానం చేస్తున్న రామచంద్రుడి చేతినుంచి చెంబు జారిపోయింది. పెద్ద శబ్దం. పార్వతి ఉలిక్కిపడింది. శివయ్య ఒక్క ఉదుటున వచ్చి రాముడి జుట్టు పట్టుకుని ఇవతలకి లాగి నడుంవంచి పిడి గుద్దు గుద్దాడు.

'అమ్మో' అనే శబ్దం సొంతం బయటకు రాలేదు.

ఎందుకు కొడుతున్నాడో తెలియదు రామచంద్రుడికి - పార్వతికి. ఓ పక్కన లక్ష్మణుడు తండ్రిని చూస్తున్నాడు. 'చావరా చావు' అని తన్ని వెనక్కి తిరిగి ఇంట్లోనుంచి వెళ్లిపోయాడు. రామచంద్రుడు బాధ భరించలేక కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు.

'ఏం చేశావురా? బడిలో పిల్లల్తో తగాదా పడ్డావా? పంతులుగార్ని ఏమన్నా అన్నావా? ఎందుకు నిన్ను చావగొట్టాడు?' అంది పార్వతి కన్నీళ్లతో.

'నాకు తెలియదమ్మా. నేను ఎవర్నీ ఏమీ అనలేదు' అని రక్తం కారుతుంటే వేలితో రాసుకుంటూ ఇంకా బిగ్గరగా ఏడుస్తుంటే పార్వతి హృదయం తరుక్కుపోయింది. రామచంద్రుడ్ని దగ్గరకు తీసుకుని కన్నీళ్లు పెట్టుకుంది.

★ ★ ★

శివయ్య నడుచుకుంటూ ఊరవతలకు వెళ్లాడు. అక్కడ ఒంటరిగా కూర్చున్నాడు.

తను చేసింది తప్పా అనిపించింది... ఓ క్షణమే. అంతలోనే అసలు శివయ్య విజృంభించాడు. నన్ను అన్ని మాటలు అన్నవాడిదగ్గర ఎలా పనిచేస్తాను? వాడు అదృష్టవంతుడు. లేకపోతే కడుపులో కుమ్మేసేవాడ్ని అనుకున్నాడు.

అక్కడ కూడా ఉండాలనిపించలేదు.

రేపట్నుండి ఏం చేయాలన్న ఆలోచన వచ్చింది. అంతకు ముందు సూర్యతో స్నేహం ఉండేది. వాడు బాగా మాట్లాడేవాడు. ఎప్పుడన్నా 'నువ్వు అలా చేసి ఉండాల్సింది కాదు' అని, అంతలోనే 'సర్లేరా. ఎలా జరగాలనుంటే అలా జరుగుతుంది' అనేవాడు.

అలాంటిది సూర్యతోనూ తగాదా వచ్చింది. ఎప్పుడన్నా అవసరం పడినప్పుడు డబ్బులు సర్దేవాడు. అయితే మాత్రం తను వాడి మనిషి కాదు. ఎలాబడితే అలా మాట్లాడితే అమ్మనీ నాన్ననే లెక్కపెట్టలేదు. సూర్యగాడ్ని లెక్కపెడతానా?

ఈ ప్రపంచమంతా తనకు ఎదురు తిరిగినా లెక్క చేయడుగాక లెక్క చేయడీ శివయ్య అనుకున్నాడు.

ఇంటికి వచ్చేటప్పటికీ చీకటి పడింది.

రామచంద్రుడు చదువుకుంటూ మధ్యలో దెబ్బలు తగిలిన చోట చూసుకుంటున్నాడు.

'అరేయ్ ఇలా రా' అని పిలిచాడు.

అప్పుడు రామచంద్రుడు వణికిపోయాడు. మళ్లీ నాన్న భయంకరంగా కొడతాడు అనిపించింది. మెల్లగా లేచి వచ్చి ఎదురుగా నిలబడ్డాడు.

'నువ్వు పావురాన్ని పెంచుకుందామని చెప్పినప్పుడు ఏమన్నాను?'

'వద్దన్నారు'

'ఇప్పుడు నీ నోట్ బుక్‌లో పావురం పాట ఎందుకు రాశావు?'

రామచంద్రుడు మాట్లాడలేకపోయాడు.

'అంటే నీ మనసులో ఇంకా పావురాలను పెంచుకోవాలనుంది. నాన్న చెప్పినా నీకు లెక్కలేదు అంతేగా..'

'మాస్టారు పాట పాడమన్నారు. రాదంటే నేర్చుకోమన్నారు. ఫ్రెండ్ ఈ పాట పాడితే రాసుకున్నాను' అన్నాడు రామచంద్రుడు మరింతగా వణికిపోతూ.

'వాడికి ఈ పాట ఒక్కటే వచ్చా? ఇంకే పాటలు రావా?'

రామచంద్రుడు మాట్లాడలేకపోయాడు.

'నేను ఒకటి కాదంటే ఇంకా విషయం గురించి ఆలోచించకూడదు. గుర్తు పెట్టుకో.. ఇంకోసారి ఇలాంటి తప్పు చేస్తే మాత్రం నేను సహించను. వెళ్లు' అన్నాడు.

రామచంద్రుడికి దెబ్బలు తగలనందుకు చాలా సంతోషం అనిపించింది.

రామచంద్రుడు బడికి వెళ్తున్నాడు.

నాన్నకొట్టిన దెబ్బలు ఇంకా బాధ కలిగిస్తున్నాయి. ఇంకెప్పుడూ పావురంగురించి ఆలోచించకూడదు అనుకున్నాడు. అప్పుడు ఎగురుతున్న పావురం కనిపించింది. ఆగిపోయాడు.. అలా చూస్తూ నిలబడ్డాడు.

'నేను పావురాన్ని' అనుకున్నాడు. అప్పుడు పావురం తనలో ప్రవేశించింది. చిత్రమైన అనుభూతి కలిగింది.

అంతలో శివయ్య గుర్తొచ్చాడు. భయం భయంగా నాలుగు దిక్కులు చూశాడు. తనను ఏదోమూల నుండి నాన్న చూస్తున్నాడా అని.

గబగబ అక్కడ్నుంచి ముందుకు కదిలి వెళ్లిపోయాడు. ఆ రోజు చిత్రంగా బడిలో 'పావురం' గురించే మాస్టారు చెప్పారు.

ఒకప్పుడు పోస్టాఫీసులు ఉండేవి కాదని, పావురాలే ఉత్తరాలను ఒకరికొకరికి చేరవేసేవని వినగానే మరింత సంతోషం కలిగింది. అలాగే 'శాంతికపోతాలు' అని అంటారని తెలిసినప్పుడు కూడా అదే ఆనందం కలిగింది.

తర్వాత నోట్‌బుక్ చూసుకున్నాడు.

పాట రాసుకున్న కాగితం చింపేసి ఉంది. 'నాన్న చింపేసి ఉంటాడు' అనుకున్నాడు.

బడి అయ్యాక ఇంటికి వచ్చాడు.

శివయ్య కనిపిస్తాడేమోనని చూశాడు.

'నాన్న ఊరికెళ్లారు. రెండు మూడు రోజుల దాకా రారు' అమ్మ చెప్పింది. పార్వతి ముఖంలో అంత ఆనందాన్ని రామచంద్రుడు ఇప్పుడే చూస్తున్నాడు.




**పా**ర్వతికి నిద్ర పట్టటంలేదు.

శివయ్య ఎందుకు వెళ్లాడో, ఎక్కడికి వెళ్లాడో కూడా తెలియదు.

కాస్తలో కాస్త నయం ఏమిటంటే ముందుగా చెప్పాడీసారి. మొదటి రెండు రోజులూ ఆనందంగా గడిచిపోయాయి. మూడోరోజు ఉదయం అనుమానం వచ్చింది. ఏదో జరిగి ఉంటుంది. లేకపోతే ఈ ఆకస్మిక ప్రయాణం ఏమిటని?

రామచంద్రుడ్ని తలుచుకుంటేనే దిగులుగా ఉంది. 'నాన్న ఎప్పుడు వస్తాడమ్మా' అని అడుగుతూనే ఉన్నాడు. ఉదయం, సాయంకాలం, పడుకోబోయే ముందు కూడా లక్షణుడికి ఆ ధ్యాసే లేదు.

వాడి ముఖంలోకి చూస్తుంటే శివయ్య పోలికలు కనిపిస్తాయి. ఇప్పట్నుంచే వాడికా కోపం ఉందనటానికి నిదర్శనంగా

చేతిలో ఏది ఉంటే అది విసిరేస్తాడు. ఆ తర్వాత ఏడుస్తాడు. తను అనుకున్నది సాధిస్తాడు.

ఇదే లక్షణం ముదిరితే ఈ ఇంట్లో రెండో శివయ్య తయారవుతాడు. ఆ వార సత్వం కొనసాగుతుంది. రేపు అన్నయ్యతో తగాదా పడతాడేమో అనిపిస్తోంది.

ఇప్పటికిప్పుడు పిల్లల మీద ఓ అంచ నాకు రావటం తప్పవుతుందని పార్వతికి తెలుసు. అయినా మనసు కీడు శంకి స్తోంది.

రామచంద్రుడు తమ్ముడ్ని ఎత్తుకున్న ప్పుడు కూడ ముఖం మీదో తలమీదో కొడుతూనే ఉంటాడు. అయినా రామచం ద్రుడు పట్టించుకోడు. మొదలే తండ్రి భయం. ఇంత మెత్తగా ఉంటే రేపు రామ చంద్రుడు ఎలా బతుకుతాడు అని దిగులు కలిగింది.

ఆ రాత్రి పదకొండు గంటలకి శివయ్య వచ్చాడు. 'మనం ఈ ఊరునుండి వెళ్లిపో తున్నాం' అన్నాడు.

పార్వతికి అర్థం కాలేదు.

'నేను మిల్లులో ఉద్యోగం మానేశాను. ఇంక ఈ ఊర్లో ఉండటం నాకు ఇష్టం లేదు' అన్నాడు.

'ఇల్లు చూశారా? ' అంది.

'చూడమని చెప్పివచ్చాను. వారం రోజుల్లో మనం వెళ్లిపోతున్నాం' అన్నాడు.

పార్వతికి దుఃఖం అనిపించింది.

పుట్టింటి నుండి శివయ్య దగ్గరకు వచ్చాక ఇదే ఊర్లో ఉన్నారు. ఇప్పటికి మూడు ఇళ్లు మారారు. ఒకరు గోడకి మేకులు ఎందుకు కొట్టారనగానే శివయ్యకి కోపం వచ్చింది.

ఇంకో ఇంట్లో సున్నం వేయించండని శివయ్య అడిగితే, 'ఇప్పుడు డబ్బులు లేవు. కావాలంటే మీరు వేయించుకుని అద్దెలో కొంచెం కొంచెం మినహాయించుకోండి' అనగానే శివయ్యకి కోపం వచ్చింది.

ఇది చివరి ఇల్లు. ఇల్లుగలాయన యిక్కడ ఉండడు. ఎప్పుడో వస్తాడు లేదా మనుషులని పంపించి అద్దె వసూలు చేసు కుంటాడు.

ఏదో రోజు ఇల్లు మారాల్సి వస్తుందని భయపడుతోంది. కాని యిలా ఇంకో చోటుకి వెళ్లాల్సి వస్తుందనుకోలేదు. ఈ విషయం పుట్టింటివారికి చెప్పాలో వద్దో తెలియదు.

అయినా ఏ సంబంధాలు ఉన్నాయని చెప్పాలి? ఉత్తరాలు కూడా లేవు. మళ్లీ ఏ శుభకార్యమో, అశుభమో జరిగితే తప్ప కబురు రాదు.

రామచంద్రుడి చదువు విషయంలోనే పార్వతి ఎక్కువ బాధపడింది. అక్కడ ఎలాంటి బడి ఉందో, మధ్యలో చేర్చుకుం టారో లేదో అని. అయినా చేయగలిగింది లేదు. శివయ్యతో ప్రయాణం చెయ్యటమే.

★ ★ ★

రామచంద్రుడు ఇప్పుడు ఎనిమిదో తర గతికి వచ్చాడు.

ఈ సంవత్సరాలన్నింటా చాలా చాలా సంఘటనలు జరిగాయి. అవన్నీ రాష్ట్రానికి, దేశానికి, ప్రపంచానికి చెందినవి. వాటి ప్రభావం కంటే శివయ్య ప్రభావమే రామ చంద్రుడి మీద ఎక్కువగా ఉంది.

చాలాసార్లు రామచంద్రుడ్ని పిలిచాడు. పిలిచిన ప్రతిసారీ తిట్టాడు. కొన్నిసార్లు కొట్టాడు. ఏనాడు ప్రేమగా పిలవలేదు. అతనికి ఎప్పటికప్పుడు 'వీడు నా చెయ్యి దాటిపోతున్నాడా? ' అనిపించేది. అలా అనుకున్నప్పుడు మాత్రం మూడోకన్ను తెరిచేవాడు.

ఓ సారి యింక తట్టుకోలేక పార్వతి అంది-'మీకు తలకొరివి పెట్టాల్సింది రామ చంద్రుడు. వాడిని అలా తిడుతూ, కొడు తుంటే మీ మీద గౌరవం ఉండదు. మీకు





కోపం వస్తుందని తెలిసి కూడా మాట్లాడుతున్నాను.

రెక్కలు వచ్చాక పిల్లలు ఎగిరిపోతారు. అప్పటిదాకా భరిస్తారు.

నేను దేవుడ్ని ఒకటే కోరుకుంటాను. మీ కంటే నేను ముందు వెళ్లిపోకూడదు. ప్రతి ఆడదీ పునిస్త్రీగా వెళ్లిపోవాలనుకుంటుంది. నేను వెళ్లిపోతే మీరు ఎంత బాధపడతారో నాకు తెలుసు. అందుకని పిల్లల్ని స్నేహితులుగా చూడండి. కనీసం ఇప్పటినుంచి ఆ ప్రయత్నం చెయ్యండి.'

శివయ్యకి బుస్సున కోపం వచ్చింది.

తను ముందు పోవాలని కోరుకుంటుందా అని. అంతలోనే ఆమె మాటల్లో ఏదో నిజం ఉందనిపించింది. అందుకే ఓ చూపు చూసి బయటకు వెళ్లిపోయాడు.

ఆ తర్వాత రెండు రోజులకే రామచంద్రుడ్ని కొట్టాడు ఏదో వంకతో.

మౌనంగా గమనించింది పార్వతి.

ఈ మనిషి మారడు అనుకుంది. ఇతనికి ఏ విషయమూ చెప్పి ప్రయోజనం లేదు అని స్థిరమైన నిర్ణయానికి వచ్చింది.

లక్ష్మణుడి విషయంలో మాత్రం శివయ్య అనుభవం భిన్నంగా ఉంది. వాడ్ని ఓ రోజు కొట్టాడు. వెంటనే బయటకు పరిగెత్తాడు. దెబ్బలు తినలేక పారిపోయాడు అనుకున్నాడు శివయ్య. కానీ వాడు ఓ పెద్దరాయి తీసుకువచ్చాడు. శివయ్య ఓ క్షణం కొయ్యబారిపోయాడు.

'ఈసారి నన్ను కొడితే యిది నీ మీద విసురుతా' అన్నాడు. ఆ తర్వాత పక్కకు విసిరి బయటికి వెళ్లిపోయాడు

శివయ్య భ్రుకుటి ముడిపడింది. ఇంకోసారి తిట్టాడు. 'నన్ను తిడితే ఊరుకోను' అన్నాడు లక్ష్మణుడు.

'ఏం చేస్తావురా? ' అన్నాడు శివయ్య.

'నేనూ తిడతా. నా అమ్మని తిడితే నీ అమ్మని తిడతా' అన్నాడు.

శివయ్యకి తన అమ్మని తిట్టటం ఇష్టమే. ఇప్పటివరకు తను తిట్టాడు. తిట్టుకున్నాడు. బయటివాళ్లు ఎవరూ తిట్టలేదు. అది సహజంగా జరిగితే బాగుండేది. వీడు నన్ను బెదిరిస్తున్నాడు అనుకున్నాక, 'అయితే నా ఇంట్లో ఉండొద్దు. బయటకు పో' అన్నాడు.

'వెళ్తాను' అని లేచి వెళ్లిపోయాడు.

శివయ్య లక్ష్మణుడు అలా చేస్తాడనుకోలేదు.

ఇదే మాట అప్పట్లో పార్వతితో అంటే మారుమాట్లాడక తనతో వచ్చేసింది.

అలా వెళ్లినవాడు నాలుగు రోజులు ఇంటికి రాలేదు. పార్వతి కంగారుపడిపోయింది. శివయ్య తొణకలేదు. మాతృ హృదయం భరించలేక రామచంద్రుడితో, చుట్టుపక్కలవారితో వెతికించింది.

అయిదోరోజు నారాయణ లక్ష్మణుడ్ని తీసుకువచ్చాడు. శివయ్య ఇంట్లోనే ఉన్నాడు.

తన కొడుకు ఎక్కడికో వెళ్లివుంటాడనుకున్నాడు గాని, బావమరిది ఇంటికి వెళ్తాడని అనుకోలేదు.

అది చాలా అవమానం అనిపించింది.

'ఎందుకు తీసుకొచ్చావు? మీ ఇంట్లోనే ఉంచుకోకపోయావా? ' అన్నాడు.

'మా ఇంట్లో ఎలా ఉంటాడు బావా? మన సంబంధాలు బాగుంటే సెలవుల్లో వచ్చేవారు. మా ఇంట్లోనే చదువుకునేవాడు. అయినా రక్తం పంచుకున్న చెల్లాయినే మా ఇంటికి తీసుకువెళ్లలేదు.

వాడు మీ వంశంవాడు. అందుకు తీసుకొచ్చాను' అన్నాడు నారాయణ.

శివయ్య లక్ష్మణుడికేసి చూశాడు.

వాడు నిర్లక్ష్యంగా చూస్తున్నాడు.

'నువ్వు మమ్మల్ని శత్రువులనుకోవచ్చు మీ పిల్లల్ని శత్రువులనుకోవద్దు' అన్నాడు నారాయణ.

'ఇలా మాట్లాడినందుకే నేను మీ ఇంటికి రావటం మానేశాను'

'నేను తప్పు మాట్లాడటం లేదు. నువ్వు అడిగింది ఏదీ ఇవ్వవనీ, మంచి బట్టలు కొనవనీ, చివరకి పుస్తకాలకి డబ్బులు అడిగినా తిడతావని లక్ష్మణుడు చెప్పాడు. మీనాన్న దగ్గర డబ్బులు లేవేమో అన్నాను. మా నాన్నకి డబ్బులు సంపాదించటం చేతకాదు అన్నాడు లక్ష్మణుడు'

ఉలికిపాటుని దాచుకున్నాడు శివయ్య.

'అందుకే నిన్ను అడగటానికి వచ్చాను. లేకపోతే రేపు మాఇంటికి వచ్చి మా అబ్బాయిని మీరు ఎందుకుంచుకున్నారని తగాదా పెట్టుకుంటావు. నీకు తగాదాలు కొత్త కాకపోవచ్చు. మాకు అలాంటివి ఇష్టం ఉండవు. మా అబ్బాయిని నేను పెంచలేను. వాడు నా మాట వినడు. మీరు పెంచుకోండి- అని కాగితం మీద రాసివ్వు. ఇప్పుడే నా మేనల్లుడ్ని నేను తీసుకువెళ్లిపోతాను' అన్నాడు నారాయణ.

దాంతో శివయ్యకి మరింత అవమానం కలిగింది.

'నా పిల్లల్ని మీ దగ్గర పెంచేంత స్థాయి కాదు మీది'

'నువ్వు సరిగ్గా పెంచితే మా ఇంటికి ఎందుకు వస్తాడు? అయినా నువ్వు స్థాయి గురించి మాట్లాడకూడదు. అత్తయ్యని నీ చెల్లెలి దగ్గరికి పంపించావు. ఎప్పటికప్పుడు ఏదోక తగాదా మాటున బాధ్యతల నుండి నువ్వు తప్పుకుంటావు' అన్నాడు నారాయణ.

'నా ఇంటికొచ్చి నన్ను ఇష్టం వచ్చినట్టు మాట్లాడతావా? ' అని అరిచాడు శివయ్య.

'బావా నువ్వు అరిస్తే భయపడే రోజులు కావు. నేనూ చాలా మాట్లాడగలను.. కానీ మాట్లాడను' అని.

'లక్ష్మణుడూ.. నిన్ను పెంచేస్తాయి మాది కాదంటున్నాడు మీ నాన్న. అందు కని మీ నాన్న దగ్గరే ఉండు. అయినా నువ్వు గుర్తు పెట్టుకో. నీకు ఒక్క నారా యణ మావయ్యే కాదు, నాగేశ్వరరావు మావయ్య కూడా వున్నాడు. ఎప్పుడు బాధ కలిగినా, ఎవరు నిన్ను తిట్టినా, కొట్టినా మా ఇంటికి వచ్చేయ్' అని వెళ్లిపోయాడు నారాయణ.

శివయ్య తల తిప్పి చూశాడు. ఓ పక్కన పార్వతి, రామచంద్రుడు శిలల్లా నిలబడి ఉన్నారు.

'ఎందుకలాంటి పనిచేశావు లక్ష్మణా?' అంది పార్వతి.

'నా ఇంట్లో నుంచి ఎందుకు వెళ్లమ న్నాడు? ఇప్పుడైనా రమ్మంటారా.. వెళ్లి పోనా?' అన్నాడు లక్ష్మణుడు.

శివయ్య అక్కడ్నుంచి లేచి బయటకు వెళ్లిపోయాడు.

అప్పుడు పార్వతి వచ్చి 'అసలు ఎలా వెళ్లావురా.. తాతయ్య వాళ్ల ఇల్లు ఎలా తెలిసింది?' అంది ఆరాటంగా.

'అన్నయ్య తాతవాళ్లా ఊరి పేరు చెప్పాడు. నువ్వు తాత పేరు చెప్పావు. గుర్తుంచుకొన్నా' అన్నాడు.

అలా చూస్తూ ఉండిపోయింది నోట మాట రాక!

★ ★ ★

రామచంద్రుడికి తమ్ముడి అనుభవం తర్వాత కొన్ని ఆలోచనలు కలిగాయి. 'అదే పని నేను చేసివుంటే నాన్న నన్ను ఇంట్లోకి రానిచ్చేవాడా' అనేది అందులో మొదటిది.

తప్పకుండా రానిచ్చేవాడు కాదు. ఒకవేళ ఇంట్లో ఉండనిచ్చినా మావయ్య వెళ్లాక కాలో, చెయ్యో విరిచేసేవాడు. 'ఇంట్లో పడుండు. నేను తిండిపెడతాను' అనే వాడు. ఇప్పటివరకు తమ్ముడ్ని ఏమీ అన లేదు. మాట్లాడటం మానేశాడు. అందుకు తమ్ముడు ఏ కోశాన బాధపడటం లేదు.

'నాన్న నీతో మాట్లాడనందుకు నీకు బాధగా లేదా?' అని తమ్ముడ్ని అడిగాడు.

'సంతోషంగా ఉంది' అన్నాడు.

'నేను మాట్లాడకపోతేనో?'

'నువ్వూ, అమ్మా మాట్లాడకపోయినా నేను లెక్కచేయను' అన్నాడు.

'అమ్మ మాట్లాడకపోయినానా?'

'యస్' అని శివయ్యలానే తన ముందు నుండి వెళ్లిపోయాడు.

రామచంద్రుడికి ఆశ్చర్యం కలిగింది, అలా ఉండటం ఎలా సాధ్యమా అని.

ఇంక రెండో ఆలోచన తమ్ముడిలా తను ఇంటి నుంచి వెళ్లిపోయేవాడా?

తనకంత ధైర్యం లేదని అర్థమయింది.

'శివయ్య' అనే తన తండ్రి గురించి, అతని పట్టుదల గురించి విన్నాడు. చూస్తున్నాడు. ముఖ్యంగా నాయనమ్మ విషయం తనకు లీలగా గుర్తుంది.

వాళ్లందరిపట్ల అంత కఠినంగా ఉన్న 'నాన్న' అమ్మ విషయంలోనూ, ఇప్పుడు తమ్ముడి విషయంలోనూ అలా ఉండలేక పోతున్నాడు. అందుకు కారణం ఏమిటి?

నాన్నలో కూడా బలహీనతలు ఉన్నా యా? అవసరం కోసం రాజీ పడతాడా?

ఈ విషయాలు తేల్చుకోలేకపోయాడు. అతని అనుభవం అందుకు చాలలేదు.

'నాన్నకి భయం ఉందా?' అనేది మరో ప్రశ్న.

ఇప్పటి వరకు నాన్నకి భయం ఉందనే దానికి దాఖలాలు కనిపించలేదు. ఈ ఊరు వచ్చాక చిన్న వ్యాపారం మొదలుపె ట్టాడు. అక్కడ కూడా కొంత మందితో తగాదా పడ్డాడు. అందులోనూ ఊర్లో అందరూ భయపడే ఓ మనిషి మీదే ఎదురు తిరిగాడు.

అతన్తో గొడవలు పెట్టుకోవద్దు. అంత మంచి మనిషి కాదు- అని అమ్మతో బయ

టివారు చెప్పటం రామచంద్రుడు విన్నాడు. అయినా శివయ్య అవేం లెక్క చేయలేదు. అలా అని శివయ్య తాగడు. సినిమాలకి వెళ్లడు. అయితే మంచి బట్టలు కుట్టించుకోడు.

దానికి డబ్బులు లేకపోవటం ఒకటే కారణం కాదు. తాము ఎంత తక్కువ సంపాదించినా, ఇంట్లోవారిని పట్టించుకోకుండా స్వంతానికే ఖర్చుపెట్టిన మనుషుల్ని రామచంద్రుడు చూశాడు.

అందుకే నాన్న మీద జాలి కలిగింది.

తమ్ముడికి నాన్న మీద ఉన్న కోపం పోగొట్టటానికి 'రామాయణం' కథని చెప్పాడు రెండు మూడు రోజుల పాటు. తీరిక ఉన్నప్పుడూ, లక్ష్మణుడు వినటానికి సిద్ధమయినప్పుడు.

'నాకు ఈ కథ నచ్చలేదు' అన్నాడు లక్ష్మణుడు, అరణ్యానికి రాముడు వెళ్లేంత వరకూ విని.

'తర్వాత కథ విను. బంగారు లేడి - శూర్పణఖ కథ బాగుంటుంది' అని చెప్పాడు.

'ఇంక చాలు. ఈ కథలో శూర్పణఖ ముక్కూచెవులూ కోయటం నాకు నచ్చింది. లక్ష్మణుడు మంచి పని చేశాడు. మిగతాది నేను సినిమాలో చూస్తాను. అయినా, నాన్న వెళ్లమంటే అడవులకి వెళ్లటం ఏమిటి? చెత్త' అని నిష్కర్షగా చెప్పాడు.

లక్ష్మణుడు సినిమాలూ చూస్తాడు!

అమ్మని డబ్బులు అడుగుతాడు. తను అర్ధరూపాయి ఇచ్చినా సిగ్గుపడకుండా నేలకి వెళ్తాడు. అలాగే వాడికి చాలా మంది స్నేహితులు ఉన్నారు. వాళ్లకి తమ్ముడంటే చాలా ఇష్టం. నాన్నలా వారితో తగాదా పడడు.

అయితే తన ఫ్రెండ్స్‌కి ఎవరన్నా శత్రువులు ఉంటే వారి మీద యుద్ధానికి వెళ్తాడు. ఒకరి తల పగలకొట్టాడు. వాళ్లు

## ఆ పని చేయకండి..

ఒకసారి మొక్కపాటివారు, మునిమాణిక్యంగారు బందరులోని ఓ హోటల్లో కూచుని కాఫీ తాగుతున్నారు. వాళ్ళకి పక్కనే కూర్చుని ఉన్న కొంతమంది విద్యార్థులు ఆధునిక రచనలపై ఇష్టం వచ్చినట్టు విసుర్లు విసురుతూ, మధ్య మధ్య బూతులు కూడా తిడుతున్నారు. ఆ మాటలు విన్న మునిమాణిక్యంగారు, శాస్త్రి




గారితో 'అడ్డమైన గాడిదల్ని హోటల్‌లోనికి రానీయవద్దని యజమానితో చెప్పాలండీ' అన్నారు. దానికి శాస్త్రిగారు 'ఆ పనిమాత్రం చేయకండి. వాడు అట్లా రానిస్తున్నాడు కాబట్టే, మనమూ రాగలిగాము!' అన్నారు.

ఇంటి మీదకు తగాదాకి వస్తే అమ్మ సర్ది చెప్పలేక నానా తంటాలు పడింది. తప్పయిందని చెప్పమన్నా తను చెప్పనన్నాడు. ఆ తర్వాత కొంతమంది చేతుల్లో దెబ్బలు తిన్నాడు.

'ఎందుకురా ఇలా చేస్తావు? నీకూ దెబ్బలు తగిలాయి కదా?' అంటే, 'నాతో దెబ్బలు తిన్నవారే నన్ను కొట్టారు. చెల్లుకు చెల్లు. ఇంకోసారి నా మీదకు వస్తే అప్పుడు చూపిస్తా నేనేంటో' అన్నాడు.

శివయ్య మధ్యలో వ్యాపారం మానేసి ఇంకేదో ఉద్యోగం చేస్తున్నాడు. ఇలాంటప్పుడే పార్వతి నాన్న చనిపోయాడని కబురు వచ్చింది. ఈసారి మోటార్ బైక్ మీద నాగేశ్వరరావు మావయ్య వచ్చి చెప్పాడు.

శివయ్య అప్పుడు ఇంట్లో లేడు.

'మీ ఇద్దరూ నాతో వచ్చేయండిరా. అమ్మ బస్‌లో వస్తుంది' అన్నాడు.

లక్ష్మణుడు 'నేను వస్తాను మావయ్యా' అని వెళ్లిపోయాడు.

ఇంటికి రాగానే శివయ్యకి ఈ విషయం తెలిసింది.

'నేనూ-రామచంద్రుడు వెళ్తాం' అంది.

శివయ్య మాట్లాడలేదు.

'చిన్నాడిని వద్దన్నా వినలేదు. వెళ్ళిపోయాడు' అన్నాడు మెల్లగా రామచంద్రుడు.

అప్పుడు శివయ్య వెళ్లి అయిదు వందల రూపాయలు తీసుకొచ్చి ఇచ్చి 'ఇది మీ నాన్న బాకీ. ఇంకో అయిదు వందల చిల్లర ఇవ్వాలి. మీ అమ్మ చనిపోయేలోగా ఇచ్చేస్తాను' అన్నాడు. పార్వతి ముఖంలో చెప్పలేనంత బాధ! తనను నాన్న ఇంటి దగ్గర ఉండిపొమ్మంటాడేమోనని రామచంద్రుడు ఆందోళన పడిపోయాడు. శివయ్య అభ్యంతరం చెప్పలేదు.

★ ★ ★

దహనకాండ అయిపోయింది.

రామచంద్రుడు దగ్గరుండి చూశాడు. అంతకుముందు నాయనమ్మని శ్మశానానికి తీసుకు వెళ్లినప్పుడు భయపడతాడని రామచంద్రుడ్ని తీసుకు వెళ్లలేదు.

మొదటిసారి రామచంద్రుడు శ్మశానాన్ని చూశాడు. అలాగే ఓ మనిషి అంతిమయాత్రని చూశాడు.

'తాత' శవానికి నాగేశ్వరరావు మావయ్య కొరివి పెట్టాడు.

మంటలు ఎగిసాక టప్పున ఏదో శబ్దం వినిపించింది.

'కపాలమోక్షం' జరిగింది అన్నారెవరో. అదేంటో రామచంద్రుడికి అర్థంకాలేదు. మనిషి బతుకులో తనకు తెలియని విషయాలు చాలా ఉన్నాయని, వాటి గురించి తెలుసుకోవాలని అనుకున్నాడు.

అందుకు పుస్తకాలు చదవటమే మార్గం అనుకున్నాడు. తాతగారింట్లో ఆధ్యాత్మిక పుస్తకాలు కనిపించాయి. వాటిని తెరిచి పైపైన చదివాడు. కొత్త జ్ఞానం ఆవరించినట్లు అనిపించింది.

అయితే వాటిని అడిగి తీసుకువెళ్లటానికి మాత్రం భయపడ్డాడు.

'ఈ పుస్తకాలు ఎక్కడివి?' అంటే.. నిజం చెప్పాలి.

అప్పుడు నాన్న కొడతాడు. ఆ తర్వాత చించేయటమో తగలబెట్టటమో చేస్తాడు. ఇదివరకు రాసుకున్న పాటలాగే.

'పావురం' అనుభవం తర్వాత నాన్నని ఏ విషయం అడగకూడదని, తన మనసులో ఉన్న విషయాలు చెప్పకూడదని నిర్ణయించుకున్నాడు.

ఈసారి పార్వతి మూడురోజులు అక్కడే ఉండిపోయింది.

అప్పుడు సీతతో ఆడుకున్నాడు. తన బుక్స్ చూపించింది. ముఖ్యంగా సీత అందమైన బొమ్మలు గీసింది.

మొదటి బొమ్మ పావురం!

ఎంత బాగా వేసిందో అనుకున్నాడు.

అంతకంటే సీతకీ- తనకీ ఒకే రకమైన ఇష్టాలు ఉన్నాయని అనుకున్నాడు. నారాయణకు ఒకమ్మాయే. నాగేశ్వరరావుకి ఇద్దరు మగపిల్లలు. ఆయన మంచి ఉద్యోగం చేస్తున్నాడు. పిల్లలు కూడా ఖరీదుగా ఉన్నారు.

ఇంగ్లీష్ మీడియంలో చదువుతున్నారు.

## కొత్తగాలి...



**ఆట**
**వరద**
**యుద్ధం .. ఏదైనా**
**కమీషన్లే**

– జి. విజయశ్రీ,
శ్రీకాకుళం

లక్ష్మణుడు వారితోనే తిరుగుతున్నాడు.

వాళ్లు లక్ష్మణుడి మాటలు ఆశ్చర్యంగా వింటున్నారు. ముగ్గురూ కలిసి కొన్ని ఆటలు ఆడారు. అందులో తమ్ముడే గెలి చాడు. సీత - రామచంద్రుడు ప్రేక్షకుల్లా మిగిలారు.

నారాయణ మావయ్య పిల్లలందరినీ 'సినిమా'కి పంపించాడు. సినిమా మధ్యలో నాగేశ్వరరావు మావయ్య పిల్లలు తినుబండారాలు కొన్నారు. చల్లటి పానీయాలు అందరికీ తీసుకున్నారు.

రామచంద్రుడి జీవితంలో మొదటిసారి ఓ కూల్ డ్రింక్ తాగాడు.

ఇంటికి వచ్చి అందరూ పడుకున్నారు.

రామచంద్రుడికి నిద్ర పట్టటం లేదు.

అతనికి 'నాన్న' గుర్తొచ్చాడు.

ఇప్పుడు ఒక్కడే ఇంట్లో ఉంటాడు. భోంచేశాడో లేదో తెలియదు. ఒక్కోసారి రెండురోజులు కూడా భోంచేయడు. అసలు ఎక్కడికీ రాకుండా ఉండటం మామూలు విషయం కాదు. నాన్నలో ఏదో గొప్పతనం ఉండబట్టే ఇలా చేయగలుగుతున్నాడా అనుకున్నాడు.

అప్పుడు అమ్మ మాటలు వినిపించాయి.

రామచంద్రుడు చెవులు రిక్కించాడు.

'పిల్లల్ని తలుచుకుంటేనే దిగులు కలుగుతోంది అన్నయ్యా. ఆయన ఎప్పుడు ఉద్యోగం చేస్తారో, ఎప్పుడు వ్యాపారం చేస్తారో తెలియదు. ఏ రోజూ వంద రూపాయలు అదనంగా చూసింది లేదు. ఏదో బతుకుతున్నామంటే బతుకుతున్నాం. నా మంచి బతుకంతా ఇక్కడే ముగిసిపోయింది. నేను రాజభోగాలు అనుభవించలేదు. అయినా మీ అందరి ప్రేమవుంది. నాన్న చెప్పేవాడు మూడు ముళ్లు పడ్డాక ఆడపిల్ల మన పిల్ల కాదని..'

నారాయణ నిట్టూర్చాడు.

'నా బతుకు ఏదోలా తెల్లారుతుంది. రేపు మా పిల్లలకి పెళ్లిళ్లు అవుతాయా అనిపిస్తుంది. పెళ్లికి బంధువులు ఎవరన్నా వస్తారా, ఆయనంటే ఎవర్నీ పిలవరు. అసలు పిలిచే అవకాశం నాకు వస్తుందా అనిపిస్తుంది.'

'పార్వతీ! ఇప్పటికయినా నువ్వు మారాలి. మేం ఏం చెయ్యాలన్నా నువ్వు మాకు సహకరించాలి. వాళ్లు మగపిల్లలు.. పెళ్లిళ్లు కాకపోవటం ఏమిటి? ఇప్పుడు చెబుతున్నాను సీతని రామచంద్రుడికి ఇవ్వటానికి మేం సిద్ధంగా ఉన్నాం.'

రామచంద్రుడు ఉలిక్కిపడ్డాడు.

తనేం వింటున్నాడో అర్థం కాలేదు. అప్పుడే తనకు పెళ్లా?

> **కొత్తగాలి...**
>
> **ఎడారికీ**
> **గుండెతడి ఉంది**
> **ఒయాసిస్సు**
> **అదేగా మరి**
>
> – గరిమెళ్ల నాగేశ్వరరావు
> కొమ్మాది, విశాఖపట్నం

'వద్దులే అన్నయ్యా నా బతుకు చూశాక కూడా సీతని ఆ ఇంటికి పంపించాలనుకుంటున్నావా? నాకు ఇష్టం లేదు. నా దురదృష్టం నా మేనకోడలికి వద్దు.'

'అలా అనకు పార్వతీ. రామచంద్రుడికి కూడా నాన్నలా కోపం ఉందా?' అంది పార్వతి వదిన.

'ఆయన ఆ పేరు ఎందుకు పెట్టాడో తెలియదు. పెద్దవాడు దేవుడు. రెండోవాడికి కోపం ఉంది. ఆయన కోపానికి, వాడి కోపానికి చాలా తేడా.'

'మరింకేమిటి? నువ్వు బావ గురించి ఆలోచిస్తున్నావా? అత్తయ్య పెళ్లి చేశాక

ఆయన బతుకు ఆయన బతికాడు. రేపు రామచంద్రుడూ అంతే.'

'కాదన్నయ్యా. రామచంద్రుడు ఎంతవరకు చదువుకుంటాడో తెలియదు. ఇప్పుడు తొమ్మిది చదువుతున్నాడు. పదో తరగతి చదవొచ్చు. చదవకపోవచ్చు. అప్పటి నుంచే ఇంటిభారం వాడి మీద పడవచ్చు.'

మళ్లీ రామచంద్రుడు ఉలిక్కిపడ్డాడు.

ఇంకో సంవత్సరమేనా నా చదువు- అనుకోగానే దుఃఖం వెల్లువలా వచ్చింది. బలవంతాన అణుచుకున్నాడు. కళ్లవెంట కారుతున్న నీటిని దుప్పటితో తుడుచుకున్నాడు. అప్పుడు నాగేశ్వరరావు మాట్లాడాడు, 'వాడి చదువు గురించి నువ్వు ఆలోచించొద్దు. టెన్త్ అయ్యాక నా దగ్గరికి పంపించు. నేను చూసుకుంటాను.'

నాగేశ్వరరావు అలా మాట్లాడటం అతని భార్యకి నచ్చలేదు.

'అన్నయ్యగారికి ఇవేం నచ్చవు అని తెలిసీ ఇంకో తగాదా ఎందుకు?' అంది.

'ఇప్పటివరకు నాన్న బాధపడతాడని మేం పట్టించుకోలేదు. శివయ్యకి చేతకాదు. అంతకుమించి పిల్లలూ, పెళ్ళాం ఏమైపోయినా పర్వాలేదని, తన మాటే ముఖ్యం అనుకుంటాడు చెల్లాయ్.. సీతని అన్నయ్య ఇస్తాడు. నేను చదువు చెప్పిస్తాను. ఇంక నువ్వు ఈ విషయంలో దిగులు పెట్టుకోవద్దు' అన్నాడు.

'ఎవరికి ఎవరిని రాసారో ఎలా చెబుతాం. వాళ్ల కర్మ ఎలా రాసి ఉంటే అలా జరుగుతుంది' అంది పార్వతి.

'సరే. రేపు మాట్లాడుకోవచ్చు. పొద్దుపోయింది. నిద్రపోండి' అంది పార్వతి.

ఆ రాత్రి. రామచంద్రుడికి నిద్ర పట్టలేదు.

★ ★ ★

లక్ష్మణుడు ఇంకా రెండు రోజులు ఉంటానన్నాడు. పార్వతి బలవంతాన బయలుదేరతీసింది.

వాళ్లు బస్‌స్టాండ్‌కి వస్తున్నారు.

అపుడు రామచంద్రుడు రోడ్డుపక్క పడిపోయిన ఓ మనిషిని చూశాడు. తాగి పడిపోయాడనుకుని ఆగాడు.

అప్పుడే కొంతమంది అతని చుట్టూ చేరుతున్నారు.

ఈగలు ముసురుతున్నాయి.

ఓ మనిషి వంగి చూసి అన్నాడు.

'జీవుడు ఎగిరిపోయాడు'

రామచంద్రుడికి అప్పటిదాకా, 'ఎప్పుడొస్తావు బావా మళ్ళా' అన్న సీత గుర్తొస్తోంది. సీత గీసిన పావురం గుర్తొస్తోంది.

ఆ మాట విన్నాక చనిపోయాక మాత్రమే మనిషిలో జీవుడు ఎగిరిపోతాడా అని ఆశ్చర్యం కలిగింది.

పావురం.. ఇతర పిట్టలు బతికి ఉండగా ఎగురుతాయి. అవి చనిపోయినప్పుడు మాత్రమే ఎగరలేవు.

మనుషులకూ- పక్షులకూ తేడా ఇదా!

సృష్టి ఎంత చిత్రమైనది అనుకున్నాడు.

'ఎవరి తాలూకో' అనుకుంటూ ఒక్కొక్కరూ కదిలిపోతున్నారు.

రామచంద్రుడికి అక్కడే ఆగిపోవాలనిపించింది. అతన్నలా రోడ్డు మీద వదిలేస్తే ఎలా అనుకున్నాడు. తల్లినదే అడిగాడు.

'అతనెవరో దురదృష్టవంతుడు. ఎవరో మున్సిపాలిటీ వారికి చెబుతారు. జేబులో ఆధారాలు ఏవన్నా ఉంటే వాళ్ళ మనుషులకి కబురు చేస్తారు. వాళ్లు వచ్చి తీసుకెళ్తారు.

'లేకపోతే..?' అన్నాడు రామచంద్రుడు.

'పత్రికల్లో ఫొటో వేసి రాస్తారు, గుర్తుపట్టి ఎవరన్నా వస్తారేమో చూస్తారు. లేకపోతే...'

'ఏం చేస్తారమ్మా' మధ్యలోనే అడిగాడు ఆరాటంగా.

'ఎవరో ఒకరు కర్మకాండలు చేస్తారు. మీ నాన్న రాకపోతే మీ నాయనమ్మ కర్మ కాండలు ఆగాయా?' అంది ముందుకు కదుల్తూ. రామచంద్రుడు వెనక్కి తిరిగి చూసుకుంటూ వెళ్తున్నాడు.




1970 మార్చ్.

స్కూల్లో పిల్లలందరూ హాల్ టిక్కెట్లు తీసుకున్నారు.

'రామచంద్రుడూ నీ డేటాఫ్ బర్త్ ఎంతరా?' అన్నాడు మురళీ.

'ఆగస్ట్ పద్నాలుగు నైన్‌టీన్ ఫిఫ్టీ ఫైవ్'

'స్వతంత్రం రేపు వస్తుందనగా ముందు రోజు పుట్టావా? బ్యాడ్‌లక్. ఇంకో రోజు తర్వాత పుట్టివుంటే భలే ఉండేది'

'ఏంటి భలేగా ఉండటం?'

'నీ పుట్టిన రోజుని ఇండియాలోనే కాదు, పాకిస్థాన్‌లో కూడా చేసుకునేవారు' అన్నాడు వాడు నవ్వుతూ.

'అలా అనకూడదు. నేను స్వతంత్రం వచ్చాక పుట్టాను. ఆగస్ట్ పదిహేనున నేను పండగ చేసుకుని ఉండేవాడ్ని, అలా పుట్టి ఉంటే'

'అలా వచ్చావా.. మనకి నిజంగా స్వతంత్రం వచ్చిందంటావా?' అన్నాడు మురళి.

'ఇప్పుడేగా రెండు దేశాల ప్రజలు ఆ రోజున సెలబ్రేట్ చేసుకుంటారని అన్నావు'

'సెలబ్రేట్ చేసుకోవటం- స్వాతంత్ర్యం రావటం ఒకటి కాదు. నిజానికి మనం ఇప్పుడు రకరకాల బానిసత్వాల్లో ఉన్నాం. మన ఫ్రెండ్స్‌ని చూస్తున్నావు కదా. వాళ్లకి ఎన్టీరామారావు, అక్కినేని నాగేశ్వరరావు తప్ప ఇంకో ప్రపంచం ఉందా? నువ్వు ఎప్పుడన్నా మహాకవి శ్రీశ్రీ మహాప్రస్థానం చదివావా?' అన్నాడు.

'చదవలేదు. ఏముందందులో?'

'మరో ప్రపంచం'

'నాకు అర్థం కాలేదు'

'చదివి చూడు. మనం ఎంత హీనంగా బతుకుతున్నామో అర్థం అవుతుంది. ఆయన ఏమన్నాడో తెలుసా? కొంత మంది యువకులు పుట్టుకతో వృద్ధులు అని'

రామచంద్రుడి ముఖం పాలిపోయింది.

'ఆగస్ట్ పదిహేనున మువ్వన్నెల జెండాని ఎగరేసి- శ్వేత కపోతాల్ని వినువీధుల్లో ఎగరేయటం కాదు. ఇన్ని సంవత్సరాల తర్వాత కూడా మురికివాడల్లో, పూటకింత గంజి కూడా తాగకుండా సగంమంది బతుకుతున్నారు. రేపటినుంచి మనం ఇంటర్‌మీడియట్‌కి వెళ్తాం. క్లాసు పుస్తకాలు చదివితే చాలదు. ముందు మనం మన సంకెళ్లు తెంచుకోవాలి. ఇంటర్‌లో మనం విద్యార్థి సంఘం పెడదాం. పరీక్షలు బాగా రాయి' అన్నాడు.

'నువ్వెప్పుడు పుట్టావు?'

'నవంబర్ ఏడు. ఆ రోజే రష్యాలో విప్లవం వచ్చింది' అని మురళీ వెళ్లిపోయాడు.

రామచంద్రుడలా నిలబడిపోయాడు.

అతనికి ఈ మాటలు కొత్తగా ఉన్నాయి. తను ఎప్పుడూ సినిమా నటుల చర్చల్లోకి వెళ్లలేదు. వారి సినిమాలు విడుదలైనరోజు మొదటి ఆటకు వెళ్లి పూలు చల్లలేదు.

నిజానికి చదువు మీద కూడా అంత దృష్టి పెట్టలేదు.

ఎప్పుడో ఓసారి శివయ్య రామచంద్రుడి మార్కులు చూశాడు.

ఎభైశాతం దాటాయి. అలా కొంచెంసేపు ఆలోచిస్తుండిపోయాడు.

బహుశా తిట్టని సందర్భం అదే.

తిట్టి ఉంటే బాగుండేది. ఇంకాస్త కష్టపడేవాడు. ఇప్పుడు మురళీ స్వాతంత్రమే రాలేదంటున్నాడు. సంకెళ్లు తెంచుకోవాలంటున్నాడు.

తనకేసి చూసుకున్నాడు.

అవును. పాదాలు- చేతులు- మొత్తంగా మనిషంతా బంధించబడి ఉన్నాడు. ఎవరు బంధించారు తననీ.. నాన్నా?

ఈ బంధనల నుంచి ఎప్పుడన్నా విముక్తి కలుగుతుందా?

తెంచుకోగలడా తను...?

ఎప్పటికప్పుడు నాన్న ముందు నిలబడ్డప్పుడు 'పావురం' తనలో ప్రవేశించేది.

ఇప్పుడు మనసు శాసిస్తోంది.

'ఎగురు రామచంద్రుడూ- ఎగిరితే చాలా బాగుంటుంది. పావురంలా ఎగురు. ఆకాశంలోకి ఎగురు'

అప్పుడు గుర్తుకొచ్చింది.

ఎగరటమంటే- మనిషి ఎగరటమంటే జీవుడు ఎగిరిపోవటం! ఒకటి విప్లవం- ఇంకొకటి ఆధ్యాత్మికం!

★ ★ ★

రామచంద్రుడు నిద్రవస్తున్నా, తూలిపోతున్నా మొదటి పాఠం నుండి చదువుతున్నాడు. ఇప్పుడు కొత్తగా అర్థమవుతున్నాయి. మధ్యలో పార్వతి టీ ఇస్తోంది.

కొత్త అలవాటు. తమ కోసం ఇప్పటివరకు అమ్మ టీ తాగి ఎరగదు. ఎప్పుడో మాటల్లో చెప్పింది, ఆమెకు టీ అంటే ఇష్టమనీ. సరిగ్గా తను పుట్టాక టీ తాగటం మానేసింది. ఇష్టమయిన పూలు పెట్టుకోవటం మానేసింది. ప్రతి రూపాయి పిల్లల కోసమే అనుకుంది.

ఇంకా నాన్నయినా వేరు. బయటకు వెళ్ళాక టీ తాగుతాడు.

ఇప్పుడు అమ్మ కోసం చదవాలి. ఇంకో అయిదారు సంవత్సరాలు అవసరమయితే మావయ్యల దగ్గర అప్పు చేసైనా చదవాలి. మంచి ఉద్యోగం చేసి అమ్మ కోరుకున్నవి, కోరుకోనివి కూడా అందించాలి.

అలానే చదివాడు. పరీక్ష రాస్తున్నప్పుడు కూడా కళ్ళు మండేవి. అయినా పట్టుదలగా రాశాడు.

పరీక్షలు అయిపోయాయి.

అప్పుడు సీతని చూడాలనిపించింది.

శివయ్య సెలవుల్లో ఓ షాపులో లెక్కలు రాయటానికి పంపించాడు.

లక్ష్మణుడు మాత్రం నాగేశ్వరరావు మావయ్య ఇంటికి వెళ్ళాడు.

శివయ్య 'వద్దు' అన్నాడు పార్వతితో.

'నేను సెలవులకి వెళ్తున్నా. అక్కడ ఉండటానికి కాదు' అని మరోమాట కోసం చూడలేదు లక్ష్మణుడు.

★ ★ ★

పరీక్షా ఫలితాలు తెలిశాయి.

రామచంద్రుడు డిస్టింక్షన్‌లో పాసయ్యాడు. పార్వతి ఆనందానికి అంతులేదు. శివయ్య మాత్రం తనకి చదివించే స్తోమత లేదని అనకుండా 'ఉద్యోగం' చూసుకోమన్నాడు.

అప్పుడు హతాశుడయ్యాడు.

'చదివిద్దాం. అప్పు చేసయినా చదివించుకుందాం. రాముడు చాలా బాగా చదువుతున్నాడు. రేపు మన బతుకులు మారతాయి. ఇంతవరకూ నేను మిమ్మల్ని ఏమీ అడగలేదు' అంది పార్వతి.

శివయ్యకి తన జీవితం గుర్తొచ్చింది.

ఒకప్పుడు ఇలానే అనుకున్నాడు. అప్పుడూ ఇలాంటి పరిస్థితే. అయితే వాళ్ల నాన్న కూతురు గురించి ఆలోచించాడు. ఇప్పుడు తను రామచంద్రుడికి వచ్చే జీతం

గురించి ఆలోచిస్తున్నాడు. అంటే... నాకంటే నువ్వేం ఎక్కువరా. నేను కన్నకూతురి కోసం ఆలోచించాను. నీలా నీ గురించి ఆలోచించలేదని నాన్న అడుగుతున్నట్లు అనిపించింది.

శివయ్యలో ఇంకో ఆలోచన వచ్చింది.

ఇంతకు ముందుకంటే రామచంద్రుడికి ఎక్కువ మార్కులు వచ్చాయి. అంటే వాడిలో కసి మొదలయింది. రేపు వాడు నా చెయ్యిదాటి పోతాడా అని అనుకున్నాడు. ఇప్పటికే రెండోవాడు వినటం లేదు. ఏం చేయాలి? నాన్నా- కొడుకా?

ఈ రెండు భావాల మధ్య నలిగిపోయాడు.

ముందు నాన్నని జయించాలి అనుకున్నాడు. లేని మనుషులతో పోటీపడటం ఎందుకని మనసు హెచ్చరిస్తుంటే-

'మనుషులు ఉండకపోవచ్చు. వారి మాటలు ఉంటాయి. తనని శాసించిన వారిలో చాలామంది ఇప్పుడు లేరు. అయినా వారెప్పుడూ తన ఎదురుగా ఉంటారు'

మామూలు మనుషులు ఈ విజయాన్ని మా అమ్మ-నాన్న చూసివుంటే అంటారు. తను అలా కాదు. శత్రువు చూసినా, చూడకపోయినా విజయం సాధించాలి.

'ఏం చదువుతావు, ఐ.టి.ఐ.నా?' అన్నాడు.

'ఇంటర్మీడియట్ చదవాలనుకున్నాను'

'తర్వాత ఇంజినీరింగ్ చేస్తావా?'

రామచంద్రుడు మాట్లాడలేదు.

'ఆర్ట్స్ తీసుకో. ఫీజు నువ్వే కట్టుకోవాలి. సాయంకాలం పూట ఎక్కడోచోట పనిలో పెడతాను' అని వెళ్లిపోయాడు. రామచంద్రుడు నిరాశపడిపోయాడు.

అయినా చేయగలిగింది లేదు.

తనకు వేసిన సంకెళ్ల తాళంచెవి నాన్న దగ్గర ఉంది!

★ ★ ★

రామచంద్రుడు కాలేజ్‌కి వెళ్తున్నాడు.

మురళీ ఆ కాలేజ్‌లో చేరలేదు.

హైదరాబాద్ వెళ్లిపోయాడు. వెళ్లే ముందు రామచంద్రుడితో మాట్లాడాడు.

'నా అవసరం అక్కడ ఉందన్నారు మా వాళ్లు. ఇక్కడవకాశాలు తక్కువ ఉన్నాయి. హైదరాబాద్‌లో అయితే ఎందరో మేధావులు కలుస్తారు. అద్భుతమైన లైబ్రరీలు ఉన్నాయి. ఈరోజు సమాజం అల్లకల్లోలంగా ఉంది. చాలామంది స్టూడెంట్స్ అన్యాయాలకు వ్యతిరేకంగా ఉద్యమాలలో వెళ్తున్నారు. నిజానికి నిన్ను కూడా అక్కడకు తీసుకెళ్లాలని ఉంది. నువ్వు డిగ్రీ చేయటానికి మాత్రం హైదరాబాద్ వస్తు

## రెండోభాగం

బారిస్టర్ పార్వతీశం మొదటి భాగం వచ్చాక ఎంతకాలమైనా తదుపరి భాగం రాక పోయేసరికి రాజమండ్రి సభలో 'రెండో భాగం ఎప్పుడు రాస్తారో చెప్పండి' అని సభికులు గట్టిగా పట్టుబట్టారు. దానికి మొక్కపాటివారు



జవాబుగా 'చిలకమర్తివారు ఇలాగే కర్పూర మంజరి మొదటి భాగం వ్రాసి తరువాత భాగం ఎందుకు వ్రాయలేదో తెలుసా? చివరకు ఆయన అది రాసిన కొద్దిరోజులకే మరణించారు. అలాగే నాకూ అవుతుందేమోనని భయపడుతున్నాను' అన్నారు హాస్యంగా.

తర్వాత మొక్కపాటివారు బారిస్టర్ పార్వతీశం మిగతా భాగాలు రాసిన స్వల్పకాలంలోనే మరణించడం, వారి మాటలు ఆయన పట్ల ప్రాక్టికల్ జోక్ కావడం విధివిలాసం!

న్నావు. ఈలోగా యిక్కడ విద్యార్థులని కదిలించాలి. నీ మీద నేను చాలా ఆశలు పెట్టుకున్నాను' అన్నాడు.

అప్పుడు రామచంద్రుడు మాట్లాడాడు.

'నీ ఇల్లు వేరు. మా ఇల్లు వేరు. అసలు నేను ఇంటర్ కూడా చదువుతాననుకో లేదు. మా ఇంటి ఆర్థిక పరిస్థితి చాలా దారుణంగా ఉంది. నేను సాయంకాలం కాలేజీ అయ్యాక ఎక్కడోచోట పనిచే యాలి. అందుకని నువ్వు చెప్పిన పనులు నేను చేయలేను. నామీద ఎలాంటి ఆశలు పెట్టుకోవద్దు' అన్నాడు.

మురళీ ఆలోచించి నిట్టూర్చాడు.

'చాలామంది నీలాంటివారే. సమాజా నికి ఏదో రకంగా సేవ చేయాలని ఉన్నా ఆర్థిక పరిస్థితుల వల్ల బయటకు రాలేరు. సరే గుర్తుంచుకో. మనం ఉన్న చోటులోనే మనకు చేతనయిన మేరకు ఏదోకటి చెయ్యాలి. మన యూత్‌లో కసి అనేది లేకుండా పోతోంది. సమాజానికి మార్గం చూపించాల్సిన మనం ఏ దారీతెన్నూ లేకుండా కొట్టుకుపోతున్నాం. నేను నీ కోసమే మన ఊరు వస్తాను. మా నాన్నకి బదిలీ అయింది. ఆయన బొంబాయి వెళ్తు న్నారు' అన్నాడు.

మురళీ వెళ్లాక 'కసి' అనే అంశం మీద రామచంద్రుడికి రకరకాల అనుమానాలు వచ్చాయి.

తమ తండ్రికి 'కసి' ఉంది. అది ఆయ నతోపాటు అందరినీ ఇబ్బంది పెడు తోంది. అలాంటి 'కసి' ప్రమాదకరం అను కుంటుంటే ఇప్పుడు మురళీ యువతరంలో 'కసే' లేదంటున్నాడు! ఏమిటీ విపరీతం అనుకున్నాడు.

ఆ తర్వాత ఆలోచించే తీరిక లేకుండా పోయింది. పార్వతి కోరికను దేవుడు మన్నించలేదు.

ఆమెకు ఆరోగ్యం దెబ్బతింది. ఆసుప త్రిలో రకరకాల పరీక్షలు చేశారు.

అది క్యాన్సర్ అని తేలింది.

మహా అయితే నెల రోజులు బతుకు తుంది అన్నారు.

శివయ్యకీ విషయం తెలిశాక గంభీరంగా ఉండిపోయాడు. అతని మనసులో ఉన్న ఆలోచనలను బయటికి చెప్పుకోలేదు.

విషయం తెలిసిన వెంటనే నారాయణ, నాగేశ్వరరావు, మామయ్యలు, అమ్మమ్మ వచ్చారు.

'మన ఇంటికి వెళ్లిపోదాం నీకు మంచి వైద్యం చేయించుకుంటాం' అన్నారు. పార్వతి ఒప్పుకోలేదు.

'నేను బతకనని నాకు తెలుసు. నామీద ఒక్క రూపాయి ఖర్చు పెట్టినా దండగే. అయినా నేను ఇంటినుంచి బయటకు వచ్చేముందు చుట్టపు చూపుగానే మన ఇంటికి రావాలనుకున్నాను. ఈ చివరి రోజుల్లో ఆయన్ని విడిచిపెట్టి నేను రాలేను' అంది.

ఏమీ చేయలేక వాళ్లు వెళ్లిపోయారు.

రామచంద్రుడు కాలేజీ మానేశాడు.

శివయ్య ఏం చేశాడో తెలియదు. అప్పు చేశాడు. ఆసుపత్రి ఖర్చుకి వాడుతున్నాడు.

ఓ రోజు రాత్రి పార్వతి శివయ్యని దగ్గ రకు రమ్మని పిలిచింది. శివయ్య పక్కన కూర్చున్నాడు.

'నేను అనుకున్నది జరగలేదు. నేను వెళ్లిపోతున్నాను. నా దిగులంతా మీ గురించే. మగపిల్లలు మనలానే ఎలానో బతుకుతారు. మీరు ఇప్పటికయినా కోపం తగ్గించుకోండి. అంతగా అయితే ఏదన్నా ఆశ్రమానికి వెళ్లండి. అక్కడ మనసు ప్రశాంతంగా ఉంటుంది. అసలు కష్టాలు మీ అందరికీ ఇప్పటినుంచే మొదలవుతు న్నాయి' అంది.

శివయ్య ముఖంలో రంగులు మారుతు న్నాయి.

అతను ఏమీ అనలేదు.

బహుశా ఇన్ని సంవత్సరాలు సేవ చేసినందుకు తనను ఏమీ అనకూడదనుకున్నాడేమో అనుకుంది.

రామచంద్రుడ్ని పక్కన కూర్చోపెట్టుకుంది.

'ఇప్పటిదాకా మీ అన్ని బాధ్యతలు నేను చూసుకున్నాను. ఇకనుండి నువ్వు చూసుకోవాలి. మీ పెళ్లిళ్లు చూడకుండానే చచ్చిపోతున్నాను. రేపు మీ భార్యలు వస్తారు. వాళ్లు మీ నాన్నని భరించలేరు. మనమీదలా ఆయన వాళ్లమీద కూడా దౌర్జన్యంగా ఉండాలనుకుంటాడు. వాళ్లకి నచ్చచెప్పండి. మీ నాన్నని ప్రశాంతంగా పంపించండి' అంది. రామచంద్రుడి కళ్ల వెంట బొటబొట నీళ్లు కారిపోయాయి. లక్ష్మణుడికి అదేమాట చెప్పింది.

'అమ్మా, నాన్న మంచిగా ఉంటే ఆయనకు మంచిది. లేకపోతే బయటకు వెళ్లిపోతాను. ఆయన బతుకు ఆయన బతకాల్సిందే' అని నిష్కర్షగా చెప్పాడు.

ఇరవైరోజులు తిరిగేలోపు పార్వతి చనిపోయింది.

మామయ్యలూ- అమ్మమ్మ- సీత- చిన్న మామయ్యల పిల్లలూ, అత్తలూ వచ్చారు.

నాన్న తరపున మేనత్తా- మామయ్య వాళ్ల అబ్బాయిలు వచ్చారు. శివయ్య ఎవరితోనూ మాట్లాడలేదు.

చుట్టుపక్కల చాలామంది పార్వతిని చూడటానికి వచ్చారు.

'మహాతల్లి' ఇలాంటి మంచి మనిషిని అరుదుగా చూస్తాం. కొద్దిరోజులు బాధపడ్డా పుణ్యస్త్రీగా వెళ్లిపోయింది అనుకున్నారు. శ్మశానానికి రావటానికి శివయ్య ఒప్పుకోలేదు.

రామచంద్రుడ్ని పిలిచి చెప్పాడు.

'నేను అక్కడకు రాను. నువ్వూ వాడూ వెళ్లండి. నాకయితే మీ అమ్మని దహనం చేయటం ఇష్టం లేదు' అన్నాడు.

'మరి మిగతావారు ఏమంటారో' అన్నాడు.

'ఏదోకటి చెయ్యండి' అన్నాడు.

మామయ్యలు ఎవరూ శివయ్య ప్రతిపాదనకి ఒప్పుకోలేదు.

లక్ష్మణుడు అమ్మకి కొరివి పెట్టాడు.

తమ జీవితంలో ఓ అధ్యాయం ముగిసిపోయింది అనుకున్నాడు రామచంద్రుడు.

★ ★ ★

**1973 జనవరి ఇరవై ఆరు.**

లక్ష్మణుడి పుట్టినరోజు.

రిపబ్లిక్ డే. ఈ రెండు సంవత్సరాల్లో రామచంద్రుడి చదువు ఆగిపోయింది. ఇంటి దగ్గర వంటపనులు చూసుకుని, ఉద్యోగం చేస్తున్నాడు. తమ్ముడిని చదివిస్తున్నాడు.

అమ్మ వైద్యానికి, తుది కర్మలకి అయిన బాకీలు అలానే ఉన్నాయి. శివయ్యకి బొటాబొటి ఆదాయం మాత్రం వస్తోంది.

ఈరోజు లక్ష్మణుడు చెప్పాడు.

'నేను మనింట్లో ఉండటం లేదు' అని.

'అదేంటి తమ్ముడూ, నిన్ను నేను ఎలా అయినా చదివించుకుంటాను' అన్నాడు రామచంద్రుడు.

'ముందుగా బాకీలు తీరిస్తే చాలు'

## కొత్తగాలి...

**మీకోసం నేనన్నది**
**నాటి నాయకత్వం**
**నాకోసం మీరన్నది**
**నేటి రాజకీయతత్వం**

– ప్రతాప వెంకట సుబ్బారాయుడు
సికింద్రాబాద్

అన్నాడు.

'మరేం చేస్తావు?'

'నన్ను మా ఫ్రెండ్ రమ్మన్నాడు. వాళ్లు బెంగుళూరు దగ్గర కాంట్రాక్టులు చేస్తున్నారు. నన్ను వారితో ఉండమన్నారు. నేను వెళ్లిపోతాను' అన్నాడు.

'నాన్నకి చెప్పవా' అని అడిగాడు రామచంద్రుడు.

'చెప్పను, కావాలంటే నువ్వు చెప్పుకో. నాన్న అమ్మకి చాలా అన్యాయం చేశాడు, మనకి చేశాడు. మనల్ని ఎవరి ఇంటికి వెళ్లనివ్వలేదు. మన చిన్న కోరికలు తీర్చలేదు. పైగా ఎప్పుడూ తిట్టాడు, కొట్టాడు. మాట్లాడితే ఇంట్లోనుంచి బయటకు వెళ్లమనేవాడు. అలాంటి మనిషికి బుద్ధి రావాలి. చివరికి అమ్మ చనిపోతే శ్మశానానికి రాలేదు. అందుకనే నాన్నకి చెప్పను. నాన్న అనే మాటకి శివయ్య తగినవాడు కాదు' అన్నాడు ఉద్రేకంగా.

అప్పుడు రామచంద్రుడు అనునయంగా 'ఎంతయినా మనకు జన్మనిచ్చిన తండ్రి...' అని చెప్పబోతుంటే, 'ఈయన నొప్పులు పడ్డాడా.. ఆ మాటకొస్తే శివయ్య తన నాన్న మాట విన్నాడా... అన్నయ్యా, నువ్వు కూడా ఆయన్ని వదిలించుకుంటే మంచిది. అతను పక్కనున్నంత కాలం నరకమే నీకు' అన్నాడు.

రామచంద్రుడు మాట్లాడలేకపోయాడు.

లక్ష్మణుడు అలా ఎగిరిపోయాడు.

పావురం ఎగిరినట్టు!

రామచంద్రుడికి సంతోషం కలిగిందో, బాధ కలిగిందో.. రెండు భావాలు ఏకకాలంలో కలిగాయో తెలియదుగాని శివయ్య మాత్రం బాధపడలేదు.

లక్ష్మణుడు ఎప్పుడయితే ఇంటి నుంచి బయటకు వెళ్లాడో ఆరోజే వాడు తన కొడుకు కాదు అనుకున్నాడు.

రామచంద్రుడు ఆరోజు షాపు నుంచి వస్తుంటే నారాయణ మావయ్య ఎదురయ్యాడు.

'నీ కోసమే వస్తున్నాను రామచంద్రుడు' అని హోటల్‌కి తీసుకెళ్లి మాట్లాడాడు.

'చెల్లి చనిపోవటంతో మీకూ మాకూ అనుబంధం తెగిపోయిందని మేం అనుకోవటం లేదు అల్లుడూ. పార్వతికి మేం చాలా అన్యాయం చేశామని ఈ మధ్యకాలంలో నాకు మరీ బాధగా అనిపిస్తోంది.

ఈ దేశంలో కుటుంబ వ్యవస్థ అలా ఉంది. పెళ్లి జరిగాక ఆడపిల్లల్లో మగపిల్లల్లోనూ మార్పులు వస్తాయి. భార్యాభర్తల మధ్య గొడవలు వస్తే అవి వాళ్లే పరిష్కరించుకుంటారని అనుకుంటాం. ఎప్పటికయినా వాళ్లు కలవాల్సిందేకదా అని పెద్ద వాళ్ల అభిప్రాయం.'

రామచంద్రుడికి తన నాన్న కూడా ఇలా ఎదురుగా కూర్చోబెట్టుకుని మాట్లాడితే ఎంత బాగుండును అనిపించింది.

'పెళ్లయిన కొత్తలోనే మీ నాన్న తాతతో తగాదా పడ్డాడు. అప్పటికి మా ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రమే. మీ నాన్న మారతాడు అనుకున్నాం. మేం కూడా పెళ్లికి ముందు పూర్తి వివరాలు కనుక్కోలేదు. తర్వాత మీరు పుట్టారు. ఇంక మేం నిస్సహాయంగా చూడటం మించి ఏమీ చెయ్యలేకపోయాం. నాకు తెలిసి ప్రతి మనిషికీ కోపం ఉంటుంది.. ఉండాలి కూడా. అయితే శాశ్వతంగా కోపం పెట్టుకునేవాడు మనిషి అనిపించుకోడు' అని రామచంద్రుడి ముఖంలోకి చూశాడు.

'మీ నాన్నని అంటున్నానని కోపంగా ఉందా?'

'లేదు మావయ్యా. మీరు చెప్పే మాటలు వింటున్నాను.'

'నేను మీ నాన్నని అనటం లేదు. ఉత్తములు- అధములు- నీచులు అని మూడు వర్గాల వారుంటారంటారు. నిజానికదో

మానసిక రోగం. అలాంటివారు ఒప్పుకోరు. అది గొప్పతనం అనుకుంటారు. వారికి మానసిక చికిత్స చేయాల్సి ఉంటుంది. అది వ్యాధని ఒప్పుకోని వారిని మనం ఏమీ చేయలేం' అని ఆగాడు.

ఇద్దరూ టీ తాగుతూ కొద్దిసేపు మాట్లాడుకోలేదు.

'నేను సీత గురించి మాట్లాడటానికి వచ్చాను' అనగానే రామచంద్రుడికి ఉలికిపాటు కలిగింది.

'వచ్చేముందు అడిగాను. బావ అంటే నీకు ఇష్టమా? ' అని.

'ఇష్టమేనంది. నీకు సీతనిచ్చి పెళ్లి చేయాలని ఉంది. మీకు పార్వతి పుడుతుందని నా నమ్మకం.'

## కొత్తగాలి...

**మొక్క నాటేది నేనే**
**చెట్టు పీకేది నేనే**
**శ్వాస తక్కువైతే**
**రేపు ఏడ్చేదీ నేనే**

– పాలగిరి ఊర్మిళ
మల్కాజ్‌గిరి, హైదరాబాద్

రామచంద్రుడికి చాలా సంతోషం కలిగింది. అయితే శివయ్య గుర్తొచ్చాడు.

'మావయ్యా నువ్వు యిలా అడిగినందుకు నాకు ఆనందంగా ఉంది. సీత అంటే నాకూ అభిమానం ఉంది. అందుకే సీత బతుకు నరకం కావటం నాకు ఇష్టం లేదు. మా నాన్న కోడల్ని ప్రశాంతంగా ఉండనీయడు. నువ్వన్నట్టు ఈ తరంలో బంధుత్వం కలవకపోవచ్చు. రాబోయే తరంలో అయినా కలుస్తుందని ఎదురు చూద్దాం' అన్నాడు.

నారాయణ కళ్లలో నీళ్లు తిరిగాయి. కొద్దిసేపు మాట్లాడలేకపోయాడు. 'అర్థం చేసుకున్నాను. నువ్వు ఉత్తముడివి' అని బిల్లు అందుకుని బయటకు నడిచాడు.

'వస్తాను అల్లుడూ' అని ఆగాడు.

'కోపం గురించే పెద్దలు చెప్పలేదు. సహనం, శాంతం లాంటి విషయాల గురించి కూడా చెప్పారు. మితిమీరిన సహనం, భయం, శాంతం వల్ల కూడా ఏ మనిషి సుఖంగా బతకలేడు. పార్వతి చేసిన తప్పు నువ్వు చేయవద్దు' అని వెళ్లిపోయాడు.

రామచంద్రుడు అలాగే నిలబడిపోయాడు. మురళి- మావయ్యలు బతుకు గురించి రెండు రకాలుగా చెప్పారు. నిర్ణయం తీసుకోవాల్సింది తను. సీతని కాదు అన్నందుకు హృదయంలో సన్నటి నొప్పి అనిపించింది.

★ ★ ★

శివయ్య రామచంద్రుడితో 'నీ పెళ్లి చేస్తున్నా' అన్నాడు మరుసటిరోజే.

'అప్పుడే నాకు పెళ్లి ఏమిటి నాన్నా? నాకు మంచి ఉద్యోగం లేదు. ఇకనుంచి ప్రైవేట్‌గా డిగ్రీ చేయాలనుకొంటున్నాను. కనీసం నా భార్యనీ, పిల్లల్నీ, మిమ్మల్ని పోషించే స్థితి రావాలి కదా' అన్నాడు.

అప్పుడు తెలిసింది అసలు రహస్యం. పార్వతి జబ్బు పడినప్పుడు ఒకాయన డబ్బు సర్దాడు. అతనికో అమ్మాయి ఉంది. ఆ అమ్మాయిని రామచంద్రుడికి యిచ్చే షరతుమీద డబ్బులు ఇచ్చాడు.

'ఇంట్లో ఆడదిక్కు లేదు. నువ్వు ఈ పెళ్లి చేసుకోవాలి, అప్పు తీర్చటానికి' అన్నాడు శివయ్య.

అలా అడగటంలో కూడా ఏమాత్రం లాలిత్యం లేదు. అప్పుడు రామచంద్రుడిలో మనిషి లేచాడు.

'ఎగురు, ఎగిరిపో రామచంద్రుడూ.. ఇదే తరుణం. అంతగా అయితే వడ్డీతో

సహా బాకీ తీర్చుకుంటానని చెప్పు'

అమ్మ గుర్తొచ్చింది.

'నాన్నని నీకు అప్ప చెబుతున్నాను' అంది తను. ఇప్పుడు దశరథుడి మాట వినటం లేదు.

అమ్మ మాట వింటున్నాడు.

బంధం - బందీ మాటలు దగ్గర పోలి కల్తో ఉంటాయి.

మాటల మధ్య అర్థాలు చాలా ఉంటాయి.

సీతని కాదనుకున్నప్పుడు ఎవరయినా ఒకటే!

వచ్చే అమ్మాయి పరిస్థితి ఏంటి? నాన్న గురించి తెలిసి కూడా ఈ ఇంటికి తన కూతురిని పంపిస్తున్నాడంటే వేరే మార్గం లేకా? ఆయనకి ఎలా అయినా ఆడపిల్లని వదిలించుకోవాలని ఉందా? పాపం దుర దృష్టవంతురాలు అనుకున్నాడు.

★ ★ ★

పెళ్ళి విషయం తెలిసింది. లక్ష్మణుడు వచ్చాడు.

'నువ్వు ఎందుకు ఈ పెళ్ళి చేసుకుంటు న్నావు? ' అని ఎదురు తిరిగాడు.

'మావయ్య వాళ్ల అమ్మాయిని యిస్తాన న్నాడు. ఆ సంబంధం కాకపోయినా నాన్న చెప్పిన పెళ్లి మాత్రం చేసుకోవద్దు' అన్నాడు లక్ష్మణుడు.

'మాట యిచ్చాం. గుళ్లో పెళ్లి జరగబో తోంది' అన్నాడు రామచంద్రుడు.

'నువ్వు బాగుపడవు. ఇంక నీ గురించి నేను ఆలోచించను' అన్నాడు లక్ష్మణుడు. అప్పటికే వాడిలో మార్పు వచ్చింది. విలా సంగా కనిపిస్తున్నాడు.

'తొందర్లో నేను కూడా చిన్న చిన్న వర్క్‌లు తీసుకుంటున్నాను' అని చెప్పాడు.

'నువ్వు నాన్నని వదిలిపెట్టి నా దగ్గరికి వస్తే నీకు మంచి భవిష్యత్తు ఉంటుంది. నీ తమ్ముడిగా నేను చేయగల సహాయం యిదే' అన్నాడు.

'నాన్నని వదిలిపెట్టి నేను రాలేను' అన్నాడు.

'నీ ఖర్మ' అన్నాడు.

పెళ్లికి సీత వచ్చింది. నాగేశ్వరరావు మావయ్యకు చెందిన వారెవరూ రాలేదు. అమ్మమ్మ- నారాయణ, మావయ్య వచ్చారు. నాన్న చెల్లి కూడా రాలేదు.

సీత దగ్గరుండి పెళ్లి చేయించింది. నవ్వుతూ సరదాగా గుడంతా తిరుగు తున్నా ఆ కళ్లలో తడి ఉండటాన్ని రామ చంద్రుడు గమనించాడు.




**1980 ఆగస్ట్ 14.**

రామచంద్రుడి పుట్టినరోజు. అప్పుడే ఇన్ని సంవత్సరాలు గడిచాయా అనుకు న్నాడు. ఇప్పుడు ఆ ఊరునుండి మారారు. ఓ అమ్మాయి పుట్టింది. శివయ్య మనవరా లిని చూసినప్పుడు ఏమీ మాట్లాడలేదు. 'అమ్మాయిలు పుట్టాలి' అని శపించినవారు గుర్తొచ్చారతడికి.

'ఆపరేషన్ చేయించుకుంటాను నాన్నా' అన్నాడు.

'ఇంకొకర్ని కను' అన్నాడు శివయ్య.

రామచంద్రుడు మాట్లాడలేకపోయాడు. అతని భార్య రాజేశ్వరి మాత్రం 'మన జీతం అంతంతమాత్రం. ఈ అమ్మాయిని పెంచి, పెద్దచేసి ఓ ఇంటిదాన్ని చేయగలి గితే చాలు. మావయ్యగారితో మీరు

మాట్లాడండి. కాస్త మెల్లగా చెబితే ఆయన వింటారు' అంది.

'వినరు. ఆయన ఓ మాట చెప్పాక దాన్నుంచి బయటకి రారు. అడిగి కోపం తెప్పించటం తప్ప ఉపయోగం లేదు' అన్నాడు. ఆమె మాట్లాడలేదు.

ఈమధ్య కాలంలో అనేక సంఘటనలు జరిగాయి. ముఖ్యంగా సీత పెళ్ళి అయింది. అప్పుడు రామచంద్రుడు తన మనసులో సంతోషం కలిగిందో, బాధ కలిగిందో విశ్లేషించుకునే కొద్దిపాటి ప్రయత్నం చేశాడు. నిజానికి నారాయణ మావయ్య మాత్రమే కాదు, సీత కూడా తన జీవితంలోకి రావటానికి ఒప్పుకుంది. అప్పుడు సీతమీద ప్రేమతో వద్దు అని చెప్పాడు.

తను అమ్మలా బాధలు పడటం ఇష్టం లేక వద్దన్నానని మావయ్యకు సంజాయిషీ యిచ్చుకున్నాడు. అయితే అది పూర్తి నిజమా? కాదు! ముందు తన తండ్రి ఆ పెళ్లికి ఒప్పుకోడు. అప్పుడు నాన్నని ఎదిరించాలి. అది తనవల్ల కాదు. నిజానికి సీతయినా, రాజేశ్వరి అయినా అడవారే. ప్రేమ ఉండటం అంటే ఒకరిని బాధ నుండి విముక్తిచేసి ఆ స్థానంలోకి ఇంకొకరిని తీసుకురావటం కాదు.

వాస్తవానికి సీతను వద్దనుకున్నప్పుడు ఏ ఆడపిల్లనో తన జీవితంలోకి ఆహ్వానించకూడదు. ఆ విషయంలోనూ తను ఏమీ చేయలేకపోయాడు. అసలు తన తండ్రి పెళ్లి చేసుకోవటం, ఇద్దరు పిల్లల్ని కనటమే ఆశ్చర్యంగా ఉంటుంది. అందుకు ఆయనకి ఏ కారణాలయినా ఉండవచ్చు. ఆ రకంగా సీతని కాదని, రాజేశ్వరిని ఔనని తను బాధపెట్టాడు. అసమర్థులు చేయగలిగింది అదే. తను బాధపడటం.. ఇతరుల్ని బాధ పెట్టటం అనుకున్నాడు.

అదే సమయంలో శివయ్య సమర్థుడా, అసమర్థుడా అనే మీమాంస వచ్చింది.

నాన్న సమర్థుడు కాకపోవచ్చు.. అసమర్థుడు మాత్రం కాదు. ఆయనకు బాధ అనే పదం ఉందని కూడా తెలియదు. అది ఆయనలాంటి అతి తక్కువ మందికే సాధ్యం అవుతుందని సరిపెట్టుకున్నాడు.

రాజేశ్వరిని ఓసారి అడిగాడు- తాము పావురాల్ని పెంచుకుందామని. ఆశ్చర్యంగా చూసింది. 'అలా చూడొద్దు. ఏదొకటి చెప్పు. నేనేం అనుకోను' అన్నాడు.

'ఎక్కడ పెంచుదాం? ఇది అద్దె ఇల్లు. ఇందులో మనం నలుగురం ఇరుకిరుకుగా బతుకుతున్నాం. ముందు మనకంటూ ఓ గూడు ఉంటే పావురాలకు గూడు కట్టించవచ్చు' అంది.

అప్పటిదాకా రామచంద్రుడికి స్వంత ఇల్లు కావాలనిపించలేదు. ప్రపంచంలో చాలామంది కలల్లో బతుకుతుంటారు. కారు, తోట, అందమైన బంగళా, ఇంట్లో కుక్కపిల్లలు, టేబులు, ఫ్రిజ్‌లు, ఏసీలు ఇవన్నీ ఉంటే బాగుంటాయనుకుంటారు.

కొంతమంది షాపుల ముందు నిలబడి చూస్తుంటారు. ఇంకొంతమంది షాపు లోపలకెళ్లి ధరలు తెలుసుకుంటారు. ఆ రకంగా తృప్తి కలుగుతుంటుంది.

ఇంకొందరు కలలు కంటుంటారు. కలలు ఖరీదు లేనివి. ఎవరయినా తాను ఆ దేశపు ప్రధానమంత్రినయితే అని ఓ కలల ప్రపంచం నిర్మించుకోవచ్చు.

రామచంద్రుడికి మాత్రం కలలన్నా భయమే. శివయ్య ఆ కలలలోకి చొరబడతాడని చిన్నప్పుడు అనిపించేదేమో! వయసు వచ్చాక జీవితం యిలాంటి కొన్ని పాఠాలు నేర్పింది.

కోరికలు మనసులోకి రానీయకూడదు. ప్రతి కోరికా మనిషిని అశాంతిలోకి నెట్టేస్తుంది. ఉన్నదాంట్లో సంతృప్తి చెందటాన్ని మించిన గొప్ప విషయం మరోటి ఉండదని రామచంద్రుడి నమ్మకం.

# భలే కరెన్సీ వ్యాపారం!



తమ బంధుమిత్రులకి అమెరికన్లు బహుమతిగా ఇవ్వడానికి అధికంగా వాడేది రెండు డాలర్ల నోట్లే. ఇవి అరుదుగా లభ్యమవుతుంటాయి. మొత్తం ఆరువందల డెబ్బై బిలియన్ డాలర్ల నోట్లు ప్రపంచంలో చలామణిలో ఉన్నాయి. వీటిలో ఒక శాతం నోట్లు మాత్రమే రెండు డాలర్లవి.



ఇటీవల అమెరికన్ ట్రెజరీశాఖ ఇరవై రెండు కేరట్ల బంగారంతో ఎంబోజ్ చేసి, రెండు డాలర్ల నోట్లని ఒక్కోటి పన్నెండు డాలర్ల ఖరీదుతో విడుదల చేసింది. ఇవి మామూలు పర్స్‌లో పెడితే పాడవుతాయి. అందువల్ల ఓ ప్రత్యేక ట్రాన్స్‌పరెంట్ పర్స్‌లో పెట్టి అమ్మారు. ఈ అమ్మకం కూడా కేవలం 48 గంటలు మాత్రమే జరిపారు. సేకరణదారులు వీటిని ఎగబడి కొన్నారు. జులై 9, 2009 ఉదయం ఏడున్నర గంటలనుంచి జులై 11, ఉదయం ఏడున్నర దాకా వీటి అమ్మకాలు రెండురోజులే సాగాయి. నాలుగు నోట్లు, నాలుగు పర్స్‌లను 48 డాలర్లకు ఓ ప్యాక్‌గా అమ్మారు. ప్రపంచం నలుమూలల నుంచి వీటి సేకరణదారులు ఆర్డర్ చేసి కొనుక్కోవడం విశేషం. ప్రెసిడెంట్ థామస్ జెఫర్సన్ బొమ్మ, 2 డాలర్స్ అన్న అక్షరాలు, నాలుగువైపులా ఉండే 2 అంకె, యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా అక్షరాలతోపాటు డిజైన్‌లో కొంత భాగం బంగారంతో ఎంబోజ్‌చేసి ఉంటుంది.

ఆధునిక ప్రపంచం ఇలాంటి వాటిని ఆమోదించదు. ఏ కలలు, కోరికలు లేనివాడిని సమకాలీనుడిగా గుర్తించదు. అయినా రామచంద్రుడికి ప్రపంచంతో తగాదా లేదు. శివయ్యకు పూర్తి భిన్నమైన వ్యక్తి రామచంద్రుడు.

అలా కాలం పరుగులు తీస్తున్నప్పుడు లక్ష్మణుడు వచ్చాడు. అది కూడా తన స్వంత కారులో. రామచంద్రుడి పని అయిపోయాక కారులో ఎక్కించుకుని ఊరి బయటికి తీసుకెళ్లాడు.

'కారు బాగుందా?' అన్నాడు లక్ష్మణుడు.

'చాలా బాగుంది తమ్ముడు' అన్నాడు రామచంద్రుడు.

'ఇది నేను కొనుక్కున్నానంటే కారణం నేను శివయ్యగారిని విడిచిపెట్టి దూరంగా వెళ్లటమే. ఇప్పుడు ఇల్లు కూడా కట్టటం మొదలుపెట్టాను. నాలుగయిదు నెలల్లో పూర్తి అవుతుంది' అన్నాడు.

'మంచిది తమ్ముడూ...'

'ఏది మంచి- ఎవరికి మంచి? అది మంచయితే నువ్వెందుకు ఇల్లు కట్టలేకపోయావు? కారు కొనలేకపోయావు?'

'వాటి గురించి నేను ఆలోచించలేదు'

'ఇప్పుడు ఆలోచిస్తావా?'

'లేదు లక్ష్మణా...'

'అంటే శివయ్యగారి గురించి తప్ప ఇంకెవరి గురించి ఆలోచించవా?' రామచంద్రుడు మాట్లాడలేదు.

'నీకు భార్య ఉంది. పిల్లలున్నారు. వాళ్ల గురించి ఆలోచించాలి కదా'

'ఏం ఆలోచించమంటావు లక్ష్మణా?'

'అది నేనెలా చెబుతాను. ముఖ్యంగా ఆడపిల్ల ఉంది. నువ్వు కాబట్టి శివయ్యగారు చెప్పిన పెళ్లి చేసుకున్నావు. రేపు నీలాంటి యోగ్యుడు ఆ అమ్మాయికి దొరకాలి కదా? అదలా ఉంచు. శివయ్య అనే

వ్యక్తి మన గురించి ఎప్పుడన్నా ఆలోచించాడా? మన కోరికలు తీర్చాడా? అదే పని నువ్వు ఎందుకు చేస్తున్నావు?'

'నీ ప్రశ్నలకి నేను సమాధానం చెప్పలేను తమ్ముడూ' అన్నాడు.

'చెప్పగలవు.. కానీ నీ భుజం మీద శివయ్య ఉన్నాడు. నాకు కనిపిస్తున్నాడు. ఇంతకూ నేను చెప్పవచ్చేదేంటంటే ఆ మనిషిని నీ భుజాల మీదినుంచి కిందికి పారేయ్'

'నేను ఆపని చేయలేను'

'నీ ఇష్టం మీ నాన్నలాగా నేను నిన్ను కంట్రోల్ చేయను' అని కారులో ఎక్కించుకుని ఊరి మధ్యలో దింపి వెళ్లాడు.

★ ★ ★

లక్ష్మణుడు వచ్చి వెళ్లిన విషయాన్ని రాజేశ్వరికిగాని, శివయ్యకిగాని రామచంద్రుడు చెప్పలేదు. భార్యకి చెప్పాలనిపించినా మాటల మధ్యలో మావయ్యతో అంటుందేమోనని భయం. శివయ్య కూడా ఎప్పుడూ చిన్న కొడుకు గురించి మాట్లాడేవాడు కాదు.

రామచంద్రుడికి లక్ష్మణుడు ఒక్కడే గృహప్రవేశం చేశాడని తెలిసింది- మిత్రుల ద్వారా.

కొద్ది క్షణాలు కళ్లు మూసుకున్నాడు.

అతనికి తమ్ముడి ఇల్లు, కారూ ఇవేమీ అసూయని కలిగించలేదు. నాకంటే చిన్నవాడు ఎంతో ఎత్తుకి ఎదిగిపోతున్నాడు అనే భావన ఎప్పుడూ కలగలేదు. అయితే తమ్ముడు ఎందుకింత కఠినంగా ఉంటున్నాడు అని మాత్రం అనిపించింది.

రక్తసంబంధాల్లో కొన్ని వంశపారంపర్య లక్షణాలు శారీరకంగానూ, మానసికంగానూ వస్తాయంటారు. తమ్ముడిలో కూడా నాన్నకి చెందిన కొన్ని లక్షణాలు అనువంశికంగా చేరాయేమో అనుకున్నాడు. తర్వాత కొంతకాలం నడిచింది.

'నిన్ను నా కొత్త ఇంటికి పిలవలేదు. నేను నీ ఇంటికి వస్తే ఆయన ఉంటాడు. ఆ ముఖం చూడటం ఇష్టం లేక నిన్ను పిలవటం మానేశాను' అన్నాడు.

'నువ్వు ఇల్లు కట్టుకోవటం ముఖ్యం. మమ్మల్ని పిలిచావా లేదా అనేది అంత ముఖ్యం కాదు' అన్నాడు రామచంద్రుడు.

'చిన్నప్పుడు నువ్వు పావురాన్ని పెంచుకుంటానంటే శివయ్యగారు కొట్టాడంట కదా. అప్పుడు నేను చిన్నపిల్లవాడ్ని. అమ్మ నోటినుంచి ఈ మాటను విన్నాను. ఎవరయినా ఇష్టం లేకపోతే వద్దంటారు. ఇప్పుడు నేను మా ఇంట్లో పావురాలకి గూడు కట్టించాను. పావురాలని పెంచుతున్నాను' అన్నాడు లక్ష్మణుడు.

రామచంద్రుడికి జీవితకాలంలో లభించిన ఆనందక్షణాలు కొన్నే. తమ్ముడిమీద ఎంత అభిమానం పొంగిపోయిందో. తను చేయాలనుకున్న పనిని తమ్ముడు చేశాడు. అంతకన్నా ఓ అన్నయ్యకి ఏం కావాలి?

అదేమాట లక్ష్మణుడితో అన్నాడు రామచంద్రుడు.

'నువ్వు పావురాల్ని ఎందుకు పెంచాలనుకున్నావో నాకు తెలియదుగాని నేను మాత్రం శివయ్యగారికి వ్యతిరేకంగా ఈ పని చేయాలనుకున్నాను.. చేశాను' అన్నాడు లక్ష్మణుడు.

'ఎందుకు చేసినా ఓ మంచి పని చేస్తున్నావు?'

'ఈ విషయం మీ నాన్నతో చెబుతావా?'

రామచంద్రుడు మాట్లాడలేదు.

'నా ఇంట్లో నేను ఒకే ఫొటో పెట్టుకున్నాను.. అది అమ్మది' అని లక్ష్మణుడు వెళ్లిపోయాడు.

★ ★ ★

రామచంద్రుడికి తమ్ముడి గురించి రకరకాల ఆలోచనలు వచ్చాయి. ఎంత కాదను





కున్నా ఈ ఇంటి పెద్దకొడుకుగా తనకు కొన్ని బాధ్యతలు ఉంటాయి.

లక్ష్మణుడి పెళ్లి గురించి నాన్న ఎటూ ఆలోచించడు. అమ్మలేదు. కాబట్టి మిగిలింది తను. ఇన్ని సాధించినవాడు తన పెళ్లి తానే చేసుకోగలడు. అయినా ఓ ప్రయత్నం చేయాలి. మేనమావలతో లక్ష్మణుడికి సంబంధాలు బాగానే ఉన్నాయి కాబట్టి ఈ ఆలోచన వారినుండి వస్తే బాగుంటుంది. తనుగా వెళ్లి వారితో మాట్లాడలేడు. సీతకి ఉత్తరం రాస్తేనో లేక ఫోన్‌చేసి మాట్లాడితేనో అనిపించింది.

అదింకా తేల్చుకునే లోగానే రామచంద్రుడు పనిచేసే చోటుకి లక్ష్మణుడు ఫోన్ చేశాడు.

'నేను ఓ అమ్మాయిని ప్రేమించాను. మేమిద్దరం తిరుమలలో పెళ్లి చేసుకోబోతున్నాం. ఈ పెళ్లికి నిన్ను రమ్మనటం లేదు. ఎందుకో నీకు తెలుసు. ఇంకో విషయం ఏమిటంటే నాకు కాబోయే భార్యది నా కులం కాదు' అన్నాడు.

'కులందేముంది.. మనసులు కలవటం ముఖ్యం' అన్నాడు రామచంద్రుడు.

'నువ్వు అంత తేలిగ్గా ఏ విషయాన్నీ తీసుకోకూడదు. కులందేవుంది అంటున్నావు? మీ అమ్మాయిని నువ్వు వేరే కులంలో వారికిచ్చి పెళ్లి చేస్తావా?'

'ఎప్పుడో జరగబోయే విషయాల గురించి ఇప్పుడెందుకు?'

'నీకు లేనిదదే.. ముందుచూపు. ఏమయినా మారాడా శివయ్యగారు?'

రామచంద్రుడు మాట్లాడలేకపోయాడు.

'అర్థమయిందిలే. నిన్ను పిలవకుండా ఇలాంటివి నీకు చెప్పటం బాగుండదు. కనీసం నీకు ఇన్‌ఫర్మేషన్ అయినా యివ్వటం నా బాధ్యత అనిపించింది' అని ఫోన్ పెట్టేశాడు.

రామచంద్రుడు ఇంటికి వచ్చాక శివయ్య దగ్గరకు వెళ్లాడు.

ఏంటన్నట్టు చూశాడు.

'తమ్ముడు పెళ్లి చేసుకుంటున్నాడు నాన్నా.'

'ఎవరి గురించి నువ్వు మాట్లాడేది?'

'మన లక్ష్మణుడి గురించి నాన్నా.'

'మన లక్ష్మణుడా' అని వంకరగా ముఖం పెట్టాడు.

'ఆ నీచుడి గురించి చెప్పొద్దు. పెళ్ళి చేసుకుంటాడో, దినం చేసుకుంటాడో నాకు అనవసరం' అని కూర్చున్న చోటునుంచి లేచి ఆగ్రహంతో అటూ ఇటూ తిరిగాడు.

మధ్యలో ఆగాడు. రామచంద్రుడికేసి తిరిగాడు.

చాలా రోజుల తర్వాత శివయ్య మూడో కన్ను తెరుచుకున్నట్లుగా ఉంది.

'చచ్చిపోయాడురా.. ఆడు చచ్చిపోయాడు. నాకున్నది ఒకడే కొడుకు.. ఒకడే' అని విసురుగా బయటకు వెళ్లాడు.

రామచంద్రుడికి శుభమా అని పెళ్లి చేసుకోబోతున్న తమ్ముడ్ని అనవసరంగా తిట్టించానా అనిపించింది. ఆ విషయం నాన్నకి చెప్పకుండా ఉండాల్సింది అనుకున్నా, పెళ్లి విషయం చెప్పి తీరాల్సిందేనని భావించాడు. నాన్న కోపమంటే.. అదంతే అనుకున్నాడు.

## కొత్తగాలి...

**వెన్నెల కురిపించే**
**చంద్రుడిపైనే ప్రతాపం**
**చండ్ర నిప్పులు చెరిగే**
**సూర్యుడి జోలికి పోలేం**

– కొప్పరపు నాగేశ్వరరావు
భీమనవారి పేట, విజయవాడ

★ ★ ★

రామచంద్రుడికి ఇన్ని సంవత్సరాల్లో కొన్ని జ్ఞాపకాలు ఉన్నాయి.

అవి పావురాలకి చెందినవి కావటం విశేషం.

తను పనిచేసే ఆఫీస్‌వారు హైదరాబాద్‌కి పనిమీద రామచంద్రుడ్ని పంపించారు. హైదరాబాద్‌లోనే ఆంజనేయులు అనే మిత్రుడు ఉన్నాడు. రామచంద్రుడి దగ్గర అతని ఫోన్ నెంబర్ ఉంది. అతనే సికింద్రాబాద్ స్టేషన్‌కి వచ్చి రామచంద్రుడ్ని రిసీవ్ చేసుకున్నాడు.

'హైదరాబాద్‌లో నువ్వు ఏమేం చూడాలనుకుంటున్నావో చెప్పు. నేను కారు అద్దెకు తీసుకుంటాను. రెండు రోజులు సెలవు పెడతాను. దగ్గరుండి అన్నీ చూపిస్తాను' అన్నాడు.

'ముందు నేను వచ్చిన పని పూర్తికావాలి' అన్నాడు రామచంద్రుడు.

'అది నాకు వదిలిపెట్టు. నేను చూసుకుంటాను' అన్నాడు ఆంజనేయులు.

'నాకు ప్రత్యేకంగా ఏమీ చూడాలని లేదు. ఇక్కడ పావురాలు ఉంటాయా?' అన్నాడు.

'పావురాలు ఎక్కడయినా ఉంటాయి. నువ్వు పనిచేసేచోట పావురాలు లేవా?'

'ఉన్నాయేమో నాకు కనిపించలేదు. నాకు ఉద్యోగం చేయటం, ఇతర పనులు చూసుకోవటానికే సమయం చాలటం లేదు. నేను రెండు మూడు పావురాలను చూడటం కాదు. గుంపులు గుంపులుగా ఉన్న పావురాల్ని చూడాలనుకుంటున్నాను. వీలవుతుందా?'

ఆంజనేయులు తలూపాడు.

వెంటవెంటనే ఆంజనేయులు దగ్గర ఉండి రామచంద్రుడు వచ్చినపని పూర్తి చేయించాడు. ఆ తర్వాత ఆటో వెళ్లి ఓల్డ్ సిటీ ముందు ఆగింది. చార్‌మినార్‌కేసి రామచంద్రుడు చూస్తున్నాడు.

అంతకు ముందు పత్రికల్లో బొమ్మలు చూడటం వేరు. ఇప్పుడు ప్రత్యక్షంగా చూడటం వేరు.

'ఆ మధ్య నలుగురు చార్‌మినార్ మీద నుండి దూకి ఆత్మహత్య చేసుకున్నారు. అందుకే పైకి ఎవరినీ అనుమతించటం లేదు' అన్నాడు ఆంజనేయులు.

రామచంద్రుడు మౌనంగా తలూపాడు.

చనిపోవాలనుకున్నప్పుడు కూడా మనుషులు తాపత్రయపడతారన్నమాట. అనామకంగా చనిపోవటం కన్నా, చారిత్రక కట్టడాల దగ్గరో, మరోచోటో వారి ఆత్మహత్య కూడా సంచలనం సృష్టించాలి. అది వాళ్ళు చూడలేరు. అయినా చనిపోయినా బతికి ఉండాలనే ఆరాటం చాలామందిలో ఉంటుందనుకుంటూ దానికేసి చూశాడు. రామచంద్రుడిలో చార్‌మినార్ మాత్రమే కాదు ఏ కట్టడమైనా పెద్దగా సంచలనమో, ఆశ్చర్యమో కలిగించదు.

అవి ప్రపంచపు వింతలు కావచ్చు. మరోటి కావచ్చు. వాటి నిర్మాణం వెనక రకరకాల కారణాలున్నాయి.

ప్రేమ - విధ్వంసం - యుద్ధాలు - విజయాలు వాటి తాలూకు గుర్తులు. వీటిని నిర్మించటం వెనక దర్పం ఉంది. అధికారం ఉంది. వాటికంటే ముందు జనం దగ్గర కొల్లగొట్టిన ధనం ఉంది.

ఏమయినా మనుషులు తమ మంచి పనుల్నీ చెడు పనుల్నీ కూడా ప్రపంచం మరిచిపోకూడదని, వాటికో నిర్మాణ రూపం ఇస్తున్నారు. వాటిని చూసినవారు రకరకాలుగా స్పందిస్తున్నారు.

రామచంద్రుడి భుజం మీద చెయ్యి పడడంతో ఉలిక్కిపడ్డాడు. 'వెళ్దామా' అన్నాడు ఆంజనేయులు. తనను మరో ప్రపంచంలోకి తీసుకువెళ్తున్నట్లు తెలియదు.

లోపలకు అడుగుపెడుతుంటే రెక్కల చప్పుడు కనిపించింది. అది ఎక్కడో విన్న

# GOLDEN 50 JUBILEE

Years

1961-2010

Godrej

SAMSUNG

Panasonic

SANSUI

Whirlpool

IFB

SONY

Capri



CTV's, LCD, LED
& PLASMA

ప్రతి కొనుగోలుపై
ఉచిత
బహుమతి



2 Star
3 Star
4 Star
5 Star
లలో

1.5 Ton 3 Star
Rs. 21,900/-* లు మాత్రమే
* Free Installation,
Silverline series



NEW

Single
Double
& Three
Doors

**Home Appliances & TV లపైనే ప్రత్యేక డిస్కౌంట్**

* Conditions Apply * Limited Period Offer

Authorised Distributors



(Estd. 1961)

# INDIAN AGENCIES

(Air Conditioned)

Electronics & Home Appliances

Bo: S.V.N. Road, Warangal. Ph: 2425979, H.O: 2501484

ట్టుందే అనుకున్నాడు.

అప్పుడు చూశాడు.

ఎవరో నూకలు చల్లుతున్నారు. గుంపుగా పావురాలు ఎగిరివచ్చి వాలి వాటిని తింటున్నాయి.

అంతలోనే అవన్నీ ఒక్కసారిగా గాల్లోకి లేచాయి.

అపూర్వమైన దృశ్యం.

నెమలి పురివిప్పి నాట్యం చేస్తుంటే అంతకుమించిన సుందర దృశ్యం ఉండ దని కొంతమంది అంటారు.

అది వారి అభిప్రాయం మాత్రమే.

భూమి మీద నుండి విమానం గాల్లోకి

> **కొత్తగాలి...**
>
> **మునిగి పోయే**
> **ఆఖరు వయసులో**
> **పరిమళాల గుబాళింపు**
> **స్మృతులు కాబోలు!**
>
> – పాయసం సుబ్రహ్మణ్య మహర్షి
> నెల్లూరు

లేస్తున్నప్పుడు కలిగే ఆనందం లాంటిది ఇక్కడా ఉంది. పావురాలు రెక్కలు కొట్టు కుంటూ నింగికి ఎగరాలనుకోవటం మని షిని ఉత్తేజపరుస్తుంది.

నెమలిది సౌందర్యం.

పావురానిది చైతన్యం.

రామచంద్రుడిలో రకరకాల ఆలోచ నలు. హైదరాబాద్‌లో ట్యాంక్‌బండ్ మీద విగ్రహాలు చూశాడు. అప్పుడు అతనికి ప్రతి విగ్రహం కూడా.. ఓ పావురం దాని భుజం మీద వాలి ఎగరటానికి సిద్ధంగా ఉన్నట్టు అనిపించింది.

★ ★ ★

ఆంజనేయులు, రామచంద్రుడు ఆ రాత్రి భోంచేశాక డాబా మీద చాపలు పరిచి పడుకున్నారు.

చిన్ననాటి కబుర్లు చెప్పుకున్నారు.

'మీ పిల్లల్ని ఎక్కడ చదివిస్తున్నావు?' అన్నాడు ఆంజనేయులు.

'బడిలోనే'.

'అంటే తెలుగు మీడియంలోనా?'

'అవును. ప్రభుత్వ బడిలోనే.'

'ముందు ముందు తెలుగు చదివితే చాలా కష్టం రాముడు. వారికి ఇంగ్లీషు అవసరం. లేకపోతే వాళ్లకి భవిష్యత్తు ఉండదు.'

'ముందు వర్తమానం ఉండాలి. అబ్బాయి ఆలస్యంగా పుట్టాడు. నా భార్యకి ఆపరేషన్ చేయాల్సి వచ్చింది. అందుకు అప్పు చేశాను. ఇంకా వడ్డీలు కడుతు న్నాను. ఎప్పటికప్పుడు ఏదోక ఆర్థిక సమస్య మీదపడుతూనే ఉంది. ఈ మాత్రం చదువు చెప్పించటమే కష్టంగా ఉంది' అన్నాడు రామచంద్రుడు.

ఆంజనేయులు ఆశ్చర్యంగా చూశాడు.

'ఇప్పుడు సమాజంలో చాలా మార్పు వచ్చింది రాముడూ. అప్పట్లో మనందరం బిలో మిడిల్ క్లాస్‌లో ఉన్నాం. చాలా మంది ఆ స్థితి దాటుకుని పైకి వచ్చారు. మన ఊర్లో చాలామంది బతుకులు మారి పోయాయి. మీకు నాన్న తరపున ఆస్తి అంటూ ఏమీ లేదా?'

'ఏమీలేదు. నాన్న ఇప్పుడు పనేం చెయ్యటం లేదు. ఎప్పుడన్నా ఆయనకు పది రూపాయలు వచ్చినా ఆయనకే అది సరిపోతుంది. ఇంటి ఖర్చుకు ఇవ్వటం కూడా ఉండదు.'

'ఆయన నీతోనే ఉంటాడా.. మీ తమ్ముడి దగ్గర కూడా ఉంటాడా?'

'నాన్నకి - తమ్ముడికీ పడదు. అందుకే మా దగ్గరే ఉంటాడు.'

'మీ తమ్ముడు బాగా సంపాదించాడని

తెలిసింది. తను నీకు హెల్ప్ చెయ్యడా!'

రామచంద్రుడు చిన్నగా నవ్వాడంతే.

'అది కాదు రాముడూ మీ నాన్నకీ-తమ్ముడికేనా పడంది.. నీకూ వాడికి కూడానా?'

'నేను ఎవరితోనూ తగాదా పడను. మా నాన్నని నాదగ్గర ఉంచుకున్నానని తమ్ముడికి కోపం. తన దగ్గరకు రమ్మని పిలిచాడు. నేను రానన్నాను. అదీ వాడి కోపం.'

'మీ నాన్న మీ దగ్గర ఉండక ఎక్కడ ఉంటాడు?'

'అవన్నీ మనకి అనవసరం అంటాడు వాడు. అమ్మ చనిపోయింది. తను బతికి ఉంటే వేరు. నేను తమ్ముడి దగ్గరకు వెళ్లి ఆర్థికంగా ఇంటిని ఆదుకునేవాడ్ని. ఏమయినా నాకు ఏదీ కలిసి రాదు.'

'నీ భార్య కట్నం ఏమీ తీసుకురాలేదా!'

'అమ్మ హాస్పటల్లో ఉన్నప్పుడు మామగారు డబ్బులు సర్దారు. అందుకని ఆ అమ్మాయిని చేసుకొమ్మన్నాడు మా నాన్న. ఇప్పుడు రెక్కల కష్టం తప్ప ఏమీ లేదు.'

'అలా కాదు రాముడూ, ఆ మాటకొస్తే రూపాయి పెట్టుబడి లేకుండా మాటల్తో వ్యాపారాలు చేసి పైకి వచ్చిన వాళ్లు చాలా మంది ఉన్నారు. నువ్వు గిడసబారిపోయావు. ఇప్పటికయినా మించిపోయింది లేదు. ఏదోకటి చెయ్యి.'

'ఏం చేయమంటావు ఆంజనేయులూ?'

'అది నువ్వు నిర్ణయించుకో. వ్యాపారం చేస్తానంటే నేను నీకు పెట్టుబడి పెడతాను ఏం చేయాలో నిర్ణయించుకోవల్సింది నువ్వు. ఈ రోజుల్లో బతకలేకపోవటం అనేది లేదు. కాస్త తెలివితేటలు కావాలి. బజ్జీలు అమ్ముకుని లక్షలు సంపాదిస్తున్నారు. అంతగా అయితే నువ్వు హైదరాబాద్ వచ్చేయ్. ఇక్కడ ఏదోకటి చూద్దాం.'

'హైదరాబాదా!'

'ఇక్కడ చాలా అవకాశాలు ఉంటాయి. కొత్త పరిచయాలు అవుతాయి. నాలాంటి మిత్రులు కలుస్తారు.'

రామచంద్రుడు ఆలోచనలో పడ్డాడు.

'ఇప్పటికిప్పుడు నిన్ను వచ్చేయమనటం లేదు. ఆలోచించు. నీ భార్యతోనూ, మీ నాన్నతోనూ సంప్రదించు. ఒకటి గుర్తుంచుకో, ఆంజనేయులు అనే మిత్రుడు నీకున్నాడు. ఏ అవసరం వచ్చినా నిన్ను ఆదుకుంటాడు. ఇది నా స్నేహ ధర్మం. నన్ను ఉపయోగించుకో.'

'చాలా సంతోషం ఆంజనేయులూ' అన్నాడు రామచంద్రుడు కదిలిపోతూ.

★ ★ ★

ఇంటికి వెళ్లగానే శివయ్యతో 'నాన్నా మనం హైదరాబాద్ వెళ్దాం' అన్నాడు రామచంద్రుడు.

'ఎందుకక్కడికి, ముష్టెత్తటానికా?'

చివుక్కుమంది రామచంద్రుడికి.

'ముష్టెత్తటానికి అక్కడిదాకా ఎందుకు నాన్నా, ఆ పని ఇక్కడ చేయకూడదా?'

'తెలిసినవారు ఉంటారుగా. అభిమానం అడ్డొస్తుంది. అయినా ఈ ఊర్లో ఎంత మంది ఉంటారు. అక్కడయితే లక్షల్లో ఉంటారు' అన్నాడు ముఖం చిట్లించి శివయ్య.

'ఓ ఫ్రెండ్ సహాయం చేస్తానన్నాడు. చిన్న వ్యాపారం ఏదయినా చేసుకుంటే బాగుంటుంది అన్నాడు'

'నువ్వు వ్యాపారం చేస్తావా? ఎవడన్నా అప్పు పెడితే గట్టిగా అడగటం నీకు చేతనవుతుందా? అయినా నీ తమ్ముడ్ని చూసి అసూయపడుతున్నావా?'

రామచంద్రుడు నిర్ఘాంతపోయాడు.

'వాడ్ని నువ్వు ఆదర్శం చేసుకోవద్దు. ఆ నీచుడు అన్నిటికీ తెగించాడు. ఏ పనయినా చేయగలడు. నువ్వు అలా చేయలే

వు. నీ సంపాదన అక్కడ అద్దెలకి చాలదు. అప్పుడు నీకు ఇక్కడున్న బతుకూ ఉండదు. నీ పిల్లలు కూడా నేను చెప్పినట్లు ముష్టి ఎత్తుకోవాలి'

'నాన్నా మీరు నన్నేమన్నా అనండి. పిల్లల్ని అనొద్దు. నేను ఓ అమ్మాయి చాలనుకున్నాను. మీరు ఇంకొకరు కావాలన్నారు.'

'ఏంరా ఇందాకట్నుంచి చూస్తున్నాను, ఎదురు మాట్లాడుతున్నావు?'

'నేను అలాంటి పని ఎప్పుడూ చేయను. మా ఫ్రెండ్ మిమ్మల్ని సలహా అడగమంటే అడుగుతున్నాను. మీరు కాదంటే నేను ఇక్కడే ఉంటాను.'

'ఇక్కడే ఉండు. ఫ్రెండ్స్ చాలా కబుర్లు చెబుతారు. చిన్ననాటి స్నేహితుడు కలిస్తే ఉద్రేకం వస్తుంది. తీరా వెళ్లాక తెలుస్తుంది. ఇలాంటి వాళ్లంతా పెళ్లాలు ఏం చెబితే అది చేస్తారు. రేపు తగాదా వస్తుంది. అప్పుడు వెనక్కి వస్తే, ఇప్పుడు చేసే ఉద్యోగం కూడా నీకు ఉండదు.'

రామచంద్రుడు మాట్లాడకుండా నిలబడిపోయాడు.

అప్పుడు శివయ్యకి అనుమానం వచ్చింది.

'నేను కనమన్నాను కాబట్టి ఇంకొకడ్ని కన్నావా! అంటే నేను సంపాదించటంలేదని చెబుతున్నావన్నమాట.'

'అయ్యయ్యో! ఎందుకలా అనుకుంటున్నారు? నేను అనని మాటల్ని, నా మనసులోకి రాని ఆలోచనల్ని నామీద ఎందుకు రుద్దుతున్నారు?' అన్నాడు బాధగా రామచంద్రుడు.

'మాటలు అనాల్సిన అవసరంలేదు. ముఖం చూస్తే చాలు, మనుషుల మనస్సుల్లో ఏముందో తెలుస్తుంది. నేను హైదరాబాద్ ఎందుకు అన్నప్పుడే అర్థం చేసుకోవాలి. అప్పుడింత వాదన జరగదు. కావాలంటే నువ్వు వెళ్లు. నేను మాత్రం ఇక్కడ్నుంచి కదలను' అని కోపంగా వెళ్లిపోయాడు శివయ్య బయటికి.

అప్పుడు రాజేశ్వరి వచ్చింది.

'ఏంటండీ గొడవ?'

గొడవ కాదంటూ జరిగింది చెప్పాడు.

ఆమె ముఖం పాలిపోయింది.

'మామయ్యగారికి ఇష్టంలేని పని మనమెందుకు చేయటం? కలో, గంజో ఇక్కడే తాగుదాం' అంది మెల్లగా.

రాజేశ్వరికి పెళ్లికి ముందు వాళ్ల నాన్న ఏం చెప్పాడో తెలియదు. ఆమె ఇంతవరకూ శివయ్య మీద ఎలాంటి ఆరోపణలు చెయ్యలేదు. శివయ్య ఆమెమీద అప్పుడప్పుడూ చిటపటలాడుతుంటాడు.

ఆమె చేసిన వంట నచ్చలేదని కంచం ముందు నుండి లేచి వెళ్ళిన సందర్భాలు ఉన్నాయి.

పిల్లల్ని కసురుకున్నప్పుడు గుడ్లలో నీళ్ళు గుడ్లలో కుక్కుకుంది.

'తాత మంచివాడు కాదు' అని పిల్లలు అంటుంటే, 'తప్పు అలా మాట్లాడకూడదు. తాతగారికి కోపం వచ్చే పనులు మీరు చేయకూడదు' అని సర్దిచెప్పుకునేది.

'మీరు మమ్మల్ని బంధువుల దగ్గరికి ఎందుకు తీసుకువెళ్లరు? వాళ్లందరూ మంచి స్థితిలో ఉన్నారు. ముఖ్యంగా మీ

## కొత్తగాలి...

**ఆ పెద్దాయన**
**మనసులో ఏమీ దాచుకోడు**
**అందుకేనేమో**
**పర్సులో కూడా**
**ఏమీ దాచుకోలేకపోయాడు**

– భాస్కరభట్ల, హైదరాబాద్

తమ్ముడు. మీరు ఎందుకు సంపాదించకూడదు.. కనీసం నాలుగు మంచి చీరలు, పిల్లలకి బట్టలు ఎందుకు కుట్టించలేకపోతున్నారు? ' అని కూడా అడగలేదు.

ఇంట్లో అలాంటి ఒత్తిడి ఉంటే రామచంద్రుడు ఏం చేసేవాడో తెలియదు.

ఈ సంభాషణ జరిగిన తర్వాత శివయ్య రాజేశ్వరికి డబ్బులు ఇచ్చాడు.

'ఏంటి మావయ్యగారూ? ' అంది ఏమీ అర్థంకాక.

'మీ ఆయన నేను సంపాదించటంలేదని బాధ పడుతున్నాడు. నేను ఎవరికీ బాకీ పడను. మీరు నాకు పెడుతున్న భోజనానికి ఖర్చులు ఇస్తున్నాను' అన్నాడు.

'మీ అబ్బాయి అలాంటి మనిషి కాదు మావయ్యా' అంది బాధని దిగమింగుకుని.

'పోనీ నీకయితే అనిపించొచ్చు. ఏపనీ లేకుండా మావయ్య ఇంట్లో పడి తింటున్నాడని. ఇకనుంచి నెలనెలా నా ఖర్చులకి డబ్బులు ఇస్తాను'

'మేం మీకు పంచభక్ష్యపరమాన్నాలు పెట్టడంలేదు. నేను మీరు భారమని ఎప్పుడూ అనుకోలేదు. ఇకముందూ అనుకోను. మీ డబ్బులు పక్కన పెడతాను. మీరు మాలో ఒకరు. ఈ డబ్బులు వాడుకుంటే మీరు పరాయి మనిషి అవుతారు' అని కళ్లవెంట నీళ్ళు జలజలా రాలుతుంటే వంటింట్లోకి వెళ్ళిపోయింది.

శివయ్యకి జాలి అనిపించలేదు.

కన్నీళ్లకు చలించే తత్వం అతన్లో ఏనాడూ లేదు.

★ ★ ★

సాయంకాలం రామచంద్రుడు మబ్బుల కేసి చూస్తున్నాడు.

అవి మెల్లగా కదులుతున్నాయి.

అవి తెల్ల పావురాల్లా ఉన్నాయి.

ఆంజనేయులు ఇచ్చిన అవకాశాన్ని ఉపయోగించుకోలేకపోయాడు.

అప్పటికీ ఆంజనేయులు ఫోన్ చేశాడు.

'రాముడూ నీ నుంచి ఫోన్ వస్తుందనుకున్నాను'

'నాన్నతో మాట్లాడాను. ఆయనకి హైదరాబాద్ రావటం ఇష్టంలేదు'

'పోనీ అక్కడే ఏదన్నా చేస్తావా? '

'ఏమో!'

ఆంజనేయులు నిట్టూర్చాడు.

'నేను రాజకీయ నాయకుల్లా వాగ్దానం చెయ్యలేదు. నీకు ఏదో రకంగా సహాయం చేయాలని అనుకున్నాను, అనుకుంటున్నాను. అందుకే ఫోన్ చేశాను'

'నాకు తెలుసు ఆంజనేయులూ'

'నాకు ఒకటే అనిపిస్తోంది. నీ ఫెయిల్యూర్‌కి కారణం మీ నాన్న'

రామచంద్రుడు మౌనంగా ఉన్నాడు.

'సరే, ఈ రోజుతో మన బంధం తెగిపోయేది కాదు. ఎప్పుడయినా నేను నీకు ఉపయోగపడతాను. అది గుర్తుంచుకో. ఉంటాను' అని ఫోన్ పెట్టేశాడు.

ఆంజనేయులే కాదు ఇంకొంతమంది కూడా అన్నారు.

'అసలు దోషి శివయ్య. నీ రెక్కల్ని కత్తిరించాడు. నిన్ను ఎదగనీయకుండా - ఎగరనీయకుండా చేశాడు'

రామచంద్రుడు అది అంగీకరించాడు.

శివయ్యకి ఇద్దరు పిల్లలు. ఒకే రక్తం పంచుకు పుట్టిన వారిలో ఒకరు మంచి స్థితిలో ఉన్నారు.

అందుకూ శివయ్యే కారకుడు.

అలాంటప్పుడు ఆయన్ని అనుకోవటంలో అర్థంలేదు.

ఒకరిది విజయం.. మరొకరిది అపజయం.

అవి వ్యక్తిగతం. ఎవర్నీ నిందించి ఉపయోగంలేదు.

★ ★ ★

# Let their aspirations come alive




## B.Tech., Courses Offered
## CSE, ECE, EEE & IT

**Management Quota seats @ Counselling fee only**

- Excellent infrastructure.
- Highly Qualified & Experienced Faculty.
- On campus Women's Hostel.
- Well Equipped Labs.
- Just 6 Km distance from Tirupati.
- College bus facility



# SWETHA
## INSTITUTE OF TECHNOLOGY & SCIENCE FOR WOMEN

(Approved by AICTE, New Delhi & Affiliated to JNTU, Anantapur)
(Sponsored by Little Angels Educational Society, Tirupati)

C.Ramapuram, Tirupati-517561, Ramachandrapuram Mandal,
Chittoor Dist., A.P. Ph: 0877-2284970 / 72 / 73,
Cell: 92469 98949, 92469 43459, 92469 83949
Website: www.swethaengg.org, E-mail: principal_swetha@yahoo.com

2004 జనవరి.

రామచంద్రుడు హైదరాబాద్ వచ్చాడు.

దానికి ముందు పరిస్థితులు చాలా మారిపోయాయి. కొంతకాలం శివయ్య తన మాటలు నిలుపుకున్నాడు. ఎంతో కొంత డబ్బులు ఇంటి దగ్గర ఇచ్చాడు.

తర్వాత అతనికి కష్టమయింది. ఎందుకు మీరిస్తానన్న డబ్బులు ఇవ్వటం లేదు అని ఇంట్లో అడిగేవారు లేరు. చాలా కాలం వరకు రాజేశ్వరి, శివయ్యకి భోజనం వడ్డించేది. తర్వాత భోజనానికి రండి అంటే మాట్లాడేవాడు కాదు. ఆ తర్వాత తనే వడ్డించుకుని తినటం మొదలుపెట్టాడు. రెండు మూడుసార్లు చూసి రాజేశ్వరి అడగటం మానేసింది. ఈ మధ్యకాలంలో అమ్మాయి డిగ్రీ పూర్తి చేసింది.

అప్పుడే ఆంజనేయులు రామచంద్రుడ్ని వెతుక్కుంటూ వచ్చాడు.

'నేను ముంబయి వెళ్లిపోతున్నాను రాముడూ. ఇప్పటి వరకూ నన్ను నువ్వు ఏమీ అడగలేదు. చివరిసారి నీతో మాట్లాడదామని వచ్చాను' అన్నాడు.

'నాకో సహాయం చెయ్యి. అమ్మాయి బీఏ పూర్తి చేసింది. తనకి ఏదన్నా గవర్నమెంట్ జాబ్ చూసిపెట్టు'

'గవర్నమెంట్ జాబ్ అంటే కష్టం. ఇప్పుడు ఉద్యోగాలు ఇవ్వటం లేదు. ప్రైవేట్ జాబ్ చూస్తాను. అమ్మాయిని వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్‌లో ఉంచుతావా? '

'నువ్వేం చెయ్యమంటే అది చేస్తాను'

'నన్ను అడిగితే ఒకటే చెబుతాను. నువ్వు హైదరాబాద్ వచ్చేయటం మంచిది. ఇప్పుడిక్కడ నీకు ఎంత జీతం ఇస్తున్నారు? '

'మూడువేలు'

ఆంజనేయులు కొద్ది క్షణాలు మాట్లాడలేకపోయాడు ఆ తర్వాత.

'చాలా ఆశ్చర్యంగా ఉంది. గర్వంగా కూడా ఉంది. ఎంత సింపుల్ లైఫ్ లీడ్ చేస్తున్నావో అర్థం అయింది. నీకు కూడా అక్కడ ఉద్యోగం చూస్తాను'

'నేనేం చదివానని నాకు ఉద్యోగం ఇస్తారు. అందులోనూ ఏభై సంవత్సరాలు వస్తున్నాయి' అన్నాడు రామచంద్రుడు.

'దానికంటే ముందు నువ్వు నిర్ణయించుకోవాల్సింది ఒకటి. మీనాన్న హైదరాబాద్‌కి నిన్ను పంపిస్తాడో లేదో' మాట్లాడలేకపోయాడు

'నా అభిప్రాయం చెబుతున్నా అమ్మాయికి ఉద్యోగం వస్తుంది. మీరందరూ కలిసి ఉంటే నాలుగు డబ్బులు కనిపిస్తాయి. రెండు ఫ్యామిలీస్ అంటే ఇదే పరిస్థితి ఉంటుంది. ఇంక నువ్వు ఎంత వచ్చినా సర్దుకుపోతావు. నేను నీకు కనీసం ఆరువేలకి తగ్గకుండా జీతం వచ్చే ఏర్పాటు చేస్తాను. నువ్వు ఏ విషయం వెంటనే చెప్పాలి' అన్నాడు.

'అలాగే రేపు నేను నీకు ఫోన్ చేస్తాను' అన్నాడు రామచంద్రుడు.

ముందు ఈ విషయం రాజేశ్వరితో చెప్పాడు. వాళ్లిద్దరూ కలసి అమ్మాయితో మాట్లాడారు.

'అంకుల్ చెప్పింది బాగుంది నాన్నా. మనం హైదరాబాద్ వెళ్లటం మంచిది' అంది.

అబ్బాయి కూడా అదే మాట అన్నాడు.

'నాన్నా- ఇప్పటివరకూ మేం తాతయ్య గురించి ఏమీ మాట్లాడలేదు. మేం కూడా ప్రపంచాన్ని చూస్తున్నాం. అందరి తాతలూ ఎలా ఉంటారో మాకు తెలుసు. వాళ్లు డబ్బులు ఉన్నవారు కాదు. అయినా మనవళ్లని ప్రేమగా చూసుకుంటారు. తాతయ్య ఏ రోజూ మమ్మల్ని దగ్గరకు తీసుకోలేదు. ఆయన దగ్గర వేలూ, లక్షలూ లేకపోవచ్చు ఒక్క రూపాయి లేదా? కనీసం తమ్ముడికిగాని, నాకుగానీ

ఒక్క చాక్లెట్ కొనిపెట్టాడా? అదీ వది లేద్దాం. మాకు ఊహ తెలిసినప్పట్నుంచి నవ్వుతూ అయినా మాట్లాడాడా? '

రామచంద్రుడి ముఖం మ్లానం అయింది.

'ఇప్పుడు కూడా నేనూ, తమ్ముడూ తాత య్యని ఏమీ అనటం లేదు. మాలో ఉన్న బాధ గురించి మాత్రం చెప్పుకుంటున్నాం. ఇక్కడ ఉంటే మనకి భవిష్యత్తు ఉండదు. నేను ఉద్యోగం చేస్తూ కంప్యూటర్ కోర్స్ చేస్తాను. ఇంగ్లీష్ నేర్చుకుంటాను అలాగే తమ్ముడికి మనం చదువు చెప్పించవచ్చు. అందుకని తాతయ్య మనం ఇక్కడే ఉందా మంటే మీరు అలాగే అని తలవూపొద్దు. అలా అని తాతయ్యని వదిలేసి వెళ్లమని నేను అనటం లేదు. మనతోపాటు హైద రాబాద్ రావటానికి తాతయ్యని ఒప్పిం చండి' అంది.

ఎప్పుడూ మాట్లాడని తన కూతురు ఇన్ని మాటలు మాట్లాడటం చాలా ఆనం దాన్ని కలిగించింది రామచంద్రుడికి, రాజే శ్వరికి కూడా.

అసలు ఆ అమ్మాయిలో ఇన్ని ఆలోచ నలు ఉండటం వారికి తృప్తినిచ్చింది.

అయితే రామచంద్రుడి మనసులో నాన్న ఏమంటాడో, ఈసారయినా పడని స్తాడో లేదో అన్న భయం ఉంది.

ఆ రాత్రి రామచంద్రుడు- రాజేశ్వరి శివయ్య దగ్గర నిలబడ్డారు. అనుమానంగా వారికేసి చూశాడు. రామచంద్రుడు మెల్లగా మనసులో మాట బయటపె ట్టాడు. అప్పుడు రాజేశ్వరి అందుకుంది.

'మనవరాలి పెళ్లి చేయాలి. మనం కట్న కానుకలు ఇచ్చుకునే పరిస్థితిలో లేము. అమ్మాయి ఒక్కతే హైదరాబాద్‌లో ఉండాలి. అందుకని మనం కూడా అక్క డికి వెళ్దాం'.

'నిర్ణయం తీసుకున్నాక నాకు చెబుతు న్నారా? '

'ఇంకా లేదు మావయ్యా. మీరు ఒప్పుకు న్నాకే..' అంది రాజేశ్వరి.

'నేను కాదంటే...'

'కాదనటానికి ఏదోక కారణం ఉండాలి. ఒకప్పుడు మీరు వద్దంటే మానేశాం. ఇప్పుడు మనవరాలి పెళ్ళి చేయాలి. అలాగే మనవడు చదువుకోవాలి. దానికి మీ దగ్గర ఏదన్నా మార్గం ఉంటే చెప్పండి. రేపటి నుంచి మీకు ఆరోగ్య సమస్యలు రావచ్చు. ఇక్కడి జీతంతో మేం ఏం చెయ్యలేం' అంది.

శివయ్య మాట్లాడలేదు. కోపంగా ఏదో ఆలోచనలోకి జారిపోయాడు. మౌనం అర్థాంగీకారం అని వారు నిర్ణయించుకు న్నారు. అలా రామచంద్రుడు హైదరా బాద్ చేరుకున్నాడు.

★ ★ ★

ఆంజనేయులు తనకు తెలిసిన ఓ సంస్థలో రామచంద్రుడికి ఉద్యోగం ఇప్పిం చాడు. మొదటి సంవత్సరం ఆరువేలు జీతం. రెండో సంవత్సరం ఎనిమిది వేలు ఇస్తామన్నారు. రామచంద్రుడి కూతురికి అయిదువేల రూపాయల జీతం. మెల్లగా ఆ అమ్మాయికి ప్రమోషన్ ఇస్తారు. రెండు వేల రూపాయల్లో ఆంజనేయులు ఇల్లు అద్దెకు ఇప్పించాడు. ఆఫీస్‌కి కాస్త దూరం

**కొత్తగాలి...**

**మనసు మర్కటానికి**
**కళ్లెం వంటిది బుద్ధి**
**సంస్కరణ వంటిది ఆత్మ**

– శైలశ్రీ,
పెద్దచెల్మెడ, మెదక్ జిల్లా

అయినా బస్ సౌకర్యం ఉంది.

జీవితం గాడిలో పడినట్లు అనిపించింది రామచంద్రుడికి. హైదరాబాద్ రాగానే రాజేశ్వరి బిర్లామందిర్‌కి వెళ్ళింది. రామచంద్రుడు 'కబూతర్' కానాకి వెళ్లాడు. సంతృప్తిగా పావురాలను చూసుకున్నాడు. వాటికి నూకలు చల్లాడు. అవి ఎగరటం చూశాడు. ఇకనుంచి నా జీవితం మారిపోతోంది. రెండు సంవత్సరాల్లో అమ్మాయి పెళ్ళి చేసేయాలి. కొడుకు విషయం గురించి బాధలేదు అని అనుకున్నాడు.

'నేనున్నాను' అని ఆంజనేయులు అభయహస్తం ఇచ్చాడు. రామచంద్రుడు పని చేసే సంస్థ ఆఫీస్ ఆ వీధి చివరది. దానికి

> **కొత్తగాలి...**
>
> **వాడికి**
> **రెస్టయినా**
> **అరెస్టయినా**
> **కార్పొరేటే**
>
> – జి. విజయశ్రీ,
> శ్రీకాకుళం

ఆనుకుని మురుగుకాలువ ఉంది. దానీ మీద శ్లాబ్ లేదు. అడ్డంగా ఆరడుగుల పిట్టగోడ ఉంటుంది. ఆఫీస్ ముందు ఓ వంద అడుగుల స్థలం ఉంది. దానిని మట్టితో నింపేశారు. చుట్టూ చెట్లు ఉన్నాయి. ఎదురుగా పెద్ద అపార్ట్‌మెంట్ ఉంది. దానికి ఆనుకుని సిమెంట్ రోడ్డు, మధ్యలో గుబురుగా చెట్లు. మురుగు కాలువ మీద గాలి వీచినప్పుడు తెరలు తెరలుగా కంపు వస్తుంటుంది.

అప్పుడప్పుడూ సాయంకాలంపూట ఆఫీస్‌వారు అక్కడ కుర్చీలు వేసుకుని కూర్చుంటారు. ముఖ్యంగా రామచంద్రుడు మొదటి రోజు కుర్చీ వేసుకుని కూర్చున్నాడు. అప్పుడు రెక్కల చప్పుడు వినిపించింది. ఆశ్చర్యంగా చూశాడు. రెండు అడవి పావురాలు అపార్ట్‌మెంట్ నాలుగో అంతస్తు మీద వాలాయి. అక్కడ అవి గూడు పెట్టాయి. చుట్టుపక్కల ఆహారం కోసం వెళ్లి వస్తుంటాయి. ఆ కిటికీలకు అద్దాలు బిగించారు. కాబట్టి వాటి మనుగడకి ప్రమాదం లేదు. జతలు జతలుగా అవి వస్తుంటాయి. కువకువలాడుతుంటాయి. ఆ శబ్దాలు చాలా ఇష్టం రామచంద్రుడికి. తీరిక దొరికినప్పుడల్లా బయటకు వచ్చి చూస్తుంటాడు. ఆ జంటల్ని చూసినప్పుడు 'ప్రేమపావురాలు' సినిమా గుర్తొస్తుంటుంది. అప్పట్లో ఆ సినిమా గురించి అందరూ మాట్లాడుకునేవారు. యువతీ యువకులు, కుటుంబాలకు కుటుంబాలు ఆ సినిమా చూడటానికి ఉత్సాహంగా వెళ్లేవారు. ముందు హిందీలో వచ్చింది. తర్వాత తెలుగులోకి డబ్బింగ్ చేశారు. అప్పుడు రామచంద్రుడు ఆ సినిమా చూశాడు. అందులోనూ రాజేశ్వరితో చూశాడు. ఆ సినిమాలో పాటలంటే రామచంద్రుడికి చాలా ఇష్టం.

'మనం ఎప్పుడయినా టీ.వీ. కొనుక్కుంటాం కదా? అప్పుడు వీసీఆర్ కూడా కొనుక్కుందాం. 'ప్రేమపావురాలు' సినిమా క్యాసెట్ కొని దాచుకుందాం. ఎప్పుడు కావాలంటే అప్పుడు ఆ సినిమాని మనం చూసుకోవచ్చు' అని తన కూతురు తమ్ముడితో చెప్పటం రామచంద్రుడు విన్నాడు. అప్పుడతనికి చాలా సంతోషం కలిగింది. కొన్నా, కొనకపోయినా ఊహలు చాలా సంతృప్తినిస్తాయని వాళ్ళ ముఖాలు చూస్తుంటే అర్థమయింది. అప్పటిదాకా ఉన్న తన ఆలోచనలకి భిన్నంగా తమ పిల్లలు ఉన్నారని, మొత్తం మీద వాళ్లు ఏదో సాధిస్తారని అనుకున్నాడు.

ఓసారి ఆఫీస్‌లో ఎవరో అడిగారు, 'రామచంద్రగారూ మీరెప్పుడూ ఆ అపార్ట్‌మెంట్‌కేసి చూస్తూంటారు. అందులో ఫ్లాట్ తీసుకోవాలనుందా? ' అని.

'అంత పెద్ద కోరిక లేదు. నా జీవితంలో అలాంటి అవకాశం కూడా లేదు' అన్నాడు చిన్నగా నవ్వి.

'అవకాశం లేదు అనకండి. ఇక్కడ రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసేవారు ఒక్క రాత్రిలో లక్షాధికార్లు అవుతున్నారు. మీకు మంచి ఫ్రెండ్స్ ఉన్నారు. నాలుగు స్థలాలు అమ్మిపెడితే ఇంతకంటే మంచి అపార్ట్‌మెంట్ కొనొచ్చు.'

'నా గురించి మీరు చాలా ఎక్కువగా ఊహిస్తున్నారు. ముందు మా అమ్మాయి పెళ్లి చేసి పంపిస్తే చాలు. నేను చూసేది పావురాల్ని.'

'పావురాలంటే మీకంత ఇష్టమా!'.

తలూపాడు రామచంద్రుడు.

'నాకు చాలా చిరాకు. అవి ఎక్కడుంటే అక్కడే కంపు. ఆ రెట్టల్తో అవున్న చోటంతా నానా ఛెండాలం. నేను భరించలేను' అన్నాడు అదోలా ముఖం పెట్టి.

'ఇప్పుడు మనం ఉంది మురుగు కాలవ పక్కన. ఈ కంపుని భరిస్తున్నాం. పావురాల కంపును భరించలేమా!'

'ఇది తప్పనిసరి కంపు. కోరి ఎవరు తెచ్చుకుంటారు ఇలాంటి దరిద్రాన్ని.'

రామచంద్రుడు మాట్లాడలేకపోయాడు. అతని అభిప్రాయాలు అతనివి. అయినా సృష్టిలో అన్ని జంతువులకు, పక్షులకు జీవించే హక్కు ఉంది. మనిషి ఎప్పటికి గుర్తిస్తాడు ఆ విషయాన్ని అనుకున్నాడు.

★ ★ ★

శివయ్యకి మంచంమీద పడుకోవటం తప్ప ఇంకో పనిలేదు. ఇక్కడకు వచ్చే ముందు కోడలు అన్న మాటలు గుర్తొస్తున్నాయి. 'మీ ఆరోగ్యం బాగుండకపోతే మేం ఏమీ చెయ్యలేం.'

## సెప్టెంబరు-2010
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **వి.లీల**
   - విద్యారణ్యపురి, హన్మకొండ
2. **టి.విజయా దత్,**
   - చందానగర్, హైదరాబాద్
3. **గరికిపాటి ఇందిరా తుషారా**
   - కాకినాడ, తూ. గో. జిల్లా
4. **కె.భాగ్యలక్ష్మి**
   - వనస్థలిపురం, హైదరాబాద్
5. **ఆర్.నేహాకృష్ణ**
   - తార్నాక, సికింద్రాబాద్

## సరైన జవాబులు

1. రాధాబాయి
2. తమన్నా
3. మహాదేవి వర్మ
4. ఎస్సై నాగేంద్ర
5. అలంగుడి రామచంద్రన్
6. సౌరవ్
7. ప్రకాశరావు
8. పరిమళ
9. వారణాసి
10. రాజేష్

అప్పుడతనికి సూర్య అన్న మాటలు గుర్తొచ్చాయి.

'శివయ్యా నీకు బీపీ ఎక్కువ. అందుకని ఎవరిమీదో అరుస్తావు. అప్పుడు ప్రెషర్ పెరిగి గుండె ఆగి ఛస్తావ్. అంతకుమించి ఇంకో మార్గంలో నువ్వు పోయే అవకాశమే లేదు. మిగతా వాళ్లంటే ఏ మంచానోపడి తీసుకుని పోయే ఛాన్సుంది.'

అప్పుడు శివయ్య ముఖం చిట్లించాడు తప్ప ఏమీ అనలేదు.



'కాకపోతే ఇంకో ప్రమాదం ఉంది శివయ్యా'

ఏంటన్నట్లు చూశాడు.

భవిష్యత్తులో నువ్వు శాంతమూర్తివ యితే కష్టం. దాని ఫలితం అనుభవి స్తావు. అంటే తీసుకు తీసుకు ఛస్తావు. అందుకని నువ్వెప్పుడూ ముక్కోపి శివయ్య లానే ఉండు. ఏమాత్రం మారొద్దు.'

సూర్యతో అప్పటికి బాగున్నాడు కాబట్టి ఏమీ అనలేదు. పైగా నవ్వాడు.

శివయ్యకి ఊహ వచ్చాక నవ్విన సంద ర్భాలు చాలా తక్కువ.

ఇప్పుడు శివయ్యకి అనీజీగా అనిపిం చింది. తన శరీరంలో తనకు తెలియ కుండా ఏదో జరుగుతున్నట్లు అనిపిం చింది. ఒక్కసారిగా నీరసం ఆవహించి నట్లు ఉంది. మొదటిసారి అనుమానం వచ్చింది. పెద్దగా దగ్గాడు.

రాజేశ్వరికి అది వినిపించలేదు.

తను వస్తుందేమోనని చూశాడు.

రాకపోయేసరికి మరింత కోపం వచ్చింది.

అప్పుడు మళ్లీ శరీరంలో ఏదో కుదుపు. తల తిరుగుతున్నట్లు అనిపించింది. అతను కాస్త తొణికాడు. తనకు తెలియ కుండానే పెద్దగా మూలిగాడు. అప్పుడే రాజేశ్వరి అటు వస్తూ మావయ్య మూల గటం వింది.

గబగబా అతని దగ్గరకు వచ్చింది.

'ఏమయింది మావయ్యగారూ?' అంది.

శివయ్య కనుగుడ్లు భయంకరంగా అటూ ఇటూ తిరిగాయి.

రాజేశ్వరికి కాళ్లలో వణుకు మొదల యింది. 'ఇప్పుడే వస్తాను' అని బయటికి



పరిగెత్తింది. శివయ్య విషయం పబ్లిక్ టెలిఫోన్‌బూత్ నుండి రామచంద్రుడికి చెప్పి, వెంటనే రమ్మంది. తిరిగి ఇంటికి పరిగెత్తింది.

శివయ్య ముఖంనిండా చెమటలు.

గుండెపోటా అనుకుంది. టవల్‌తో ముఖం తుడిచింది.

ఆటోలో రామచంద్రుడు వచ్చాడు.

రాజేశ్వరికి శివయ్య ఇచ్చిన డబ్బులు గుర్తొచ్చాయి. ఎంత అవసరం వచ్చినా వాటిని కదలించలేదు. ఇప్పుడు అవే కావాల్సి వచ్చాయి.

ఆసుపత్రికి తీసుకెళ్లారు.

రకరకాల పరీక్షలు చేశారు. రెండు రోజులు అక్కడే ఉంచారు. తర్వాత చెప్పారు.

ఏమీ లేదు. నీరసంగా ఉంటుంది. మంచి ఆహారం ఇవ్వండి. మనిషిని ప్రశాంతంగా ఉండమనండి. పది రోజుల్లో తేరుకుంటాడు.

శివయ్యని ఇంటికి తీసుకు వచ్చారు.

'ఏం చెప్పారు?' అన్నాడు శివయ్య.

'ఏమీ లేదన్నారు. వయసు పెరగడం వల్ల వచ్చిన నీరసం అన్నారు. మంచి ఆహారం తీసుకుంటూ, ప్రశాంతంగా ఉంటే రెండు వారాల్లో కోలుకుంటారని చెప్పారు' అన్నాడు రామచంద్రయ్య.

శివయ్యకి అనుమానం వచ్చింది. అబద్ధం చెబుతున్నాడు అనుకున్నాడు.

రెండు రోజుల తర్వాత పరిస్థితి మారి పోయింది. ఇంకా నీరసం. అన్నీ మంచం లోనే. అందుకే రామచంద్రుడ్ని ఏదో ఒకటి అంటున్నాడు.

ఆఫీస్ నుండి వస్తూ ఏమన్నా తీసుకువె ళ్లేవాడు తింటానికి.

'ఇవన్నీ ఎందుకు తెచ్చి ఛస్తావు. బత్తాయి రసం కావాలి' అన్నాడు అరుస్తూ ఓరోజు.

'అలాగే నాన్నా' అన్నాడు ముఖం చిన్న బుచ్చుకుని.

ఆ సాయంకాలం బత్తాయిలు తీసుకు వచ్చి రసం తీసి తానే తీసుకువెళ్లి తాగించబోయాడు.

రెండు గుటకలు తాగి అసహ్యంగా ముఖం పెట్టి 'ఇంత పుల్లటి రసం తెస్తావా? నన్ను చంపేయాలనుకుంటు న్నావా?' అని శక్తంతా కూడదీసుకుని గ్లాసుని విసిరికొట్టాడు.

రామచంద్రుడి ముఖం మాడిపోయింది.

పెద్ద శబ్దంతో గ్లాసు బద్దలయి బత్తాయి రసం బట్టలమీద చిందింది.

బద్దలయింది గ్లాసు మాత్రమే కాదు!.

నాన్నని ఏదో అందామని నోరు తెరవ బోయాడు.

అప్పుడు లోపలి మనిషి అరిచాడు.

'తొందర పడొద్దు. నువ్వు పావురానివి. శాంతి కపోతానివి. ఇన్ని సంవత్సరాలు ఆయన చెప్పింది విన్నావు. సేవలు చేశావు. చివరి రోజుల్లో ఎదురు తిరగటంలో అర్థం లేదు.'

కోపాన్ని అణచుకుని వెనక్కి తిరిగాడు.

శివయ్య ముఖంలో ఆగ్రహం అంతకంతకూ పెరుగుతోంది.

★ ★ ★

రామచంద్రుడు లక్ష్మణుడికి ఈ విషయం చెప్పాలా వద్దా అని మధనపడ్డాడు.

తమ్ముడికి చెప్పటం నాన్నకి కూడా ఇష్టం ఉండదు.

పెళ్లి విషయం చెప్పినప్పుడు నాన్న గొడవ చేశాడు.

తమ్ముడు ఏ ముఖ్య సందర్భంలోనూ తమని పిలవలేదు. అయితే సమాచారం ఇస్తున్నాను అన్నాడు పెళ్లప్పుడు.

ఇప్పుడు తనూ అదే చేయాలి.

అలా అనుకున్నాక ఫోన్ చేశాడు.

లక్ష్మణుడు అంతా విన్నాక, అలాగా అన్నాడు.

లక్ష్మణుడు వస్తాడని తనకు నమ్మకం లేదు.

తన బాధ్యత పూర్తయిందనుకున్నాడు.

రెండు రోజుల తర్వాత ఇంటిముందు కారు ఆగిన శబ్దం.

రామచంద్రుడు బయటకు వచ్చాడు.

లక్ష్మణుడు దిగి సరాసరి ఇంట్లోకి వచ్చాడు. ఓ పాత కుర్చీ లాక్కుని శివయ్య ముందు కూర్చున్నాడు.

శివయ్య నమ్మలేనట్లు చూశాడు.

'బాగున్నారా శివయ్యగారూ!' అన్నాడు.

శివయ్యలో రక్తం మరగటం మొదలయింది. ముఖం పక్కకి తిప్పుకున్నాడు.

'నువ్వు ముఖం పక్కకి తిప్పుకుంటావని నాకు తెలుసు. ఎప్పుడూ నేను అనుకున్నది జరగాలనుకుంటావు. బతుకు కూడా నువ్వు చెప్పినట్లు వింటుంది అనుకున్నావు. ఇలా మంచంలో పడిపోతావనే ఆలోచన వస్తే ఇన్ని దరిద్రపు పనులు చేసేవాడివి కాదు.'

'తమ్ముడూ' వెనకనుండి వారించాడు రామచంద్రుడు.

'అన్నయ్యా! నేను ఈయన్తో మాట్లాడటానికి వచ్చాను. శివయ్యగారితో నేను తేల్చుకోవాల్సిన విషయాలు చాలా ఉన్నాయి. నువ్వు కల్పించుకోవద్దు.'

రామచంద్రుడు నిర్ఘాంతపోయాడు.

అప్పుడు శివయ్యకేసి తిరిగి 'నిన్ను ఇక్కడ్నుంచి పెద్ద హాస్పిటల్‌కి తీసుకువెళ్లి మంచి వైద్యం చేయిస్తా. దానికి ముందు నువ్వో పనిచెయ్యాలి' అన్నాడు లక్ష్మణుడు.

శివయ్య ముఖం కుంచించుకుపోతోంది.

'ఇప్పటిదాక చేసిన తప్పులన్నింటికీ క్షమాపణ చెప్పాలి.. మీ అమ్మా-నాన్నల నుండి మా అమ్మదాకా. మాకు తెలియని మనుషులు ఉండవచ్చు. వారందరికీ కూడా ఈ మంచం మీద నుండి- నేను చాలా అన్యాయంగా ప్రవర్తించాను- అని ఒక్క మాట అనాలి. అప్పుడు నువ్వు హాయిగా బతికినంత కాలం ఏ లోటూ రాకుండా నేను చూసుకుంటాను'

రామచంద్రుడు ఊపిరి బిగబట్టి చూస్తున్నాడు.

'ఎవరు నువ్వు?' అన్నాడు శివయ్య.

'జబ్బుతో మతి కూడా పోయిందా? నేను నీ చిన్న కొడుకుని. నీతో తన్నులు తిన్నవాడ్ని. ఇంటి నుంచి బయటికి పో అనిపించుకున్నవాడ్ని.. లక్ష్మణుడ్ని'

'నా చిన్న కొడుకు ఎప్పుడో చచ్చిపోయాడు' అన్నాడు శివయ్య.

లక్ష్మణుడు రామచంద్రుడి కేసి చూశాడు.







# శ్రీ సత్యా గ్రీన్ గార్డెన్స్

పులివెందుల రోడ్డు, కడప.

మీ స్వంత యింటికల నిజమా!

సులభవాయిదాలతో మీ కలలు నిజము చేయవచ్చా!

విలువైన స్థిరాస్తి నెల కంతులతో సంపాదించండి

కోట్లాది రూపాయలతో అభివృద్ధి చెందుచున్న కడప - పులివెందుల రోడ్డులో ఉన్నత విద్యాసంస్థల మధ్యన అత్యున్నత ప్రమాణాలతో K.S.R.M. ఇంజనీరింగ్ కాలేజి దగ్గరగా **శ్రీ సత్యాగ్రీన్ గార్డెన్స్** ఏర్పాటు చేయబడినది.



ఫాతిమా మెడికల్ కాలేజి



కె.యస్.ఆర్.ఎం. ఇంజనీరింగ్ కాలేజి



యోగి వేమన యూనివర్శిటి

1. మొదట 550 ప్లాట్లు - (2 సెంట్లు) నెల 1కి 3,000/- రూ॥ ప్రకారం 50 నెలలలో 1 లక్షా 50 వేలు రూ॥ చెల్లించి 2 సెంట్ల ప్లాటును పొందండి. లేదా 60,000/- రూ॥లు చెల్లించి మీరు కోరిన ప్లాటును వెంటనే రిజిష్టరు చేసుకొనండి. మిగతా పైకము 50 నెలలలో చెల్లించవచ్చును.

2) రెండవ 1000 ప్లాట్లు - (2 సెంట్లు ) నెల 1కి 650/- రూ॥ల ప్రకారం 65 నెలలలో 75000/- రూపాయలు చెల్లించి 2 సెంట్ల ప్లాటును పొందండి. లేదా రూ॥ 30,000/- చెల్లించి మీరు కోరిన ప్లాటును వెంటనే రిజిష్టరు చేసుకొనండి. మిగతా పైకం 65 నెలలలో చెల్లించవచ్చును. ప్రతి 5 నెలలకు 5,10, 15, 20, 25, 30, 35, 40, 45, 50, 55, 60 నెలలలో అదనంగా 2500/- రూపాయలు చెల్లించి స్పెషల్ డ్రాలో 20 గ్రాముల బంగారు గాజులు బహుమతిగా పొందండి. 65వ నెలలో అదనంగా 3000/- రూ॥ చెల్లించి బంపర్ డ్రాలో 1 లక్ష రూపాయల విలువైన బహుమతి పొందండి.

**ప్లాటు విస్తీర్ణం 2 సెంట్లు - 17.6 x 50 అడుగులు**
**ప్లాటు విలువ - 75000/- రూ॥ మాత్రమే.**
**ప్రతి నెల డ్రా కలదు.**

## శ్రీ సత్యాగ్రీన గార్డెన్స

రిజిష్టర్డు

నెహ్రూ పార్కు ఎదురుగా, కో- ఆపరేటివ్ కాలనీ, కడప
సెల్ : 9247074546, 9440958791, 9440246703,
9290262720, 9440883774.

'ఇలాంటి మనిషికి నువ్వు సేవలు చేస్తున్నావు. ఈ సారి నువ్వు శివయ్య అనే మనిషి ఏమైపోయినా నాకు ఫోన్ చేయవద్దు' అని లేచాడు.

'చింత చచ్చినా పులుపు పోలేదు శివయ్యగారూ' అని బయటకు వెళ్లిపోయాడు. కారు కదిలి వెళ్లిపోయిన చప్పుడు వినిపించింది.

లక్ష్మణుడు ఎవరినీ పలకరించలేదు. అందరూ దిగ్భ్రాంతితో చూస్తున్నారు.

'రామచంద్రుడూ' అని అప్పుడు పిలిచాడు శివయ్య. దగ్గరకు వెళ్లాడు.

'ఎందుకు పిలిచావు వాడిని?'

'కనీసం చెప్పటం నా బాధ్యత అనుకున్నాను నాన్న'

'వాడు చచ్చిపోయాడని ఎప్పుడో చెప్పాను. నేను మంచంలో పడ్డాను, ఏమీ చేయలేననేగా వాడితో అన్ని మాటలు అనిపించావు'

'తమ్ముడు నిన్ను చూసివెళ్తాడు అనుకున్నాను గాని ఇలా మాట్లాడుతాడనుకోలేదు. నిజం చెప్పాలంటే అసలు వస్తాడని అనుకోలేదు. నన్ను క్షమించు నాన్నా' అన్నాడు.

శివయ్య ముఖం పక్కకి తిప్పుకున్నాడు.

రామచంద్రుడు మౌనంగా వెనక్కి తిరిగాడు.

రాజేశ్వరి అతన్నే చూస్తోంది. పిల్లలు కూడా.

వారి ముఖాల్లో బాధే ఉందో, ఇంకేమన్నా భావాలున్నాయో అర్థం కాలేదు రామచంద్రుడికి.

★ ★ ★

ఆఫీస్ బయట గోలగా ఉంటే రామచంద్రుడు బయటకి వచ్చాడు. పిల్లలు క్రికెట్ ఆడుతున్నారు.

ఓ పక్కన రెండు కార్లు, బైక్‌లు ఉన్నాయి. అయినా వారు అవేవి పట్టించుకోవటం లేదు.

రామచంద్రుడికి కోపం వచ్చింది.

వాళ్ల దగ్గరికి విసురుగా వెళ్లాడు.

'రోడ్ల మీద క్రికెట్ ఏంటి? ఓ పక్కన కార్లు ఉన్నాయి. అద్దాలు పగిలితే ఎవరు కొనిస్తారు? మీరు ఆడాల్సింది గ్రౌండ్‌లో.'

'ఇక్కడ గ్రౌండ్ లేదు అంకుల్'

'గ్రౌండ్ లేకపోతే మీ ఇళ్ల దగ్గర ఆడుకోండి. మీ అద్దాలు బద్దలు కొట్టుకోండి. ఇది ఆఫీస్. ఎవరి తలన్నా పగిలితే మిమ్మల్ని పోలీసులకు అప్పచెబుతారు. పైగా అరుపులూ, కేకలూ.. వెళ్లండి' అని కసురుకున్నాడు.

పిల్లలు మాట్లాడకుండా వెళ్లిపోయారు.

ఆఫీస్‌లో నుండి కుర్చీ తెచ్చుకుని బయట కూర్చున్నాడు.

అతనికి మురుగుకంపు తెలియటం లేదు.

'రామచంద్రుడూ, పిల్లపెళ్లి ఎలా చేస్తావు? నాకు వైద్యానికి డబ్బులు ఎలా తెస్తున్నావు?' అని ఒక్కమాట అనలేదు తండ్రి.

ఇప్పుడూ ఇంత వయసు వచ్చాక, పెళ్లాం పిల్లల ముందు కూడా నన్ను బెదిరిస్తున్నాడు. ఇంతకంటే అన్యాయం ఏముంది? ఎందుకని నేను పుట్టుకతో వృద్ధుడ్ని అయ్యాను.

నా జీవితంలో ఎప్పడయినా నాకు విముక్తి అంటూ ఉంటుందా? నా మీద నాకు అసహ్యంగా ఉందే అని పరిపరివిధాలా అన్పించింది రామచంద్రుడికి.

'నేను మారాలి. మారతాను. ఇప్పట్నుంచే అది మొదలవుతుంది' అనుకున్నాడు దృఢంగా.

ఆ రోజు ఆఫీస్ నుండి ఇంటికి వెళ్లాడు.

నాన్నని చూడాలనిపించలేదు. స్నానం చేసి ఓ మూలనే కూర్చున్నాడు. అప్పుడు 'రామచంద్రుడూ' అని పిలిచాడు శివయ్య. రెండోసారి పిలిచాడు.

అప్పుడు దగ్గరకు వెళ్లాడు.

'కూర్చో' అన్నాడు శివయ్య.

'ఏమిటీ మనిషిలో ఇంత మార్పు' అనుకున్నాడు.

శివయ్య పైకప్పుకేసి చూశాడు. మెల్లగా మాటలు కూడదీసుకున్నాడు.

'నాకు భయంగా ఉంది రామచంద్రుడు' అన్నాడు.

అప్పుడు షాకయ్యాడు.

నాన్నకి భయమా! తనకి భయమే ఉంటే తమ కుటుంబం ఇలా ఉండేదా!

'ఎందుకు నాన్నా భయం?' అన్నాడు ఆశ్చర్యంతో.

'నేను ఎంతోకాలం బతకను.'

'దానికి భయం ఎందుకు నాన్నా? మనుషులందరూ ఏదోక రోజు చనిపోవాల్సిన వారే. అయినా చావు మనకు చెప్పి రాదు కదా!' అన్నాడు రామచంద్రుడు.

'విను' అన్నాడు శివయ్య కఠినంగా. రామచంద్రుడి ముఖం మ్లానం అయింది

'మనుషులు చనిపోయాక, కట్టెల్తో కాలుస్తారు. అది తలుచుకుంటేనే నాకు భయం. మీ అమ్మ చనిపోయినప్పుడు నేను శ్మశానానికి అందుకే రాలేదు.'

'అయితే..?'

'నన్ను మాత్రం దహనం చేయొద్దు. గొయ్యితీసి అందులో పాతిపెట్టు' అన్నాడు

'అలాగే. మీరు ఆ విషయాల గురించి ఆలోచించకండి' అని ఆయన దగ్గర నుండి లేచి వచ్చాడు.

ఈ రోజు రెండు ఆశ్చర్యాలు!

మొదటిది నాన్నకి కూడా భయం ఉందని తెలియటం.

ఇంతమందితో తగాదా పడటం వెనక భయం ఉందా! తన భయాన్ని కప్పిపుచ్చుకోవటానికి ఇన్ని సంవత్సరాలు నటించాడా? నరుడి బతుకు నటన అంటే ఇదేనా? అనుకున్నాడు.

రెండోది ఆయన కోరుకున్నట్టు చేస్తాడు. అప్పుడు మాత్రం జరిగేదేమిటి? గోతిలో పడుకోబెట్టి మట్టితో పూడ్చాలి.

అప్పుడు మాత్రం భయం కాదా!

అసలు చనిపోవటం అంటేనే మనిషి కట్టెగా మారటం.

కట్టెకు, మనిషికి తేడా ఏముంటుంద ప్పుడు?

నిజానికి రామచంద్రుడికి ఇటీవల కాలంలో 'నేను బతికివుండగా ఈ సమాజానికి ఏ చిన్న పనయినా చేయగలనా? నేను ఈ భూమ్మీదకి వచ్చినందుకు మనిషిగా కాస్త ఋణమయినా తీర్చుకోగలనా?' అనిపించింది.

## కొత్తగాలి...

చెట్లను
కొట్టేయండి
విగ్రహాలు
పెట్టేయండి

– బద్ది నాగేశ్వరరావు,
అనకాపల్లి

అప్పుడే నేత్రదానం మీద పత్రికల్లో చదివాడు. 'ఈ పనే నేను చేయగలను' అనుకుని వెంటనే వెళ్లి, కంటి ఆసుపత్రివారికి తన కళ్లు డొనేట్ చేస్తూ ఫారం పూర్తిచేసి సంతకం చేసి ఇచ్చాడు. అప్పుడే 'నాన్న కళ్లుదానం చేస్తే?' అనిపించింది.

ఇప్పటివరకు ఆయన ఎన్ని తప్పులు చేసినా, ఎంత అరాచకంగా ఉన్నా ఈ పనితో ఆయన కూడా ఎవరో ఒకరికి ఉపయోగపడతాడు అనిపించింది

ఇంతలోనే మళ్లీ ప్రతిబంధకం ఎదురయింది. నేను అనుకున్నది ఏదీ జరగదు అని తీవ్ర నిరాశలో పడిపోయాడు రామ

చంద్రుడు.

ఆఫీసులో ఉన్నాడు గానీ రామచంద్రుడి మనసు మనసులో లేదు. శివయ్యకి హైదరాబాద్ రావటం ఇష్టంలేదు. అయినా తప్పక వచ్చాడు.

ఇప్పుడాయన చనిపోతే 'నన్ను ఇక్కడ పూడ్చి పెట్టొద్దు. మన ఊరు తీసుకువెళ్లు' అంటే ఏం చేయాలి? ఏది మన ఊరు.. ఆ మాట ఆయన చెప్పగలడా?

ఇల్లు- భూమి లేనివారికి, బతకటం కోసం పొట్ట చేత్తో పట్టుకొని ఊరూరు తిరిగే కూలీజనాలకి ఏది తమ ఊరు? ఇంతకీ ఆయన ఎక్కడ పుట్టాడు?'

> **కొత్తగాలి...**
>
> **నిశ్శబ్దం ఒక బిందువు**
> **ఏడురంగులు**
> **ఇంద్రధనుస్సులో ఇమిడిపోయినట్లు**
> **శబ్దంలోని సప్తస్వరాలు**
> **నిశ్శబ్దంలో ఒదిగిపోతాయి**
>
> – ఏ.సూర్యప్రకాశ్, నిజామాబాద్

మనసంతా చిందరవందరగా ఉండటంతో బయటికి వచ్చాడు. అప్పుడు నలుగురు పిల్లలు చెట్టు దగ్గర గుండ్రంగా కూర్చుని ఉన్నారు. అందరి తలలు నేలను చూస్తున్నాయి. దూరం నుండి చూస్తుంటే వాళ్లు ఏదో కుట్ర చేస్తున్నట్టు అనిపిస్తుంది.

'ఏం చేస్తున్నారక్కడ?' అన్నాడు రామచంద్రుడు. ఉలిక్కిపడి అందరూ లేచి నిలబడ్డారు భయంగా. వాళ్లముందు ఓ చిన్న గుంత ఉంది. పుల్లల్తో తవ్వుతున్నారు. ఎందుకు తవ్వుతున్నారు? అంటూ అనుమానంగా అందర్నీ చూస్తున్నాడు. అప్పుడు రామచంద్రుడి ముఖం వివర్ణం అయింది.

ఒకబ్బాయి చేతిలో పావురం ఉంది. జీవంలేని పావురం. 'దీన్ని పూడ్చిపెట్టాలి' అన్నాడో అబ్బాయి. అప్పుడు వచ్చింది ఆగ్రహం.

'ఆఫీస్ ముందు పూడుస్తారా?' అన్నాడు శరీరం వణుకుతుండగా.

'అంకుల్ చెప్పారు. ఇక్కడ పూడ్చండని' భయంభయంగా అన్నాడు.

'ఏ అంకుల్ చెప్పాడు? ఆయన ఇంటి ముందు పూడ్చండి. మీ ఇంటి ముందో, ఇంటిలోనో పూడ్చండి. పావురాల్నే పూడుస్తారా.. మనుషుల్ని కూడా గొయ్యి తీసి పూడ్చేస్తారా?'

వారందరి ముఖాలు భయంతో, అవమానంతో పాలిపోయాయి.

'ఇలాంటి పిచ్చిపనులు చేస్తే పోలీసులకి రిపోర్ట్ ఇస్తాను' అన్నాడు.

'పదండ్రా' అన్నాడా అబ్బాయి. అందరూ భయం భయంగా వెళ్తున్నారు. అపార్ట్‌మెంట్‌ని ఆనుకొని ఓ వీధి ఉంది.

అది దాటుతూ ఆ అబ్బాయి రామచంద్రుడి కళ్లలోకి నిరసనగా చూస్తూ వెళ్లాడు.

ఆరాత్రి రామచంద్రుడికి నిద్రపట్ట లేదు. ఆ అబ్బాయి చూపే గుర్తు వస్తోంది. అందులో బాధ ఉందా? కోపం ఉందా? నిరసన ఉందా?

అయినా తనకెందుకంత కోపం వచ్చింది. ఈ మధ్యకాలంలో నాన్న 'అంశ' తనలో బయటపడుతోందా అనే అనుమానం వచ్చింది.

మర్యాదగా వాళ్లని అడగాల్సింది. ఏం జరిగింది? ఎందుకా పావురం చచ్చిపోయింది? ఇక్కడ ఎందుకు పూడ్చిపెట్టాలనుకున్నారు?

ఇలాంటివేమీ తను అడగలేదు.

ఇప్పుడనిపిస్తోంది. ఆ ప్రాంతాల్లో నేలంటూ కనిపించదు. సిమెంట్ రోడ్లూ, తారురోడ్లు తప్ప. ఆ చుట్టుపక్కల చెట్లూ,

మట్టీ ఉండేది కూడా తమ ఆఫీస్ ముందే.

అది ప్రభుత్వస్థలం కాబట్టి- అక్కడ జన సంచారం ఉండదు.

కాబట్టి ఎవరో సలహా యిచ్చివుంటారు.

ఇంతకీ ఆ పావురం ఎలా చనిపో యింది?

ఎవరో రాయితో కొట్టివుండొచ్చు అది పిల్లలకి కనిపించి ఉంటుంది. ఆ పావు రాన్ని రోడ్డు మీదకి విసిరేస్తే మున్సిపాలి టీవారు తీసేస్తారు. ఏ కుక్కలో పీక్కుతిం టాయి. లేదా మురుగుకాలువలోకి విసి రినా రెండురోజుల తర్వాత కుళ్లి కంపు కొట్టి- ఏ కాకులో పొడుచుకు తిన్నాక పంచభూతాల్లో మెల్లగా కలిసిపోయేది.

పిల్లలకి ఆ పావురాన్ని అలా వదిలే యటం ఇష్టం లేదు.

అప్పుడే పుట్టిన పిల్లల్ని చెత్తకుప్పలో పడేసి వెళ్తున్న మనుషులున్నారు. ఆ పిల్లలు ఓ మంచి పని చేయాలనుకు న్నారు. వారిని అభినందించాల్సిందిపోయి కోప్పడ్డాడు.

ఇప్పుడా పిల్లలు ఏం చేయాలో తెలియక పావురాన్ని రోడ్డుమీదో, మురుగు కాల్వ లోనో విసిరేస్తారు.

తన తొందరపాటు ఫలితం యిది.

రామచంద్రుడు రోడ్లమీదకు విసిరేసిన ఎలుకల్ని చూశాడు.

కుక్కల శవాల్ని చూశాడు.

ప్లేగ్‌వ్యాధి ఆ మధ్యన వణికించింది.

కొత్త కొత్త వ్యాధులు వస్తున్నది యిలాంటి వాటివల్లనే.

ఏమయినా రేపు ఆ పిల్లల్ని కలవాలి. క్షమించండి బాబూ అనాలి. అప్పుడుగాని మనసు శాంతించదు. అంతేకాదు, ఆ పావురాన్ని ఏం చేశారో తెలుసుకోవాలి!

ఇలా అనుకున్నాక మనస్సు కుదుటప డింది. తర్వాత 'ప్రేమ పావురాలు' సినిమా గుర్తొచ్చింది.

రాజేశ్వరితో కలసి చూసిన ఏకైక సినిమా అది!

అలా నిద్రలోకి జారిపోయాడు.

★ ★ ★

ఉదయం కాస్త ఆలస్యంగా లేచాడు. కాలకృత్యాలు తీర్చుకుని నాన్న దగ్గరకి వచ్చాడు.

'నేనింక ఎక్కువకాలం వుండను. అమ్మ దగ్గరకు వెళ్లిపోతాను' అన్నాడు.

ఏ అమ్మ దగ్గరకు వెళ్తానంటున్నాడో అర్థం కాలేదు. నాయనమ్మ దగ్గరకా? తమ అమ్మ దగ్గరికా? చిన్న వయసులోనే 'పార్వతమ్మా' అని అమ్మని ఎందుకు పిలి చేవాడో అర్థం అయ్యేది కాదు.

ఈ మనిషి కోపం తప్ప అన్నీ దాచుకు న్నాడన్నమాట. అంటే ఎంత విమర్శకి అర్హుడో- ఎంతో కొంత ప్రశంసకీ అర్హుడేన న్నమాట!

'నేను చనిపోయాక అన్నీ చూడొచ్చానా అనుకోవచ్చు రాముడూ. ఇప్పటిదాకా నా మాట విన్నావు. ఇక ముందూ వినాలి!'

'మీరు ఏ విషయం గురించి మాట్లాడు తున్నారు నాన్నా?' అని అడిగాడు రామ చంద్రుడు.

'నన్ను పూడ్చిపెట్టే విషయం. ఇది మన సంప్రదాయం కాదని ఎవరన్నా నువ్వు లెక్క చేయవద్దు. ఇది నా మరణ శాసనం. నీకు తెలుసో లేదో మరణం శరీ రానికే. ఆత్మకి కాదు. నేను చెప్పినట్లు చేయకపోతే నా ప్రేతాత్మ యిక్కడే తిరు గుతుంటుంది. నిన్ను వదలిపెట్టను'

రామచంద్రుడు నిర్ఘాంతపోయి చూస్తు న్నాడు.

'గుర్తుంచుకో. ఎలాంటి పరిస్థితిలోనూ నా శవాన్ని దహనం చేయకూడదు' అని ఆ తర్వాత మౌనంగా ఉండిపోయాడు.

రామచంద్రుడుకి కోపం వచ్చింది. బతికి ఉండగా శాసించాడు. చనిపోయినా కూడా

దెయ్యమై పీడిస్తాను అంటున్న తండ్రి ప్రపంచంలో ఎక్కడన్నా ఉన్నాడా?

ఆఫీస్‌కి వెళ్లినా మనసుపెట్టి పని చేయ లేకపోయాడు.

తలనొప్పిగా ఉందని వచ్చేశాడు.

శివయ్య నిద్రపోతున్నాడు.

ఆయన ముందుకు వెళ్లి నిలబడ్డాడు.

'ప్రజలంతా బతకటం కోసం భయపడి ఛస్తున్నారు. నీకు చనిపోయాక మంటల భయం' అని విరక్తిగా నవ్వుకున్నాడు.

చూస్తుండగా చీకటి పడింది. శివయ్యకి ఇప్పుడు ద్రవాహారమే యిస్తున్నారు.

రామచంద్రుడికి- నిజంగా దెయ్యాలు ఉంటాయా? అనే అనుమానం వచ్చింది. ఇప్పటివరకు దేవుడూ-దెయ్యాల గురించి అంత తీవ్రంగా ఆలోచించలేదు. అలాంటి పరిస్థితి రాలేదు.

నాన్నకి నమ్మకం ఉందా? బెదిరించటా నికి అన్నాడా? నమ్మకముంటే సాంప్రదా యాన్ని ఎందుకు కాదన్నాడు.

ఇలాంటి ఆలోచనలతోనే సమయం ఎంత గడిచిపోయిందో తెలియలేదు. నిద్ర వస్తున్నట్లు అనిపించింది. పడుకోబోయే ముందు ఇదివరకు నాన్న మంచం పక్కన మంచి నీళ్ళ చెంబు ఉందా లేదా అని చూడటం అలవాటు. ఇప్పుడు కూడా 'నాన్నా మంచినీళ్లు తాగుతావా?' అని అడిగి, అవసరమయితే తాగించాక పడు కుంటాడు.

రామచంద్రుడు నాన్న దగ్గరకు వెళ్లాడు. 'నాన్నా మంచినీళ్లు తాగుతారా?' అన్నాడు.

ఏమీ శబ్దం రాలేదు.

'మిమ్మల్నే నాన్నా' అన్నాడు.

అప్పుడు అనుమానం వచ్చింది. బెడ్ లైట్ వెలుగులోనే ఏదో అసహజంగా ఉందనిపించింది. వెళ్లి లైట్ స్విచ్ నొక్కాడు.

శివయ్య నోరు తెరుచుకుని ఉంది. కళ్లు శూన్యంలోకి చూస్తున్నాయి. అప్రయ త్నంగా నాన్న చేతిని అందుకున్నాడు. చల్లగా తగిలింది.

శరీరం కట్టెలా బిగుసుకుపోయింది.

'నాన్నలో జీవుడు ఎగిరిపోయాడు' అను కున్నాడు. అప్పుడు శివయ్య మాటలు గుర్తొచ్చాయి.

'నాన్న ఆత్మ ఈ గదిలోనే పరిభ్రమి స్తోంది? నన్ను పరీక్షిస్తోందా?' అనుకుని వణికిపోయాడు.

రాజేశ్వరి- పిల్లలు- రామచంద్రుడు శివయ్య మంచం దగ్గరికి చేరిపోయారు.

ఎవరికీ దుఃఖం రావటం లేదు.

ఈ మనిషి నిజంగానే వెళ్లిపోయాడా అనుకుంటున్నారు. నాన్న చివరి కోరిక గురించి చెప్పాడు.

'ముందు బంధువులకు కబురు తెల పాలి. ఆ సంగతి చూడండి' అంది రాజే శ్వరి.

'నాన్న ఎవరినీ పిలవొద్దని చెప్పాడు. ఆయనకు ఇష్టంలేని పనులు చేయటం ఎందుకు? ముందు మనం శవాన్ని మార్చ్యురీలో పెట్టాలి' అన్నాడు.

'ఉదయం తీసుకువెళ్తే సరిపోతుంది కదా? మళ్లీ అది అవసరమా?' అంది

## కొత్తగాలి...



**లాకర్లో**
**నగ- నట్రా**
**వృద్ధాశ్రమంలో**
**అమ్మా- నాన్న**
**సేఫ్**

*- అంకెం పద్మప్రియ, హైదరాబాద్*

రాజేశ్వరి.

'ఎక్కడ ఖననం చేయాలో చూసుకోవాలి గదా? కనుక్కోవడం ఈ రోజు కుదరకపోవచ్చు' అన్నాడు రామచంద్రుడు.

'మీ ఇష్టం' అంది రాజేశ్వరి.

అప్పటికప్పుడు బట్టలు మార్చుకుని బయలుదేరబోతూ ఆగాడు. జేబులు తడువుకున్నాడు. అతని ముఖంలో విషాదం పాకింది.

అప్పుడు రామచంద్రుడి కూతురు వెళ్లి డబ్బులు తీసుకొచ్చింది.

'ఇవి నీ డబ్బులు. నీ అవసరానికి కావాలి కదమ్మా' అన్నాడు సిగ్గుపడుతూ.

'నా డబ్బులు ఏమిటి నాన్నా? అవసరాల కోసమే కదా నేను ఉద్యోగం చేస్తున్నాను' అంది.

ఏ రోజూ మనవరాలిని ప్రేమగా దగ్గరకు తీసుకోని, ఆప్యాయంగా రెండు మాటలు మాట్లాడని తాతకోసం తను ఎప్పట్నుంచో దాచుకున్న డబ్బులు ఇస్తోంది.

రామచంద్రుడికి అప్పుడు దుఃఖం వచ్చింది.

అలా కూలబడిపోయి తనివితీరా ఏడ్చాడు. అందులో తన నిస్సహాయత మీద, తన భయాల మీద, తనలోని సర్వ లోపాలమీద వేదన ఉంది.

శివయ్య ముఖం ఇప్పుడు మరింత భయంకరంగా కనిపిస్తోంది.

★ ★ ★

రామచంద్రుడికి జీవితంలో మొదటిసారి మరణం తాలూకు విధ్వంసం ఎలా ఉంటుందో అర్థమయింది.

రెండు మూడు శ్మశానాలకి తిరిగాడు.

అక్కడ 'దహనం' చేయటానికి తప్ప శవాల్ని ఖననం చేయటానికి చోటు లేదు.

'విద్యుత్ దహన వాటికకు తీసుకువెళ్లు. ఇప్పుడందరూ అదే చేస్తున్నారు' అన్నాడు ఆఫీస్‌లో మిత్రుడు.

అప్పుడు తనకి నాన్న కోరిక గురించి చెప్పాడు.

'వాళ్లు ఏదో అంటారు. ఇప్పుడు ఖననం చెయ్యాలంటే మాటలు కాదు. గజం ధర ఎంత ఉంటుందో అంత కట్టాలి. అది కూడా మూడు సంవత్సరాల తర్వాత ఉండదు.

ఇంకొకరికి కేటాయిస్తారు' అన్నాడు తను.

అప్పుడు శ్మశానాల వేటకి వెళ్లాడు- చివరి ప్రయత్నం చేద్దామని. వెంట మిత్రుడు ఉన్నాడు.

'ఇక్కడ ఓ శ్మశానం ఉండాలి' అని రెండు చోట్లకి తీసుకువెళ్లాడు. అక్కడ అపార్ట్‌మెంట్స్ ఉన్నాయి. శవాల బూడిద మీద, గుండెల మీద నివసిస్తున్నారు. 'ఆర గుడుల నేల చాలు. మనిషికి ఎందుకింత తాపత్రయం' అనే వాళ్లని చూసాడు.

వామనుడు మూడు అడుగులు చాల న్నాడు.

ఈ మహానగరంలో ఆరడుగుల నేల కోసం ఆ చోటుని బట్టి వేలూ, లక్షలూ కావాలి.

దానికి మించి పరపతి కావాలి. డబ్బు లుంటేనే చాలదు. రామచంద్రుడు హతాశు డయ్యాడు.

అప్పుడు అతనికి దేశం గుర్తొచ్చింది.

తన జీవితంలో మొదటిసారి చూసిన పావురం గుర్తొచ్చింది.

మనకి 'స్వతంత్రం' వచ్చిందా అని ప్రశ్నించుకున్నాడు.

నాయకులు మరణిస్తే పదులూ- వందల ఎకరాల్లో స్మారక చిహ్నాలు నిర్మి స్తున్నారు.

వారు చేసిందేమిటి? తమ బతుకు తాము బతికారు. అవినీతితో వందల వేల కోట్లు సంపాదించి తరతరాలకు నిల్వ చేసి పోయారు.

ఏ కొందరో నిస్వార్థంగా పనిచేశారు.

ఏదేమయినా స్వేచ్ఛ దొరికింది కొంత మందికే.

చచ్చిపోయాక ఆరడుగుల నేల చూప లేని దేశంలో 'అభివృద్ధి' అనే పదానికి అర్థం లేదు అనుకున్నాడు.

మూడు గంటలప్పుడు ఇంటికి వెళ్లాడు.

రాజేశ్వరి చూస్తోంది ఆత్రుతగా. అంత వరకు ఎవరూ ఏమీ తినలేదు.

'ఏం చెయ్యబోతున్నారు? ' అంది.

'మీకు కనిపించి వెళ్దామని వచ్చాను. ఏ దో ఒకటి చేస్తాను' అని చెప్పి వచ్చాడు.

వరదలూ- ఉప్పెనలూ - భూకంపాలూ వచ్చినప్పుడు శవాల గుట్టలు కనిపిస్తు న్నాయి. యుద్ధాల్లో వేలూ లేదా లక్షలుగా చనిపోయిన మనుషులు గుర్తొస్తున్నారు.

అలాంటి వారందరినీ సామూహిక దహనం చేయటం, సామూహిక ఖననం చెయ్యటంలాంటి చరిత్ర చెప్పిన సంఘట నలు గుర్తొచ్చాయి.

ఇప్పుడతని సమస్య శివయ్య.

మనుషులు మిగతా ప్రాణుల్లాంటివారు కాదు. వారికి అనేక రకాల భ్రమలు, నమ్మకాలున్నాయి. మరణానంతర జీవితం గురించి, ఆత్మల గురించి పరలోకాల గురించి అనేక రకాల తత్వాలు రూపొం దించుకున్నారు.

మిగతా ప్రాణులకు ఆహారం, నిద్ర, మైధునాల సమస్య. చనిపోయాక లేదా చంపబడ్డాక ఏ కర్మకాండలూ లేవు. ఏదో రకంగా పంచభూతాల్లో కలిసిపోవటమే.

రకరకాల ఆలోచనలతో ఆఫీస్ దగ్గరికి వచ్చాడు.

అప్పుడు నిన్నటి దృశ్యం మదిలో మెదిలింది.

పిల్లల చేతిలో పావురం- వారు తవ్విన గుంట.

గోడ ఎక్కి మురుగు కాలవలో 'పావురం' కనిపిస్తుందేమోనని చూశాడు. లేదు.

పిల్లలు ఏదో చేసుంటారు. ఆ పావురానికి నిజమైన నివాళి అందించివుంటారు అనుకోగానే ఓ తృప్తి. అప్పుడనిపించింది- చీకటి పడ్డాక రహస్యంగా గొయ్యి తీసి నాన్నను ఇక్కడే పూడ్చేస్తే!

అలాంటి ఆలోచన వచ్చినందుకు సిగ్గు కలిగింది.

అప్పుడు కాళ్లను చూసుకున్నాడు.

అదే దృశ్యం.. నిలువెల్లా బంధింపబడి ఉన్నాడు. ఇంకా ఇలా ఉంటే లాభం లేదు అని గాఢంగా ఊపిరి పీల్చుకుని బాహువులు చాచాడు.

తాళ్లు తెగిపోయాయి.

తనను తాను చూసుకున్నాడు.

తన చుట్టూ ఓ కాంతి వలయం మెరిసిపోతున్నట్టు అనిపించింది.

వెంటనే ఇంటికి వెళ్లాడు.

రాజేశ్వరితో తన నిర్ణయం చెప్పాడు.

ఆమె ఆశ్చర్యంగా చూస్తుంటే...

'నాన్నకి మంటలంటే భయం. తన శరీరాన్ని దహనం చేయవద్దని కోరాడు. ఆయన చివరి కోర్కెని తీరుస్తున్నాను' అన్నాడు రామచంద్రుడు.

'మరి మావయ్యగారి..' అని ఆగిపోయింది.

'నాన్న దెయ్యమై మనల్ని పీడిస్తాడని భయమా!

ఈ బతుకుని జయిస్తే చాలు. దెయ్యాన్ని జయించినట్లే.

చనిపోయాకే దయ్యాలవ్వరు. బతికి వున్న దెయ్యాల మధ్య, రాక్షసుల మధ్య ఉండటం అలవాటయిపోయింది' అన్నాడు రామచంద్రుడు.

★ ★ ★

శివయ్య శవాన్ని ఉస్మానియా హాస్పిటల్‌కి పరిశోధన కోసం డొనేట్ చేశాడు రామచంద్రుడు. ఆ కార్యక్రమం పూర్తి కావటానికి కొన్ని గంటలు పట్టింది.

భార్యా పిల్లల్తో బయటకు వస్తున్నాడు తృప్తిగా.

'నాన్న బతుక్కి కూడా సార్థకత లభించింది. ఆయన మెదడు పనిచేయటం ఆగిపోయి ఉండొచ్చు. రేపటి డాక్టర్లు నాన్న మనసుని విశ్లేషించగలిగితే గొప్ప పాఠాలు మనుషులు నేర్చుకోవచ్చు' అనుకున్నాడు.

ఆ తర్వాత పెద్దకర్మ, చిన్న కర్మల లాంటివేం చేయలేదు.

ఎవరో అన్నారు-

'మీ నాన్నకి పరలోక ప్రాప్తి ఉండదు. కొడుగ్గా నువ్వు ఇలా చేసివుండాల్సింది కాదు.'

చిన్నగా నవ్వి అన్నాడు-

'నేనూ పరలోక ప్రాప్తి కోరుకోవటం లేదు. నేను చనిపోయాక కూడా నా శవాన్ని ఆసుపత్రికి డొనేట్ చెయ్యమని మా పిల్లలకి చెప్పాను.'

నెల రోజులు గడిచిపోయాయి.

సాయంకాలం చెట్టుకింద కుర్చీ వేసుకుని కూర్చున్నాడు.

అప్పుడే కొన్ని పావురాలు ఆకాశంలోకి ఎగిరాయి.

మేఘాలు కదులుతున్నాయి.

అప్పుడు రామచంద్రుడు రెండు చేతులూ చాచాడు.

అలా గాల్లోకి ఎగిరాడు.

ఆ గుంపులో రకరకాల రంగుల పావురాలున్నాయి. అవి రామచంద్రుడ్ని తమలో కలుపుకున్నాయి.

పావురాలు ఎగురుతున్నాయి! ©

కథ వెన్నక కథ

# గుబాళించిన 'పొన్న'



జయంతి వెంకట రమణ

'నా చుట్టూ ఉన్న సంఘమే నా కలంలో సిరా' అంటున్న జయంతి వెంకటరమణ ముప్ఫయ్ ఏళ్లలో వందకు పైగా కథలు రాశారు. వాటిల్లో 'పొన్న' అంటే ఆయనకు మక్కువ ఎక్కువ. ఆ కథ రాసింది 1976లో అయినా ప్రచురణ మాత్రం 1977 సెప్టెంబరులో 'యువ'లో జరిగింది. నాలుగేళ్ల తర్వాత 1981లో అదే కథ.. కారా, పురాణం, పురిపండా వంటి వారి చొరవతో వెలువడిన ఓ ఐదు కథల సంపుటి (అన్నీ రమణగారివే)లో మొదటి కథగా నిలిచింది. ఆ సంపుటి పేరూ 'పొన్న' కావడం గమనార్హం. మైసూరు విశ్వవిద్యాలయ తెలుగు విద్యార్థులకు ఆ సంపుటి పాఠ్యగ్రంథం అవడం విశేషం. ఇంతటి చరిత్ర సృష్టించిన ఈ కథకు తను చూసిన దృశ్యమే ప్రేరణ అంటున్నారాయన. మంచికథలకు మంచిరోజులు తథ్యమంటున్న రమణ 'పొన్న' కథపై ఏమంటున్నారంటే..

సమాజం ఎంతో ఇస్తోంది. రచయితలు ఆ రుణం తీర్చుకోవాలంటే కథారచనే మార్గం. నా కథలో నవ్వులే కాదు నిట్టూర్పులూ ఉన్నాయి, వెన్నెలతో పాటు చీకటీ ఉంది, మిద్దెలూ మేడలే కాకుండా పూరిళ్లూ ఉన్నాయి.

**బీజం ఇలా పడింది..**

'పొన్న'కు బీజంపడింది.. భద్రాచలం ప్రాంతంలో. అక్కడి గోదావరి ఒడ్డున జరిగిన సంఘటన అది. శ్రీరామనవమి మర్నాడో మూడోరోజో స్నానానికని ఆ నదిలోకి దిగాడో పడుచు కుర్రాడు. ఈత రాక, ఈదలేక మునిగిపోతున్నాడు. అప్పుడే అటుగా వస్తున్న భక్త బృందంలోని ఓ యువకుడు అది చూశాడు. చటుక్కున నీళ్లలోకి దూకాడు. చరచరా ఈదుకుంటూ పోయి, సాహసంతో ఆ కుర్రాడిని ఒడ్డుకు లాక్కొని వచ్చాడు. తాగిన నీటిని కక్కించాడు. అతను ఆ కుర్రవాడికి ప్రాణదానం చేసిన ఆ దృశ్యం నా మదిలో బలమైన ముద్ర వేసుకుంది. అప్పటికి నా వయసు కేవలం పద్నాలుగేళ్లు!

'దృశ్యం' అంతటితో అయిపోలేదు. ఆ ఉదయంవేళ నది ఒడ్డున అలా ప్రాణరక్షణ జరుగుతూ ఉంటే, ఓ స్త్రీ ఇసుకలోంచి పరుగెత్తుకొచ్చింది. ఒడ్డున మెట్లన్నీ వేగంగా ఎక్కి వచ్చిన ఆమె చేతిలో ఓ బకెట్! అందులో నిండా నింపుకొచ్చిన పాలు! వాటిని ఆ ఇద్దరు యువకులకే కాదు.. అక్కడున్న అందరికీ పంచి తన

ఆనందం, ఉద్వేగాన్ని వ్యక్తపరిచింది. రక్షించిన కుర్రాడు, రక్షణ పొందిన కుర్రాడు, అక్కడున్న మిగతావారు కూడా ఎవరూ ఎవరికీ ఏమీ కారు. కానీ ఆ ఆపద సందర్భంలో వారంతా స్పందించిన తీరే నన్ను ఆసాంతం కదిలించింది. అందులోంచే డాక్టరుబాబు పాత్ర అవతరణ! కథారచనలో కాస్త కుదురుకున్నాక, ఆవిష్కరించానీ కథని!

కథంతా గ్రామీణ వాతావరణమే. వ్యక్తుల ప్రవర్తన తీరుతెన్నులన్నీ వివరంగా చెప్పగలిగాను. నా భావానికి, అనుభవానికి చోటు కల్పించే అవకాశం ఆ కథ ద్వారా పూర్తిగా కలిగింది.

కథ ఇదీ..

ఓ పల్లెలో జనం పడుతున్న కష్టాలు తెలుసుకుని వాటిని తీర్చడానికి వస్తాడు డాక్టర్‌బాబు. ప్రభుత్వం తన కోసం ఖర్చు పెట్టి, చదువుకునే అవకాశమిచ్చినందుకు.. కృతజ్ఞత అలా తీర్చుకోవాలని అనుకుంటాడతను. గ్రామ ప్రాంతంలో వైద్యసేవ చేయాలని వచ్చిన అతను పగలూ రాత్రీ పడుతున్న శ్రమకు ముగ్ధురాలవుతుంది పొన్న. అంతకుముందే పెళ్ళయిన ఆమెది ఓ విషాద కథ. కట్నం తక్కువైందని మామ తిట్టడం, భర్త చేతగానితనం, ఫలితంగా తన తల్లి దుఃఖం.. ఆ శోభనం రాత్రిని ఆమె పాలిట కాళరాత్రిగా చేస్తాయి. అదే రాత్రి చీకట్లో ఇంటికి చేరి తల్లి ఎదుట విలపిస్తుంది. తదుపరి ప్రయత్నాలన్నీ విఫలమవడంతో, మనోవ్యాధికి గురైన తల్లి మంచంపడుతుంది. మరింత కుంగిపోతుంది పొన్న. కొన్నాళ్లకే తల్లి మరణించడం, భర్త తనపై నిందలేయడం మరింత కుంగదీస్తుంది. దరిమిలా ఒంటరి జీవితం!

అదే సమయంలో డాక్టర్‌బాబు ఆ ఊరికి రావటం, రోగులకు సేవలందించటంతో పాటు.. ఓ రోజున నీళ్లలో పడిన




కరణంగారి అబ్బాయిని కాపాడతాడు. అందరితోనూ దయగా ఉండే డాక్టర్ అంతటి ఘనకార్యం చేయడం ఆమెలోని ఆరాధన భావాన్ని పెంచుతుంది. అతని ఆలనా పాలనా చూస్తూ నానాటికీ ఇంకా దగ్గరవుతుంది. వైద్యంకోసం వచ్చినవారినెవరినీ డబ్బు అడగకపోవడం, కుర్రాడే అయినా ఎంతో అనుభవశాలిలా పనిచేయడం ఆమెనెంతో ఆకట్టుకుంటాయి. అతన్ని పొన్న తన ఇంటికి పిలవడం, ఆమె కూడా అతని ఇంటికి వెళ్లి భోజనాదులు చూడటం.. ఊళ్లో కొందరికి కంటగింపుగా మారుతుంది. నానారకాలుగా అనుకుంటున్న తరుణంలో పాతమొగుడు ప్రత్యక్షమవుతాడు. 'నిన్ను కాపురానికి తీసుకెళ్తా, అంతకంటే ముందు ఆ డాక్టరు సంగతి తేలుస్తా' అంటూ రాద్ధాంతం చేస్తాడు. 'పంచాయితీ పెట్టించు, నీ భార్యనని ఒప్పుకో, నువ్వు నన్ను వదిలిపెట్టావనే ప్రచారం అబద్ధమని చెప్పు, నా తల్లి చావుకు మూలం నువ్వేనని అందరి

## ప్రసిద్ధుల ప్రశంసలు

ప్రధాన పాత్ర పొన్నతో పాటు డాక్టర్‌బాబు పాత్రని సృజించడంలో రమణదొక ప్రత్యేకత. కథలు రాయడంలో చేయితిరిగిన ఈయన కలం చకచకా నడిచింది. కథనిండా సామాజిక స్పృహ ఉంది.

**– డాక్టర్ పురిపండా అప్పలస్వామి**

ప్రవాహం, చైతన్యం, కుతూహలం, రుచి, తన్మయత.. అన్నీ ఉన్నాయిందులో. చెట్టపట్టాలేసుకుని ఇవి ముందుకుపోతూ, పాఠకుల్నీ వెంట తీసుకెళ్తున్నాయి.

**– ప్రొఫెసర్ బి.వి. సూర్యనారాయణ**

గ్రామ వర్ణన 'పొన్న'లో అత్యంత సహజంగా నిండింది. వాతావరణమంతా కళ్లకు కట్టించింది. తెలుగు రచయితల్లో పలువురు నగరాల్లో స్థిరపడిపోయారు. అనంతరం గ్రామీణ పరిసరాలు, పరిస్థితులను వర్ణించేవారే కరువైపోయారు. అటువంటి తరుణంలో ఈ కథను చదవడం గొప్ప రిలీఫ్.

**–మధురాంతకం రాజారాం**

కథ ప్రారంభం అలరించేదిగా, ముగింపు మరపురాని విధంగా ఉంది. జీవిత సత్యాన్ని నిరూపించాలనే తపనను ఇందులో మనం చూడొచ్చు. బతుకు చిత్రాన్ని ఒడిసిపట్టుకోవాలనే తీవ్రతనీ గమనించవచ్చు.

**– డాక్టర్ వడలి మందేశ్వరరావు**

ముందూ అంగీకరించు' అని నిలదీస్తుందా యువతి. 'కాపురానికి పిలవాలని వచ్చావా, నీ అవసరం తీర్చుకోవాలని వచ్చావా? బయటికి నడువ్' అంటూ నెట్టి మరీ తలుపు మూసేస్తుంది. 'మీ ఇద్దరినీ ఏం చేస్తానో చూడ'ంటూ హుంకరించి వెళ్లిపోతాడా వ్యక్తి.

పగబట్టిన అతగాడు ఓ అర్ధ రాత్రివేళ కొందరితో కలిసి.. డాక్టర్‌బాబు ఇంటికెళ్తాడు. అత్యవసరంగా రోగిని చూడాలని చెప్పి కొంతదూరం తీసుకెళ్లి అతడిపై మూకుమ్మడి దాడిచేస్తారు. విషయం తెలిసి పరుగున వచ్చిన పొన్న 'డాక్టరుబాబూ' అంటూ అతని కాళ్లమీద పడి ఏడుస్తుంది. కమిలిపోయిన శరీరంతో మంచంమీద పడి ఉన్న అతడిని చూసి తల్లడిల్లిపోతుంది. ఓదార్పు మాటలు చెప్పిన కరణం ఆమెతో 'నువ్వు అతని సమీపానికి వెళ్లకుండా ఉంటే, ఇంత జరిగేది కాదం'టాడు. 'నిన్ను నేను అర్థంచేసుకున్నాను. ఊళ్లోవాళ్లు చెవులు కొరుక్కుంటున్నా, నాకు మాత్రం నీమీద నమ్మకముంది. నా కొడుకుని రక్షించిన డాక్టరు దేవుడైతే.. అతని ఎదుట నువ్వు హారతివి, అతని మెడలో మాలికవి' అంటాడు.

దాడిలో గాయాలపాలైన డాక్టరుబాబు గురించి తెలిసి హుటాహుటిన వస్తాడో బంధువు.

'నేరస్థుల్ని పట్టి అప్పగిస్తాం, మా డాక్టరును బతికించి మళ్లీ మాకు ఒప్పచెప్పండ'ని ప్రాధేయపడతాడు కరణం.

తక్షణం అతనిని తీసుకెళ్తానని, తేరుకున్న తర్వాత తిరిగి ఇంటికి చేరుస్తానని చెప్తాడు బంధువు. 'అంతేకాదు.. అతను మరి ఇక్కడికి రాడు, వస్తానన్నా రానివ్వను' అంటూ కారులో తీసుకుపోతాడు.

'సాటి మనిషిని ప్రేమించడం తెలియని ఇక్కడివాళ్ల మధ్య ఉండలేరు .. పొండని ఇదివరకే అన్నావుగా. అలాగే వెళ్లిపోతున్నా పొన్నా' అంటాడు డాక్టరుబాబు పొన్నతో.

ఆమె కన్నీరు తుడవడానికి ఎత్తిన చేయి జారిపోయి, కళ్లు మూతలుపడుతున్న అతడిని దిగ్భ్రాంతిగా చూస్తుందామె. 'ఇలా వెళ్లిపోకండి, తిరిగి రండి' అంటూ కదులుతున్న ఆ కారు ముందుకి పరిగెత్తుతుంది. రోడ్డును వదిలి, చేలకు అడ్డంగా పరుగిడతున్న ఆమె కాలుకు ఏదో తగులుతుంది. రక్తంతో కాలు తడిసిన ఆ చోట.. ఇక నిలవలేకపోతుంది. స్పృహతప్పి ఆమె అక్కడికక్కడే పడిపోతే.. కారు.. మలుపు తిరుగుతుంది!

సేకరణ: **శరత్‌బాబు**

# HIV / AIDS వారికి శుభవార్త

మీరు గాని, మీ డాక్టర్‌తో గాని వచ్చి నిజనిర్ధారణ చేసుకొని 15 రోజులలోనే 25శాతం (4వ వంతు) ఖచ్చితంగా లక్షణములు తగ్గించుకొని మంచి ఆకలిని, నిద్రను పొంది, భయము, ఆందోళన మరియు ఆవేదన తగ్గించుకొని క్రమేణా కంట్రోల్, నార్మల్, నెగెటివ్ ఏది కావాలో అంతవరకు మందులు వాడి మీరే పొందండి.

HIV/ ఎయిడ్స్ వైరస్ క్షీణించే మందు ప్రపంచంలో ఇంతవరకు లేకపోవుటచే HIV పెరుగుచుండుట వలన ఎల్లప్పుడూ శరీరం వేడిగా ఉండి క్షీణించుచుండుట, ఆకలి లేకపోవుట ఈ రెండు లక్షణములు ఎన్ని రకముల మందులు వాడినను మనిషి జీవించి ఉండగా తగ్గుట కల్ల. కానీ మా మందులు HIV వైరస్‌ను నిముషములో నశింపచేయు శక్తి కలిగివుండుటవలన 48 గంటలలోనే అతి వేడి తగ్గి మంచి ఆకలి, నిద్రను పొంది శరీరం క్షీణించుట, తగ్గుటవలన 15 రోజులలోనే భయము, ఆందోళన తగ్గి మంచి ధైర్యవంతులు కాగలరు. అందువలన టి.బి. మరియు కేన్సర్ ముదిరిన వారు తప్ప 4 నెలలు మందులు వాడి, మేము చెప్పిన పత్య పానాదులు జీవితాంతం పాటించుచున్నవారు మాత్రమే రక్షించబడుచున్నారు. ఇది సరికాదు అని నిరూపిస్తే 2 లక్షల రూపాయల బహుమతి ఇవ్వబడును. మా మందులు ICMR, CCRAS, NACO, NARI వారిచే ప్రశంసించబడి, GMP సర్టిఫికెట్ పొందిన జి.పి.నేచురల్ హెర్బ్స్ ఫార్మాస్యూటికల్స్ ప్రైవేట్ లిమిటెడ్ వారిచే తయారుచేయబడి సెంట్రల్ గవర్నమెంటు వారిచే పేటెంటు హక్కు పొంది 1500 కేసులు చేసిన ఏకైక సంస్థ. ఫ్రీ కన్సల్టేషన్. హెర్పిస్, హైపటైటిస్-బి, ఆస్తమ, మూర్ఛ, చర్మము, కీళ్ళు, నరములు, స్త్రీ, పిల్లల, లివర్ సంబంధిత దీర్ఘ వ్యాధులకు సంప్రదించండి.



డా॥ పి.యస్.వి.సత్యనారాయణ
Expert Physician
(ఎయిడ్స్ / కేన్సర్)

**డా॥ పి.యస్.వి.సత్యనారాయణ, గారిని ఎయిడ్స్ వైద్యం గురించి వైద్య ఆరోగ్య శాఖ న్యూఢిల్లీ వారి ప్రశంసలు.**

1. నేషనల్ ఎయిడ్స్ కంట్రోల్ ఆర్గనైజేషన్ (NACO) తేదీ: 13 /11/00 మీరు ఆరుగురు ఎయిడ్స్ పేషెంట్లకు వైద్యం చేసి నివారణ (CURE) చేసినందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాము. మా సంస్థ మిమ్మల్ని ప్రోత్సహిస్తుంది. ఈ సహస్రాబ్దిలో ఎయిడ్స్ రోగుల (400 మంది) కోసం సల్పిన కృషి ఎంతో ప్రోత్సాహకరముగా ఉంది. ఆ నెగెటివ్ పేషెంట్ల వివరాలు 1) కుమార్ 21 సం॥ 2) కీరవాణి 1 1 /2 సం॥ 3) శైలజ 20 సం॥ 4) రమణ 40 సం॥ 5) రవళి 18 సం॥ 6) వెంకట్ 21 సం॥పైన తెలిపిన వివరములతోపాటు 1275 మంది చికిత్స పొందిన వారి వివరములు కూడా తెలుసుకోవచ్చును.
2. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిసెర్చ్ (ICMR) తేదీ: 28-2-97 నిపుణుల కమిటీచే మీరు పంపిన ఫలితములు ఆమోదించబడి నిజనిర్ధారణ కొరకు నేషనల్ ఎయిడ్స్ రీసర్చ్ ఇనిస్టిట్యూట్ పూనేకు పంపడమైనది. వివరముల ఫలితం ఈ క్రింద పేర్కొనబడినది.
3. నేషనల్ ఎయిడ్స్ రిసెర్చ్ ఇనిస్టిట్యూట్ (NARI)28-9-01 ఈ తేదీన మీరు ఇచ్చుచున్న నాలుగు రకముల మందులు ఎక్కువ మోతాదులో కూడా ఏవిధమైన దుష్ప్రభావములు లేవు మరియు రక్తములో ఉన్న (HIV) వైరస్‌ను క్షీణింపచేయుచు ఇమ్మ్యూనిటీని పెంపొందించు శక్తి కలిగియున్నది.
4. సెంట్రల్ కౌన్సిల్ ఫర్ రిసెర్చ్ ఇన్ ఆయుర్వేద అండ్ సిద్ధా (CCRAS) 29-05-02 ఈ తేదీన ఇప్పటివరకు మీరు దాదాపు 400 మంది HIV/ఎయిడ్స్ రోగులకు చికిత్స చేసారని రికార్డులు రుజువులు, నివేదికలు తెలుపుతున్నాయి. ప్రస్తుత కాలంలో పట్టిపీడిస్తున్న HIV/ఎయిడ్స్ అనే జటిల సమస్యను పరిష్కరించేందుకు శాస్త్రీయ పద్ధతులలో మీరు గణనీయంగా కృషి చేసారని కౌన్సిల్ అభిప్రాయం పడింది మరియు టాక్సీ సిటీ (TOXICITY) స్టాండర్డైజేషన్ & టెస్ట్‌లు చేయించుకొని గుడ్ మెడికల్ ప్రాక్టీసనర్ అనిపించుకోండి అని ప్రసంసించినారు. పై టెస్ట్‌లో (IICT) వారిచే చేయించబడిన వివరములు.
5. ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ కెమికల్ టెక్నాలజి (IICT) 11-07-05 ఈ తేదీన ఒక కేజీ బరువుగల వ్యక్తికి 2000 మిల్లీగ్రాములు (2గ్రాములు) ఇచ్చిననూ ఏ విధమైన దుష్ఫలితములు లేవు అంటే 60 కేజీలు బరువుగల మనిషికి 2X60=200 గ్రాములు ఒక్కరోజు మోతాదులో ఇచ్చినను ఏ విధమైన (సైడ్ ఎఫెక్ట్స్) దుష్ఫలితములు లేవని నిర్ధారించబడినది. మేము 4 నెలలు (120 రోజులు) ఇచ్చు పూర్తి మందులకు సమానం.

కోర్టు తీర్పు తేదీ 26-04-05 సి.సి.నెం.934 ఆఫ్ 2002 డా॥ పి.యస్.వి. సత్యనారాయణ క్వాలిఫైడ్ ఆయుర్వేదిక్ డాక్టర్. మందుల తయారు చేయుటకు లైసెన్స్ ఉండుటవలన అమ్ముకోవచ్చు. పేషెంట్స్‌కు కూడా ఇవ్వవచ్చు అని కోర్టు నిర్ధారించినది.

గమనిక: యధార్ధ విషయాలు పట్టించుకోకుండా కొంత మంది అసూయ, అవినీతిపరులైన డాక్టర్లు మీడియాల యొక్క దుష్ప్రచారం నమ్మి మీ ఆరోగ్యం, మనసును పాడు చేసుకోకండి. ఏమాత్రం హృదయం ఉన్న వారెవరైనా మాకు ముందుగా తెలియపర్చి అధికార పూర్వకంగా వచ్చి సంప్రదించి రుజువులు చూసుకొని మాట్లాడమనండి.

**జి.పి.ఇనిస్టిట్యూట్ (హాస్పిటల్)**
ఆఫ్ ఆల్టర్‌నేటివ్ థెరపీస్ అండ్ రీసెర్చ్ సెంటర్
నెం. 1-8-499/6, శ్రీ వెంకటేశ్వరస్వామి గుడివీధి,
చిక్కడపల్లి, హైదరాబాద్-20
Ph: 66615411,27605827,
Cell: 98490 07228, 98493 96838

# కళాభిమాని



-రమాదేవి జాస్తి

అందరూ చలికి 'వూహూంహూం' అని వణికిపోతున్న ఈ శీతాకాలంలో, నా జీవితంలోకి అనుకోని 'వసంతం' వస్తుందని, నేనూ 'కుహూ, కుహూ' అని కోకిలలా వలపుగానమాలపించాల్సి వస్తుందని, ఈ రోజు ఉదయం నిద్ర లేచినపుడు అనుకోలా. ఆఫీస్‌కొస్తున్నపుడూ అనుకోలా.

నాది గవర్నమెంట్ ఉద్యోగం. తీరిగ్గా పదకొండింటికి ఆఫీస్‌కొచ్చి, ఓ అరగంట అలా అలా 'ఫైల్స్' తిరగేసి, 'టీ' తాగడానికని కిందికి దిగేను. ఆ తర్వాత రోజూలానే చెట్టుకింద పొడలు పొడలుగా పడ్తోన్న ఎండలో వెచ్చగా చలి కాచుకుంటూ మా ఆఫీస్ రచయితల్తో సమావేశమై రచనలు, రచయితల లొసుగుల గురించీ గంభీరంగా చర్చించుకుంటున్నాం.

మా అందరిలో నేనే 'జూనియర్'ని. ఇప్పుడిప్పుడే మిగిలినవాళ్ళు నన్నూ ఓ చిన్న సైజు 'రచయిత'గా గుర్తించి, కొంచెం గౌరవించడానికి ప్రయత్నిస్తున్నారు. ఈ మధ్య జరిగిన ఓ అరుదైన సంఘటన వల్ల వాళ్ళకది తప్పనిసరైంది పాపం! నేనూ వినేదశ నుంచి మాట్లాడే స్థాయికొచ్చా. నేనేం ఆషామాషీగా ఈ విజయం సాధించలేదు. దానివెనుక 'స్వయంకృషి' వుంది.

కొంతకాలం క్రితం 'తెలుగు బాకా' పత్రిక వాళ్ళు మామూలు కథల పోటీని, శృంగార

కథల పోటీని ఒకేసారి నిర్వహించేరు. అప్పటికే కాసిని కథలు అచ్చులో చూసుకో గలిగిన నేను ఈ అవకాశం వదుల్తానా? ! ఎంతో కష్టపడీ, పడీ, 'జీవన పోరాటంలో మమతల చెలగాటం' (కింద 'చావనివ్వదు - బతకనివ్వదు' టాగ్‌లైన్) కథని మామూలు కథల పోటీకి, 'మొగుడే రమ్మన్నాడు' (కింద 'ఛీ, ఎప్పుడూ అదే యావ' టాగ్‌లైన్) కథని శృంగార కథల పోటీకి పంపించాను.




ఎవరంటారు అద్భుతాలు జరుగవనీ? తప్పక జరుగుతాయి. నా శృంగార కథకి మొదటి బహుమతి వస్తే, మామూలు కథకి మూడో బహుమతొచ్చింది. ఇంక ఆఫీసులో ఎంత సంచలనమో? !

"సినిమాలకు మల్లె కింద టాగ్‌లైన్ ఐడియా బావుందయ్యా" అన్నారు మా సీ. రచయితలు ఏకకంఠంతో. నేనేమీ పొంగిపోలేదంటే, నేను 'మనిషి'ని కాదూ అని అర్థం. అంచేత బాగా పొంగిపోయా. నా కొచ్చిన 'గుర్తింపు' పొంగులో వుండగానే జరిగింది నా జీవితాన్ని మలుపు తిప్పే ఆ సంఘటన.

నేను అట్లా చెట్టుకింద చర్చల్లో మునిగిపోయిన సమయంలోనే మా సెక్షన్లో పనిచేసే వెంకటేశ్వర్లు రొప్పుతూ, రోజుతూ పరుగున వచ్చి "బాలూ, నీ కోసం శ్రీదేవి, నిర్మలమ్మ వచ్చేరు" అని తీవ్రంగా ఆయాస పడుతూ చెప్పాడు.

ఒట్టి చెప్పడమే కాదు, నా చేయి పట్టుకున్నాడు లాక్కెళ్ళడానికన్నట్లు. చూస్తుంటే ఒక్క నిముషం కూడా ఆగలేనట్లున్నాడు.

"శ్రీదేవితో బోనీ కపూరో, పిల్లలో రావాలి కాని, మధ్యలో ఈ నిర్మ

లమ్మ ఎందుకొచ్చినట్లూ? " గొల్లున నవ్వేడు, జంగిడి అప్పారావు. ఆయనెప్పుడూ అంతే, తన 'జోక్స్'కి తనే నవ్వేసుకుంటాడు, ఇత రుల మీద ఆధారపడకుండా. తన కష్టాలే ప్రపంచం కష్టాలని భావిస్తూ నా చిన్నప్ప ట్నుంచీ కథలు రాస్తున్నాడు. రాయడానికి ఆయనెంత కష్టపడతాడో, చదవడానికి పాఠ కులంతకన్నా ఎక్కువగా కష్టపడాలి. ఇది మా అందరి ఏకాభిప్రాయం.

"నడువ్ బాలూ! పాపం, వాళ్ళు ఎదురు చూస్తుంటారు. ఆలస్యమైతే వెళ్ళిపోతా రేమో? !" అన్నాడు వెంకటేశ్వర్లు ఆదుర్దాగా.

"నా కోసమని వచ్చినవాళ్ళు నన్ను కలవ కుండా ఎట్లా వెళ్తారు? ఒకవేళ పోతే పోనీ. కావాలనుకుంటే వాళ్ళే మళ్ళీ వస్తారు" అక్కడున్నదెవరో ఊహించలేక అజ్ఞానంతో నేను పడిన మిడిసిపాటది.

వెంకటేశ్వర్లు నా మాటలేమీ పట్టించుకో కుండా నా చేయి పట్టుకుని లాక్కెళ్తూ మూడంతస్తుల మెట్లూ ముప్ఫై సెకండ్లలో తానెక్కడమే కాక, నన్నూ అవలీలగా ఎక్కించేడు. బహుశా, 'లిఫ్ట్'లో వెళ్ళినా కూడ మేమంత వేగంగా పైకి చేరివుండ మేమో? అసలు వెంకటేశ్వర్లు రోజూ యిట్లా పైకీ, కిందికీ నాలుగైదుసార్లు తిరి గినా చాలు, ఆ కుండబొజ్జ ఆర్నెల్లల్లో 'వెన్న ముద్ద'లా కరిగిపోతుంది.

మేము సెక్షన్లోకి వెళ్ళేటప్పటికి అక్కడంతా కోలాహలం. నా సీటు చుట్టూ మా ఆఫీస్‌వాళ్ళే ఓ పదిమందిదాకా నిలబడి వున్నారు. మధ్యలో ఇద్దరాడవాళ్ళు కూర్చుని వున్నారు. నిలబడ్డ వాళ్ళ మధ్య నుంచీ దారి చేసుకుంటూ వెంకటేశ్వర్లు, తప్పిపో యిన పిల్లాడిని దొరకబుచ్చుకుని వాడి తాలూకా బంధువులకు అప్పచెప్తున్నంత సంతోషంగా మొహం పెట్టి ఆ యిద్దరికీ నన్ను అప్పగించేడు, "ఇతనేనండీ మీరడిగిన బాల సుబ్రమణ్యం" అంటూ.

నేను వాళ్ళవైపు చూసేను యథాలా పంగా, 'ఎవరోలే' అన్నంత నిర్లక్ష్యంగా. అంతే! సెక్షన్లోని కోలాహలానికి, వెంకటే శ్వర్లు ఆయాసానికి కారణం అప్పుడర్థ మైంది. వెంకటేశ్వర్లు వచ్చి చెప్పగానే పరు గెత్తుకు రాకుండా ఆ జంగిడి అప్పారావు మాటల్లోపడి కొన్ని అమూల్య ఘడియలు వ్యర్థం చేసుకున్నందుకు నన్ను నేనే గొంతు వరకూ పాతేసుకోవాలన్పించింది.

నా కుర్చీలో ఓ కుందనపు బొమ్మ, పక్కనే మరోపండు బామ్మ. దేవుడా! ఇట్లాంటి అందం నేను ఎన్ని జన్మలెత్తినా ఊహించగలనా? !

"మీరేనాండీ బాలసుబ్రమణ్యం? " ఆ 'బొమ్మ' అడిగింది.

"అవునండీ, అతనేనండీ మీరడిగిన బాల సుబ్రమణ్యం. అతనికే కథల పోటీలో రెండు బహుమతులొకేసారి వచ్చింది" నేను తప్ప, చుట్టూ మూగిన పదిమందీ ముక్తకంఠంతో చెప్పేరు.

"ఈయన్ని చూపించేందుకు మీ పను లన్నీ మానుకుని మరీ వచ్చేరు. వద్దం టున్నా కూల్‌డ్రింక్స్ తాగించేరు. మీ అంద రికీ చాలా 'థాంక్స్'ండీ. ఇంక మీరు వెళ్తే, మేమీయనతో కాస్సేపు మాట్లాడి, వెళ్ళి పోతాం" కుం. బొమ్మ మెత్తగా, తీయగా అర్థించింది అందరినీ.

అందరూ అయిష్టంగా కదల్లేక కదిలి, వొదల్లేక వొదిలి, వెళ్లలేక వెళ్ళేరు భారంగా, నావేపు అసూయగా చూస్తూ.

"కూర్చోండి బాలూగారూ.. నా పేరు సీతామహాలక్ష్మి. ఈవిడ మా బామ్మ. పేరు భూమిక" మా సెక్షన్లో నాకే మర్యాద చేస్తూ ఆ 'బొమ్మ' పరిచయం చేసుకుంది.

నేను కుర్చీలో కూర్చోబోతూ 'ఉలికి' పడ్డా. నాతోపాటు సెక్షన్లో అందరూను. అందరి కళ్ళూ, చెవులూ ఇక్కడే అతుక్కు పోయి ఉన్నాయయ్యే. పేర్లు ఏదో

తారుమారు అన్పించింది.

"పేరు చూసి ఎవరో నడివయసు పెద్ద మనిషి అయివుంటాడనుకున్నా. తీరా చూస్తే చాలా చిన్నవాడివే. అవునూ, అప్పట్లో 'చంద్రమోహన్'లా, ఇప్పట్లో 'శివాజీ'లా కుదమట్టంగా బాగానే ఉన్నావు. మరి పత్రికలో 'ఫోటో' వేయించుకోలేదేం?

బొత్తిగా పగలు చూస్తే రాత్రి కల్లోకొచ్చేలా ఉంటావేమో, అందుకనే వేయించుకునుండవు అన్నా సీతతో. కదుటే సీతా?" బామ్మ కంచుగొంతుతో మాట్లాడేసింది.

మా సెక్షన్లోవాళ్లు ముఖాలు తిప్పుకున్నారు ముసిముసిగా నవ్వుకుంటూ.

సీత చిరునవ్వు నవ్వింది. చాలామంది కేవలం 'పళ్ళ'తోనే నవ్వుతారు. కాని సీత నవ్వు 'కళ్ళ'ల్లో కూడ వెలిగింది దీపమల్లె.

ఈ బామ్మకి ఏది తోస్తే అది అనేసే అలవాటులా ఉంది. ఇట్లా అందరి కళ్ళల్లోను, చెవుల్లోను పడుతూ బెరుకు బెరుకుగా ఇక్కడే కూర్చునే కంటే, ఎంచక్కా బయటికెళ్తే హాయిగా మాట్లాడుకోవచ్చు సీతనే చూస్తూంటే అన్పించింది నాకు. అదే చెప్పాను వాళ్ళతో.

"మంచి మాట చెప్పావు నాయనా. ఏమిటో ఇక్కడసలు ఊపిరాడనట్లుంది ఇందాకట్నుంచీ" బామ్మ సంతోషంతో ఠపీమని పైకి లేచింది.

సెక్షన్‌వాళ్ళు కోపంగా చూస్తే, వెంకటేశ్వర్లు మాత్రం దిగులుగా చూసేడు. కిందికి వెళ్ళాక అంది సీత, "ఇపుడు కాఫీ అవీ ఏమీ వద్దండీ. ఇక్కడే మీతో కాస్సేపు మాట్లాడి వెళ్ళిపోతాం".

నేను తలూపాను. ఇప్పుడిప్పుడే ఆ సౌందర్యపు మత్తులోంచి కొంచెం కొంచెం తేరుకుంటున్నా. కనీసం మా ఆఫీస్‌లోని సాటి రచయితలైనా నా కథలకి ఎంత డబ్బు, పేరు వచ్చింది చర్చించారే కాని, ఎంత కష్టపడి ఈ కథలు రాశానో, అసలందులో ఏం చెప్పానో కొంచెం కూడ పట్టించుకోలేదు. అటువంటిది, ఏం మాట్లాడుతారు వీళ్ళు నాతో? నాకిది కొత్త అనుభవం. ఇట్లా నన్నో 'రచయిత'గా గుర్తించి ఈ ఆడవాళ్ళు వెతుక్కుంటూ రావడం గమ్మత్తుగా ఉంది.

"మీ కథలు చాలా బావున్నాయండీ. ప్రతికలో మీ 'ఫోటో' ఇవ్వలేదు గాని, మీ వివరాలు, అడ్రస్సూ ఇచ్చేరు కదా! బామ్మా, నేను 'బిర్లా'టెంపుల్‌కి వచ్చేం. మీ ఆఫీసు ఇక్కడే కదా, మిమ్మల్ని కూడా ఓసారి చూద్దామంది బామ్మ. అందుకని వచ్చాం. మావల్ల మీకేం ఇబ్బంది కలగలేదు కదా?" సీత శ్రావ్యంగా పాడింది (నాకట్లా విన్పించింది).

"అవునబ్బాయ్, నేనే బలవంతం చేశా. ఎందుకో నీ కథలు చదివాక, నిన్ను చూడాలన్పించింది. అందులోనూ 'ఫొటో' ఇవ్వక పోతివాయె. నా కనుమానం వచ్చింది. నువ్వు 'కోతి'లా ఉండి ఉంటావని సీతతో పందెం కాశాను కూడ. ఓడిపోయాననుకో. నీ మొదటి బహుమతి కథ నాకు బాగా నచ్చింది. సీతకేమో 'ఆరాటం, చెలగాటం' అనేదేదో నచ్చిందిట. తనకి మంచి కథలన్నా, నవలలన్నా మహా పిచ్చి" బామ్మ గలగలా మాట్లాడేస్తుంటే నేను ఓ పిచ్చి నవ్వు నవ్వుతూ కంగారుగా చుట్టూ చూసేను.

మిగతావన్నీ బాగానే ఉన్నా 'కోతి'లా ఉంటానని నాపై పందెం వేశాననటం బొత్తిగా నచ్చలేదు. జీవితంలో మనకి నచ్చినవే జరగవు కదాని సరిపెట్టుకున్నా!

"మా బామ్మ నాకు 'పిచ్చి' అంటుందికాని, నిజానికి నాకన్నా తనకే ఎక్కువ పిచ్చి. బామ్మ కసలు పుస్తకాలు, సినిమాలు ఉంటే చాలు, 'తిండి' కూడ అఖ్ఖర్లేదు" సీత మురిపెంగా అంది బామ్మని ప్రేమగా చూస్తూ.

నాకు సీత మాటలు నమ్మబుద్ధి కాలా.

బామ్మ 'సైజు' చూస్తుంటే అట్లా 'తిండి' అవసరంలేని మనిషిలా కన్పించడంలా. అసలు వీళ్ళిద్దరూ నాతో మాట్లాడుదామని వచ్చి, ఒకరి గురించి మరొకరు మాట్లాడేసు కుంటున్నారేమిటో? 'సినిమా'లంటే గుర్తు కొచ్చింది. బామ్మ పేరు 'భూమిక' అని చెప్పినట్లు గుర్తు. అది కరెక్టేనా? మొహ మాటంగానే సీతని అడిగేను.

సీత పకపక నవ్వింది. పొగడపూలు రాలినట్లు ఎంత బాగుందో?

"చూశావా బామ్మా, నీ పేరుతో అందరినీ 'కన్ఫ్యూజ్' చేసేస్తున్నావ్" బామ్మతో అని, నా వైపు తిరిగి "మా బామ్మకి సినిమా లంటే చాలా ఇష్టమని చెప్పేను కదండీ? అందుకని ఒక్కోసారి తనకిష్టమైన ఒక్కో హీరోయిన్ పేరు పెట్టుకుంటూంటుంది. అసలు పేరు 'అచ్చమాంబ' అయినా. నేను పుట్టకముందు 'సావిత్రి' అని పెట్టుకుందిట. తర్వాత వాణిశ్రీ, జయప్రద, సౌందర్య. ఇప్పుడేమో భూమిక. అదీ విషయం. తను పెట్టుకున్న పేరు చెప్పకపోతే బామ్మకి భలే కోపమొస్తుంది. మాట్లాడటం మానేస్తుంది. తను మాట్లాడకపోతే నాకింకెవరున్నారు చెప్పండి? అమ్మయినా, నాన్నయినా, ఫ్రెండయినా నాకన్నీ తనేగా? " అంది సీత, నీటిలో చేపల్లా కళ్ళు తడితడిగా తళతళ్లా డుతుండగా.

అంటే ఇంతందమైన సీతకి ఈ 'బామ్మ' తప్ప ఎవరూ లేరా? ఈ సెంటిమెంట్ నేనూహించనిది. బామ్మ కూడ కొంచెం గంభీరమైంది. క్షణం కూడ ఆలోచించ కుండా, "ఇకమీదట సీతకు నేనున్నాను. ఎప్పటికీ ఉంటాను" అని మనసులో దృఢంగా నిశ్చయించుకున్నా, నోట్లో కొస్తోన్న మీసాల్ని మునివేళ్ళతో సవరించు కుంటూ.

"సరేలే. నువ్వింక నా పేరు గురించి పరిశోధనలు మానేసి, మంచి మంచి కథలు రాయి. రాయగలగడం అనేది గొప్ప కళ. లలితకళల్ని భగవంతుడు అందరికీ ప్రసాదించడు. పూర్వజన్మ పుణ్యంతోనే కళ లబ్బుతాయి. చక్కగా రాసి మంచి పేరు తెచ్చుకో" బామ్మ ఆశీస్సులు నన్ను ఆకాశం లోకి విసిరేసాయి.

బామ్మ నా పూర్వజన్మ పుణ్యాన్ని గుర్తిం చడంతో నేనుబ్బిపోయిన విషయం బయటి కి కనపడకుండా తంటాలు పడ్తూ "అలాగే బామ్మగారూ" అన్నాను.

"మేమిద్దరం మీ అభిమానులమండీ. అప్పుడప్పుడూ కలుద్దాం, మీకభ్యంతరం లేకపోతే" అంది సీత వరాలిచ్చే దేవతలా.

"భలేవారే. మీలాంటి అభిమానులు దొరకడం అదృష్టం. మీలా ప్రోత్సహించే వారు దొరికితే రచయితగా ఎంతో ఎత్తుకి ఎదగొచ్చు" మనస్ఫూర్తిగా చెప్పేను.

"మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా సంతోషంగా ఉంది. ఇంక వెళ్ళొస్తామండీ" అంది సీత నిస్సంకోచంగా 'షేక్‌హాండ్' కోసం నావేపు చేయి చాస్తూ. ఆహా! ఎంత గొప్ప కల్చరో? ! బాగుంది బామ్మ 'ట్రైనింగ్', కలలోలా చేయి చాపేను.

నా చెయ్యి మెత్తని పూలగుత్తి మధ్య ఇరుక్కున్న 'ఫీలింగ్' తర్వాత బామ్మ కూడ 'భీముడి గద'లాంటి తన చేయి చాపింది. నా బంగారు కుడిచేతిని కాక, ఎడంచేయి ఇద్దామనుకున్నా. కాని బామ్మ 'పర్సనాలిటీ' చూసి నిస్సహాయంగా కుడిచేతినే అందించా. ఉతికి జాడించి, పిండేసిన బట్టని ఆరెయ్యడానికి దులిపినట్లు పైకి, కిందికీ రెండూపులు ఊపి సీత వెనకే వెళ్ళింది బామ్మ.

'బై' చెప్తూ ఇద్దరూ 'స్కూటీ' మీద వెళ్ళి పోయేరు. చుట్టూ పరుచుకున్న వెలుగంతా హఠాత్తుగా అదృశ్యమైపోయి, చిమ్మ చీకటి కమ్ముకున్నట్లు అన్పించింది. గాఢంగా నిట్టూర్చి అక్కడ్నుంచి కదిలాను.

ఎవరంటారు జీవితాల్లో మహద్భాగ్యాలు కలగవని? తప్పక కలుగుతాయి. అందుకే నా కథలు చదివి, ఓ అపరంజి బొమ్మ వెతుక్కుంటూ వచ్చి మరీ నా 'అభిమాని' నని చెప్పింది. గుప్పెడు మల్లెలు నా గుండెలో చల్లి వెళ్ళింది. గర్వంతో నాలో నేను ఎంతగా పెరిగేనంటే- బహుశా, లంకని చేరడానికి హనుమంతుడు కూడ అంతగా పెరిగివుండడు.

హఠాత్తుగా గుర్తుకొచ్చింది. సీత ఏం చేస్తుంటుంది, ఎక్కడుంటుందీ ఏమీ అడగ లేదు నేను. మళ్ళీ ఎప్పుడు, ఎట్లా కలుసుకోవడం? అయ్యో! ఎంతగా కుంగిపోయానంటే కుటీరంలో 'సీతాదేవి' కన్పించనపుడు ఆ 'రాముడు' కూడా నా అంతగా కుంగిపోయి వుండడు.

హా సీతా! సీతా! సీతా!!!

★ ★ ★

"హాయ్, సీతా!" సంభ్రమాశ్చర్యాలతో వెర్రికేక వేసేను, మూడో రోజునే సరాసరి మళ్ళీ నా సీటు దగ్గరకొచ్చిన సీతని చూసి.

"హుష్! ఏమిటా అరుపులు? అయినా నేను మళ్ళీ కలుద్దామని చెప్పానుగా? మీరింతగా ఆశ్చర్యపోవల్సిందేముందీ? " సీత మందలింపుగా అంది చుట్టూ చూస్తూ.

సీతావాళ్ళు వచ్చి వెళ్ళిందగ్గర్నుంచీ నేనస్సలు సీట్లోంచి కదలడంలేదు. ఇకమీదట ఇట్లా ఎంతమంది అభిమానులు నన్ను చూడటానికి వస్తుంటారో అని కాకపోయినా, మళ్ళీ 'సీత' వస్తుందేమోనన్న ఆశ తోనే. నా ఆశ నెరవేరింది.

దేవుడా! నువ్వున్నావు, మరీ మరీ వున్నావు. ఎందుకంటే ఈసారి 'బామ్మ' రాలేదు సీతతో. నాకు ఎక్కడలేని ధైర్యమూ, హుషారూ వచ్చేయి. అందరి వేపూ గర్వంగా చూసుకొంటూ, ఠీవిగా సీత పక్కన నడుచుకొంటూ మా ఆఫీస్ పక్కనే వున్న 'హోటల్'కి వెళ్ళేను.

హోటల్లో ఎప్పట్నుంచో తెల్సున్నవాళ్ళలా బోల్డు కబుర్లు చెప్పుకున్నాం టిఫిన్ తింటూ, వేడివేడి కాఫీ తాగుతూ. సీత తన గురించి వివరాలన్నీ చెప్పింది. తల్లి, తండ్రి చిన్నప్పుడే 'ఆక్సిడెంట్లో' చనిపోతే బామ్మే పెంచింది. ఆటలు, పాటలు, మాటలు అన్నీ బామ్మతోనే. అందుకే బామ్మంటే ప్రాణం. బామ్మ మాటే వేదం. మొదటిసారట ఇట్లా పనిగట్టుకుని వచ్చి ఓ రచయితని కలవడం అంది తింటూ. అది విని ఎక్కడికో తేలిపోయాను.

నేను కూడ నా గురించి చెప్పాను. నా రచనల గురించి ఉత్తరాలవీ వస్తుంటాయి కాని, ఇట్లా ఎవరేనా స్వయంగా వచ్చి నన్ను కలిసి, మాట్లాడటమనేది ఇదే మొదటిసారని నిజాయితీగా ఒప్పుకున్నా. పన్లోపనిగా నాకింకా 'పెళ్లి' కాలేదన్న విషయాన్ని కూడ 'ఇన్‌డైరెక్ట్'గా చెప్పాను. మొత్తంమీద గంటపైనే కబుర్లు చెపుకున్నా 'నిమిషం'లా గడిచిపోయింది. విడిపోయేముందు హఠాత్తుగా గుర్తుకొచ్చి చెప్పాను సీతతో- "వచ్చే ఆదివారం సాయంత్రం 'రవీంద్రభారతి'లో మంచి పాటల కార్యక్రమం వుంది. మీరూ బామ్మా రండి. చాలా బావుంటుంది" అని.

"నిజంగానా? నేనూ, బామ్మా పాటలంటే చెవికోసుకుంటాం. మా ఇంట్లో నిద్ర లేచినప్పట్నించీ మళ్ళీ నిద్రపోయేవరకూ 'రేడియో' మోగుతూనే వుంటుంది, తెల్సా" సీత చాలా సంతోషంగా చెప్పింది. తప్పకుండా వస్తామంది.

అన్నట్లుగానే ఆదివారం సాయంత్రం అయిదున్నరకల్లా బామ్మతో సహా వచ్చింది సీత, ర.భా.కి. అప్పటికే అక్కడ ఎదుర్చూస్తున్న నన్ను చూసి బామ్మ పలకరింపుగా నవ్వింది.

"ఏమయ్యా బాలూ, ఏమైనా కొత్త కథలు రాశావా? " బామ్మ అడిగింది.

ఎక్కడా? ఈమధ్య నాకు 'సీత' గురించి



తప్ప ఇతర ఆలోచనలు అసలు బుర్రలోకి వస్తేకదా? ఇంతందమైన అభిమానిని సంపాదించుకున్న మైకంలోంచి నేనింకా బయటకు రానిదే! నేనామాట బామ్మతో చెప్పలేను కాబట్టి, ఔనో కాదో తెలియ కుండా తలాడించేను.

"ప్రోగ్రాం మొదలవడానికి ఇంకా టైము న్నట్లుంది. కాస్త ఏదయినా తినేసి వద్దాం సీతా!" అన్నది బామ్మ.

నేను ఆనందంగా ఇద్దరినీ పక్కనేవున్న హోటల్‌కి తీసికెళ్ళాను. మేం తినివచ్చాక మరో పదినిమిషాలకి కార్యక్రమం మొద లైంది. గాయనీ, గాయకులు అన్నీ పాత తెలుగు సినిమాల్లోని పాటలు పాడేరు. సీత, బామ్మ కూడ పాటలు వింటూ పరవ శించిపోయారు. సీత పక్కనే కూర్చుని రెండుగంటలసేపు కాలక్షేపం చేయగలిగి నందుకు నేను చుక్కల్లో విహరించాను.

కార్యక్రమం పూర్తయ్యాక అందరితో పాటు ఆపకుండా చప్పట్లు కొడుతున్న సీతని అడిగాను"పాటలు పాడిన లక్ష్మీనారా యణని మీకు పరిచయం చెయ్యనా? "

సీత నమ్మలేదు. సంభ్రమంగా చూసింది.

"మీకతను తెలుసా? అబ్బా, ఎంత గొప్పగా పాడాడో? ! అచ్చం 'ఘంటసాల'లా ఉంది ఆ గొంతు కూడ. ఒకసారి వెళ్ళి 'కంగ్రాట్స్' చెప్దామా? ఏం బామ్మా? " సంబరంగా అడిగింది సీత చిన్నపిల్లలా.

"దానికేముందే? బాలూకి తెలుసునంటు న్నాడుగా! ఆ అబ్బాయిని కూడ కలిసి, 'బాగా పాడావు నాయనా' అని చెప్తే అత గాడూ సంతోషిస్తాడు. పాపం, ఇంతసేపు గొంతు చించుకుని మరీ పాడాడు. కళాకా రులకి కాసులకన్నా కళాభిమానుల అభినం దనలూ, చప్పట్లే ఎక్కువ సంతోషాన్నీ, బలాన్నీ ఇస్తాయంట. మీ తాతయ్య అనేవా రెప్పుడూ" అంది బామ్మ ఉదారంగా.

నేను సీతని, బామ్మని 'లక్ష్మీనారాయణ' దగ్గరకి తీసికెళ్ళి పరిచయం చేశాను. ఏదో సీతకి 'థ్రిల్' కలిగించాలన్న తాపత్రయమే కాని, ఆ క్షణంలో నాకు తెలీదు, తద్వారా నా గొయ్యి నేనే తవ్వుకుంటున్నట్లు. అందుకే "వీడి పేరు లక్ష్మీనారాయణ. నాకు చిన్ననాటి మిత్రుడూ, ఇప్పుడు రూమ్మేటు కూడ" అని ఎంతో అమాయ కంగా నవ్వుతూ చెప్పాను సీతతో.

"ఎంత మోసం? బాలూ ఇప్పటిదాకా మాకు మీ విషయం చెప్పనేలేదు. నిజంగా మీరు చాలా అద్భుతంగా పాడారండీ. ఇట్లా మిమ్మల్ని కలుసుకోగలగడంచాలా థ్రిల్లింగా వుంది" అంది సీత ఆ ఉద్వేగాన్నంతా ముఖంలో ప్రదర్శిస్తూ.

"నీ గొంతు చాలా బాగుంది నారా యణా! మంచి కంఠస్వరమనేది భగవంతు డిచ్చిన వరం. గానమనేది గొప్ప కళ. దేవుడు లలితకళలు అందరికీ ఇవ్వడు. పూర్వజన్మ పుణ్యంతోనే కళలబ్బుతాయం టారు. చక్కగా సాధన చేసి మంచి పేరు తెచ్చుకో" బామ్మ ఆశీర్వదించింది.

ఇంతకుముందు నన్ను కూడా అలా దీవించడం గుర్తుకువచ్చింది. ల.నా.గాడి పూర్వజన్మ పుణ్యాన్ని కూడా బామ్మ గుర్తిం చెయ్యడం నాకు సుతరామూ నచ్చలేదు. నేను ముఖం మాడ్చుకుని నిల్చున్నా.

ల.నా అయితే పరస్త్రీలు 'సోదరి'తో సమానమన్న ఇంగితం కూడా లేకుండా నిలవుగుడ్లేస్కుని సీత వైపే చూస్తున్నాడు. వాడి పంచేంద్రియాల్లో 'కళ్లు' తప్ప మరేవి పనిచేస్తున్నట్లు లేదు చూస్తుంటే. నేను కసిగా వాడి కాలు 'మాయాబజార్' సిన్మాలో మాయా శశిరేఖ, లక్ష్మణ కుమా రుడి కాలు తొక్కినంత నాజూగ్గా తొక్కేను. వాడి లోకంలోకి వచ్చేడు. ఇప్పటిదాకా పాడిన రాగాలన్నీ ఎటు పోయెనో, నత్తి నత్తిగా "థాంక్సండీ. మా బాలూగాడు

# మనసున ఉన్నదీ...



★ శరణ్య ముఖారవిందంతో వెలువడిన సెప్టెంబరు చతుర చూడ ముచ్చటగా ఉంది. విజయరాణి నవల 'నీరాక కోసం..' చాలా నచ్చింది. జ్ఞానపీఠాలులో హిందీలో మకుటాయమానమైన సాహితీ సామ్రాజ్ఞి మహాదేవివర్మపై రామకృష్ణారావు రాసిన వ్యాసం బాగుంది.

**–పెన్మెత్స సూరిబాబు,** హైదరాబాద్

★ ప్రతినెలా చతుర నవలలు బాగుంటున్నాయి. కొత్తగాలి, నిన్నటినిజం, చతురోక్తుల ద్వారా అనేక మంచి అంశాలు తెలుస్తున్నాయి.

**–ఎ.ఆంజనేయులు,** హైదరాబాద్

★ విజయరాణి నవల 'నీరాక కోసం..' చాలా ఆకట్టుకుంది. అనిర్వచనీయమైన భావాన్ని కలిగించింది. ఒక గృహిణి జీవిత సంఘర్షణను చక్కగా చిత్రించారు. దేశసేవలో ఉన్న భర్తకు తన భార్యపై గల ప్రేమను, ఆ కుటుంబాన్ని పీడిస్తున్న బంధువుల సమస్యను బాగా వివరించారు. నవల వైవిధ్యంగా సాగుతూ కంటనీరు తెప్పించింది. చతురకత 'స్నేహితుడే' బాగుంది.

**–బి.మోతిమోహనరంగా,** సూర్యాపేట

★ 'నీరాక కోసం..' నవల చాలా బాగుంది. సాధారణంగా నవలను దుఃఖాంతం చేస్తే బాగా ప్రాచుర్యం చెందుతుందని భావిస్తుంటారు. కానీ ముగింపు సుఖాంతమైతే ఆ ఆనందం చెప్పనలవి కాదు. రచయిత్రి ముగింపును సినిమాల్లోలాగా, సరళమైన భాషలో రాశారు. ఓ కుటుంబానికి పెద్ద కష్టం వస్తే బంధువులు, చుట్టాలు పక్కాలు ఎలా ప్రవర్తిస్తారో పాత్రల ద్వారా తెలిపారు. నిన్నటినిజం, స్థానంవారి చతురోక్తులు బాగున్నాయి.

**–మంచాళ శ్రీలక్ష్మి,** విశాఖపట్నం

★ చతురంటే మాకెంతో ఇష్టం.. ఇందులో నెలనెలా వచ్చే నవలలంటే మరింత ఇష్టం. ముఖ్యంగా గతనెల చతురలో వచ్చిన నవల ఆద్యంతం ఆసక్తితో చదవించి, అలరించింది. ఒక మంచి సినిమా చూస్తున్నట్లుగా అన్పించింది. ఇంత చక్కటి నవలను మాకందించిన రచయిత్రికి, చతురకూ కృతజ్ఞతలు.

**–విజయ దత్,** బీహెచ్ఇఎల్, హైదరాబాద్

---

**చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082**

ఈ మెయిల్ : vipula.chatura@gmail.com

నాకూ ఇప్పటిదాకా మీ గురించి చెప్పనే లేదు. ఇప్పుడైనా మిమ్మల్ని పరిచయం చేసేడు. అది నా అదృష్టం. నా పాటలు మీకు నచ్చడం మరీ మరీ అదృష్టం" అన్నాడు ల.నా. ముక్కలు ముక్కలుగా. వాడు కూడా నాలాగే బామ్మకంత ప్రాధాన్యమివ్వలేదు. ఓ నమస్కారంతో సరిపుచ్చేడు. ఎవరేనా 'స్వీటు'ని చూసినట్లు 'బాక్సు'ని చూస్తారేమిటి?

"ఇక మీదట మనందరం మంచి స్నేహితులం. ఎక్కడికెళ్ళినా అందరం కలిసే వెళ్దాం. సరేనా బాలూ? " అంది సీత. నేను ఏదో, 'సరేకాదు' అంటే మానేసేదాన్లా అడిగింది సీత.

ఏడవలేక నవ్వుతూ తలూపేను నేను. బొత్తిగా లోకజ్ఞానం లేని నా మీద నాకే జాలేసింది. ప్చ్! ఎట్లా బతుకుతానో ఏమిటో! 'ల.నా. గాడిని విలన్ని చేసి ఓ కథ రాసిపడేయాలి' అనుకున్నాక మనసు శాంతించింది. హఠాత్తుగా మా సీ. రచయిత జంగిడి అప్పారావు గుర్తుకొచ్చేడు. ఆయనట్లా ఎంతసేపూ తన చుట్టూవాళ్ల గురించే ఎందుకు రాస్తుంటాడో ఇప్పుడర్థమైంది.

"ఓకే, మళ్ళీ కలుద్దాం"

'ఒద్దొద్దు సీతా!' అని నా హృదయం చేస్తున్న ఘోషని ఏ మాత్రం పట్టించుకోకుండా పూలగుత్తిలాంటి చేతితో సీత 'షేక్ హాండ్' ఇచ్చింది ల.నా.కి. ఈ దిక్కుమా

లిన అలవాటెక్కడ నేర్చుకుందో? నా దవడ కండరం బిగుసుకుంది. ఆ తర్వాత బామ్మ కూడా చేయి చూపింది. ల.నా. ముఖం వెలవెల బోయింది. వెధవకి రోగం కుదిరింది.

'బై' చెప్పి సీత, బామ్మ వెళ్లిపోయేరు. తలతిప్పి చూద్దును కదా! ల.నా. గాడు కుడిచేతికేసి చూసుకుంటూ చలిజ్వరమొచ్చి నట్లు ఒణుకుతున్నాడు.

"ఒణికింది చాల్లే. ఇంక పోదాం పద" అన్నా అక్కసుగా.

"ఒరే బాలూ, నీకింత అందమైన 'గాళ్ ఫ్రెండ్' దొరికిందని మాటమాత్రం చెప్పలే దేంరా? చిన్నప్పట్నుంచీ ఒక్కంచంలో తిని, ఒక్క మంచంలో పడుకుని, ఒక్క రహస్యం మనమధ్యే లేకుండా బతికినవాళ్ళం ఇప్పటి దాకా. ఇప్పుడెందుకురా ఇట్లా చేసేవూ? "

ఎంతో పోట్లాడుతాడనుకున్నా. 'షేక్ హాండ్' తాలూకూ మైకంతో వున్నాడల్లే ఉంది. జాలిగా, బలహీనంగా అడిగేడు. కరిగిపోయేను.

"ఛ, అవ్వేం మాటల్రా? నిన్ను కూడ, 'సర్ప్రైజ్' చేద్దామని చెప్పలా, అంతే. దాచాలనుకుంటే ఇప్పుడు మాత్రం ఎందుకు పరిచయం చేస్తాను చెప్పు? " లాలనగా చెప్పేను.

మనసులో ఏమనుకున్నాడో కాని, మరేం మాట్లాడ్లా ల.నా. ఆ తర్వాత వాడు తన కుడిచేతిని ఎంతో అపురూపంగా చూసుకో వడం, పదే పదే మూతికానించుకుని ముద్దు లాడటం చూసి, ఆ చెయ్యి విరక్కొట్టాలన్పిం చినా కొట్టలా. "మన బంగారం మంచి దైతే..." అన్నట్లు సీతకున్న పిచ్చి అలవా టుని తల్చుకుని దీర్ఘంగా నిట్టూర్చి ఊరు కున్నా.

ప్చ్ సీతా!! సీతా!!!

★ ★ ★

"బాలూ, కళాభవన్లో 'పెయింటింగ్ ఎగ్జి బిషన్' వుంది. వెళ్దామా? " అని సీత ఫోన్ చేసినప్పుడు నేనే మాత్రం ఉత్సాహం ప్రద ర్శించలా, గత అనుభవంతో.

"నాకేం అర్థంకావు. ఆ పెయింటింగుల వీను" అన్నా అనాసక్తంగా. మరే చోటికైనా ఆనందంగా ఎగిరిగంతేసేవాడినే కాని, ఊహూఁ, అక్కడికి మాత్రం కాదు. తెలివై నవాడు ఒకే తప్పు రెండుసార్లు చెయ్యడు గాక చెయ్యడు.

"నాకు మాత్రం తెల్సా ఏమిటి? ఏదో ఆ రంగులవీ చూస్తుంటే గొప్ప సంతోషంగా ఉంటుంది. ప్లీజ్, రారాదూ? సరదాగా వెళ్లి చూసొద్దాం. లక్ష్మీనారాయణ కూడా వస్తా నన్నాడు" అవతల్నుంచీ సీత గోముగా అడుగుతోంది.

నేనేమీ 'రాయి'ని కాదు కాబట్టి 'సరే' అనే శాను. అందులోనూ, ల.నా. వెళ్తుంటే నేనెట్లా వుండగలను వెళ్ళకుండా? ఏవిఁటో, ఎంత 'తెలివి' వున్నా ఒక్కోసారిట్లా తప్పుల మీద తప్పులు చెయ్యాల్సివస్తుంది గావన్ను. నేను, ల.నా., సీత, బామ్మ కలిసి ఎగ్జిబిష నంతా తిరిగి పెయింటిగ్సన్నీ చూశాం. సీత, బామ్మ చాలా ఆనందించేరు వాటిని చూసి. సీత ఆనందమే మా ఆనందం కాబట్టి నేను, ల.నా. కూడా ఆనందించేం.

"ఈ పెయింటింగ్సు వేసిన వెంకటాచలం మా ఫ్రెండూ, రూమ్మేటూ కూడా. మీకు పరిచయం చెయ్యనా? " చింకి చేటంత మొహంతో అడిగేడు ల.నా, మా యిద్దరికీ కలిపి మరో గొయ్యి తవ్వుతూ. నవ్వుతూ చేసిందానికి, ఏడుస్తూ అనుభవించాలన్న ఎరుకలేని ఏబ్రాసి వెధవ!

"వ్వాట్?!" సీత కెవ్వుమంది. ఆ తర్వాత బామ్మతో కలిసి పిచ్చిగా ఆశ్చర్యపో యింది. అక్కడితో ఆగక చిరుకోపంతో తన మెత్తటి 'పర్సు'తో నా భుజమ్మీద ఒక్కటి చ్చింది. ల.నా. నా భుజంవైపు 'ఈర్ష్య'గా చూసేడు.

"మీరూము కళాకారుల నిలయంలా వుంది. ఇంకా ఎన్ని కళల వాళ్ళున్నారు బాబూ. ఒకసారి మీ రూముకి రావాలి" అంది సీత బుంగమూతితో.

"మేం ముగ్గురమే వుండేది. రూమంటే మరీ ఒక్కగదేం కాదు. ఓ సింగిల్ బెడ్‌రూం పోర్షన్. సమయమొచ్చినపుడు చలం గురించి చెప్దామని ఊరుకున్నా, అంతే!" పేలవంగా నవ్వేను.

ల.నా. వెళ్లి వెంకటాచలాన్ని పిల్చుకొచ్చేడు. సీతని, బామ్మని వాడికి పరిచయం చేసేడు, రొమ్ము విరుచుకుని మరీ. నేను ప్రేక్షకుడిలా చూస్తుండిపోయేను.

"మీ చిత్రాలన్నీ చాలా అద్భుతంగా వున్నాయండీ" అంది సీత మెరిసిపోతున్న కళ్ళతో.

"అవున్నాయనా! కళనేది భగవంతుడిచ్చిన వరం..." అంటూ బామ్మ ఆనవాయితీగా చలంగాడి పూర్వజన్మ పుణ్యాన్ని కూడా గుర్తించేసి, ఆ కళలో పైకి రమ్మని ఆశీర్వదించింది.

'సీతని చూస్తుంటే చలం కూడ చాలా సహజంగా 'ట్రాన్స్'లోకి వెళ్ళిపోయేడు. అసలే చిత్రకారుడయ్యే. వాడి వాలకం చూస్తుంటే, వాడూ మా 'క్యూ'లోకి చేరిపోయినట్లు అర్థమైంది. అది వాడు 'తప్పు' కాదు, సీత 'మహిమ'. అందంగా, అమాయకంగా, ముగ్ధలా కన్పించే సీతని చూసి మనసు పారేసుకోనివాడు మనిషే కాడు.

"నేనూ ఇంతవరకూ అట్లాగే అనుకునేవాడిని. కాని మిమ్మల్ని చూశాక, అవి మీ ముందు చందమామ ముందు కొవ్వొత్తుల్లా కూడా లేవు" చలం దిగులుపడ్డాడు.

వీడి మొహం మండా, వీడు కవిత్వం కూడా వెలగబెడుతున్నాడు. 'వెలిగించినవా? వెలిగించనివా?" ల.నా. నా చెవి దగ్గర గొణిగేడు.

సీత అందంగా సిగ్గుపడింది. బామ్మ గర్వంగా చూసుకుంది మనవరాలిని.

"అబ్బాయ్ చలం, నువ్వు మా సీత బొమ్మ కూడా అట్లా వెయ్యరాదూ?" బామ్మ అడిగింది, దూరంగా కనిపిస్తున్న ఓ చిత్రాన్ని చూపిస్తూ.

"అంతకన్న అదృష్టమా?" చలం మెలికలు తిరిగిపోయాడు.

"బాలూతో పరిచయమైన వేళావిశేషం.. ముగ్గురు కళాకారులు పరిచయమయ్యేరు ఏకంగా. ఓ ఆదివారం మీరు ముగ్గురూ మా ఇంటికి భోజనానికి రావాలి. ఇకనుంచీ మనందరం మంచి ఫ్రెండ్స్" సీత చెయ్యి ముందుకు చాపింది. అది మాత్రం మర్చిపోదు కదా? !

అయిపోయాడు. ఇంకా ఆ చేత్తో వాడు ఇప్పట్లో చిత్రాలు వేసినట్లే! నేను, ల.నా. ముఖముఖాలు చూసుకున్నాం. పరిచయమై ఇన్ని రోజులైనా, మమ్మల్ని ఒక్కసారీ పిలవకుండా, ఇప్పుడీ చలంతోపాటు పిలవడం మాకు ఏదో 'అశుభం'లా తోచింది. బొమ్మ వేసే నెపంతో చలం, సీతకి మాకన్నా దగ్గరైపోడు కదా? మా భయాల్లో మమ్మల్ని నిలువునా ముంచేసి, సీతా, బామ్మా వెళ్ళిపోయేరు బండెక్కి.

"ష్, సీతా! అయ్యో సీతా!! అయ్యయ్యో సీతా!!!

★ ★ ★

ఆ రాత్రి ఇంటికెళ్ళాక చలం మమ్మల్ని 'లాడెన్'ని, 'సద్దాం'ని జార్జిబుష్ చూసినట్లు చూసేడు. అనరాని మాటలన్నాడు. మేం వినలేని మాటలు విన్నాం. ఒకే ఊర్లో పుట్టి, పెరిగి, చదువుకుని, చివరికి ఒకే ఊర్లో ఉద్యోగాలు సంపాదించుకుని, ఒకే ప్రాణంలా ఇన్నేళ్ళూ బతికి, ఇప్పుడిట్లా చెయ్యటం క్షమించరాని నేరమన్నాడు. రౌరవాది నరకాల్లో మగ్గిపోవల్సినంత మహాపాపమన్నాడు. వాడట్లా ఆక్రోశిస్తుంటే నేను, ల.నా. చాలా సిగ్గుపడిపోయాం. బాధతో

కుమిలిపోయాం. అది మర్చిపోవడానికి ఓ 'బాటిల్' తెచ్చుకుని 'మందు' కొడుతూ మనసులు విప్పి మాట్లాడుకున్నాం. ఒకరి నొకరు కావలించుకుని కన్నీళ్ళెట్టుకున్నాం. ముగ్గురమూ మంచివాళ్ళం, కాస్తో కూస్తో చూడచక్కగా వుంటాం. ఉద్యోగస్థులం, బ్రహ్మచారులం, పైపెచ్చు కళాకారులం కూడాను. సీతకి మా ముగ్గురి కళలూ ఇష్టమే. మా ముగ్గురికీ అభిమానే! కాబట్టి, ముగ్గురం పొట్లాటలు, అభిప్రాయ భేదాలు రాకుండా సంయమనంతో వ్యవహరించాలి. సాదాసీదా వాళ్లలా ఒకమ్మాయి కోసం మా పాతికేళ్ల స్నేహాన్ని పాడుచేసుకోకూడదు. ఎవరికి వాళ్లం సీత ప్రేమని పొందే ప్రయత్నాలు చేసుకోవచ్చు కాని, అందుకోసమని పక్కవాడిపై బురద చల్లకూడదు. 'అదృష్టం' ఎవర్ని వరించినా, మిగిలినవాళ్లు అసూయపడకూడదు, ఏడవకూడదు. 'సీత'ని చెల్లాయిగా భావిస్తూ "చెల్లాయి పెళ్లికూతురాయనే..." అనో, "నీ పాదం మీద పుట్టుమచ్చనై పుడతా చెల్లెమ్మో" అనో పాడుకుంటూ, ఆనందంగా పెళ్లిపనుల్లో పాలు పంచుకోవాలి. ఇది మా ఒప్పందం.

మా మనసులిప్పుడు మంచుకడిగిన మల్లెపువ్వుల్లా తేటపడినయ్. పక్షి ఈకల్లా తేలికపడినయ్. ఒకరినొకరు సూటిగా చూసుకోగలుగుతున్నాం.

సీత చెప్పిన విధంగానే అందరం మంచి స్నేహితులమయ్యాం. సీత మమ్మల్ని 'నువ్వు' అని పిలుస్తోంది. మేమూ అంతే. బామ్మ మా అందరికీ పెద్ద దిక్కు. నగరంలో ఎక్కడ ఏ సాంస్కృతిక కార్యక్రమం జరిగినా, అందరం కలిసి పోయేవాళ్లం. బామ్మ కోసమని సినిమాలన్నీ చూసేవాళ్లం. కాకపోతే బామ్మ 'మేత' ఖర్చే మాక్కొంచెం భారీగా పడుతుండేది. పాపం, సీత తను కూడా అప్పుడప్పుడు డబ్బులిచ్చేందుకు ప్రయత్నించేది. కాని తన 'పర్స్' తియ్యగానే మేం హాహాకారాలు చేసేవాళ్లం. పోటీలుపడి ఖర్చు చేస్తుండేవాళ్లం. ఇట్లా జీవితం మూడు ప్రోగ్రాంలు, ఆరు సినిమాలు, తొమ్మిది హోటళ్లలా గడిచిపోయింది. గచ్చునేల మీద గోలీ కాయలా దొర్లిపోయింది ఆర్నెల్ల కాలం.

ఈ మధ్యకాలంలో 'లలిత కళాతోరణం'లో ల.నా.ది ఒక ప్రోగ్రాం జరిగింది. వాడు ముందే సీతకిష్టమైన పాటల జాబితా తీసుకుని అవే పాడేడు స్టేజిమీద. చలమేమో సీత 'ఫోటో' ఒకటి తీసుకున్నాడు బొమ్మ వేస్తానని. ఎటొచ్చీ నేనే ఇటీవల కాలంలో ఒక్క కథ రాస్తే ఒట్టు. పరుగు పందెంలో వెనకబడిపోతున్నానని బెంగపట్టుకుంది నాకు. అనుకోకుండా దేవుడే దారి చూపించాడు ఆ ఆదివారం.

ఆరోజు మమ్మల్ని మొదటిసారి వాళ్లింటికి భోజనానికి పిలిచింది సీత. ఎప్పుడూ అందరం కలిసి బయట తిని, తిరగడమే కాని, వాళ్లు మా ఇంటికొచ్చిందీ లేదు, మేము వాళ్లింటికి వెళ్లిందీ లేదు. ఎంతగా మేం వండుకొని తింటున్నా, ఎంతైనా ఆడవాళ్ల చేతివంట కదా, అందులోనూ సీత స్వయంగా వడ్డిస్తుందయ్యే. చక్కగా ఇంటి భోజనం చేసినట్లు వుంటుందని మొహమాటానిక్కూడ 'వద్ద'ని చెప్పకుండా సీత ఆహ్వానానికి ఎగిరి గంతేసేం, ఎవరి ఊహల్లో వాళ్లం తేలిపోతూ. పోటీలు పడి మరి ముస్తాబై బయలుదేరాం.

ఓహో సీతా! ఓహోహో సీతా!! ఒహోహ్హో సీతా!!!

★ ★ ★

"పెళ్లికొడుకుల్లా కళకళ్లాడిపోతూ బయలుదేరేరు, కళాకారులందరూ. ఏమిటి విశేషం?" వాకిట్లోనే ఎదురొచ్చాడు మా 'శ్రీశైలం'. వెధవ, 'ఎక్కడికీ' అని డైరెక్ట్‌గా అడక్కుండా 'తెలివి' ప్రదర్శించేడు.

"ఒక ఫ్రెండ్ భోజనానికి పిలిస్తేనూ"

నసిగేం అందరం, ఎన్నో నెలల తర్వాత వచ్చిన వాడి రాకకి కొంచెం కూడ సంతోషించకుండా. మరొకప్పుడైతే వాడిని కావలించుకుని ఉక్కిరిబిక్కిరి చేసేవాళ్ళమే. కాని రావడానికెక్కడ సమయం, సందర్భం ఉండొద్దూ?

"నాకు తెలీని, మిమ్మల్ని ఇంటికి పిలిచి భోజనాలు పెట్టే ఫ్రెండెవ్వర్రా బాబూ? కొంపదీసి ఎవరైనా గాళ్‌ఫ్రెండ్ దొరికిందా ఏమిటి? " అనుమానంగా చూస్తూ అడిగేడు శ్రీశైలం.

ఉలిక్కిపడ్డాం. వీడెట్లా వాసన పసిగట్టేడాని కలవరపడిపోయేం. ఇంక తప్పేదేముంది? తప్పించుకోగలిగింది ఎక్కడ?

"ఈ మధ్య 'సీత' అని! తనూ, వాళ్ళ బామ్మా పరిచయమయ్యేరు. చాలా మంచి వాళ్ళు. మేమన్నా, మా కళలన్నా అభిమానం. ఈరోజు వాళ్ళింటికే వెళ్ళున్నాం" ఏదో సన్మానానికి వెళ్తున్నట్లు నేను గర్వంగా చెప్పేను.

"అలాగా, అయితే పదండి వెళ్దాం. ఈ రోజంతా మీతో కలిసి తిరగొచ్చని, నా ప్రోగ్రామ్సన్నీ కాన్సిల్ చేసుకుని, మా ఫ్రెండ్ కారు తీసుకుని మరీ వచ్చేను. మనం కబుర్లు చెప్పుకుని చాలాకాలమైంది" మా అంగీకారం కోసం చూడకుండా మాతో పాటు బయలుదేరాడు శ్రీశైలం.

"పెళ్ళికి వెళ్తూ పిల్లిని చంకన పెట్టుకెళ్ళినట్లు వీడూ వొస్తున్నాడేమిట్రా? " అన్నాడు ల.నా. నా చెవిలో.

"పోన్లేరా, రానివ్వండి. 'ముగ్గురు' వెళ్ళడం కూడ మంచిది కాదులే" చలం సర్ది చెప్పేడు రహస్యంగా.

ఎట్లాగూ 'కారు' తెచ్చానన్నాడు కాబట్టి, ఇదీ ఒకందుకు మంచిదేలే అన్పించింది తర్వాత మాకు. దారిలో అడిగేడు శ్రీశైలం, 'సీత అంటే ఎవరూ? ' అని. 'కృష్ణశాస్త్రి కవిత్వం' అన్నాన్నేను మబ్బుల్లో తేలుతూ.

'ఎస్. రాజేశ్వరరావు సంగీతం' అన్నాడు ల.నా. రాగాల్లో కొట్టుకుపోతూ.

'రవివర్మ చిత్రం' అన్నాడు చలం రంగుల్లో మునిగిపోతూ.

"అయితే మనిషి కాదన్నమాట! నేనింకా అమ్మాయేమో అనుకున్నా" శ్రీశైలం దీక్షగా ముందుకు చూస్తూ కారు నడుపుతున్నాడు. ఇంకా నయం, మేం చెప్పిన 'మహానుభావులు' ముగ్గురూ ఏ ఆఫీసూ? అని అడగ లేదు.

మూకుమ్మడిగా వాడిమీదపడి గొంతు పిసికి చంపేయాలన్పించింది మాకు. కాని మా ముగ్గురిలో ఎవరికీ కారు 'డ్రైవింగ్' రాదు. అంచేత ఓపిగ్గా 'సీత' గురించి, మా కలల గురించి, ఒప్పందం గురించీ వివరంగా చెప్పేం దారిపొడవునా శ్రీశైలానికి. 'అవార్డు' సినిమా కథలా మహా 'అశ్రద్ధ'గా విన్నాడు వాడు. ఏదో వాడి పుణ్యమాని 'క్రాఫ్' చెదరకుండా, 'డ్రెస్' నలక్కుండా సీతావాళ్ళిల్లు చేరాం కార్లో.

వాకిట్లోనే నిలబడి ఉంది సీత, ఆకుపచ్చ సిల్క్ చీరతో విచ్చిన తెల్ల గులాబీలా ముగ్ధమనోహరంగా.

"రండి, రండి! మీ కోసమే ఎదురుచూస్తున్నా" సంతోషంగా ఆహ్వానించింది.

ఆ ఆహ్వానంలో ఎవరికి వారికే ఎన్నో అర్థాలు ధ్వనించేయి. మేం శ్రీశైలం విషయం మర్చిపోయి గబగబ లోపలికెళ్ళేం సీత వెనకే కుక్కపిల్లల్లా. తర్వాత కారు పార్కుచేసి, లోపలికొచ్చిన శ్రీశైలం మావేపు చిరాగ్గా చూసేడు.

కాని మేం 'కేర్' చెయ్యలా. 'ఇతనెవరూ? ' అన్నట్లు చూసేరు బామ్మా, సీతా.

"వీడు మా ఫ్రెండ్ శ్రీశైలం. మా మిత్ర బృందంలో నాలుగోవాడు, చివరివాడూను. హైటెక్ సిటీలో ఓ సాఫ్ట్‌వేర్ కంపెనీలో 'కంప్యూటర్ ఇంజనీర్'. మొదట మాతో పాటే వుండేవాడు. ఓ ఏడాది క్రితం ఇల్లు



మారేడు. అప్పుడప్పుడూ వచ్చి వెళ్తుంటాడు" పరిచయం చేసేను నేను.

వెలిసిపోయినట్లున్న జీన్స్ పాంటూ, నలిగిపోయినట్లున్న టీషర్టూ, గడ్డిలారీ లాంటి తలకట్టూ, నల్లగా, పొడుగ్గా, సన్నగా తమిళ కమెడియన్లా వున్న శ్రీశైలాన్ని సీత, బామ్మ కూడా అనాసక్తంగా చూసినట్లు గ్రహించి నవ్వుకున్నాం మనసులో. వీడికి ఏ కళలూ రావు కాబట్టి బామ్మ ఆశీర్వచనాలు, సీత 'షేక్‌హాండ్లూ' దక్కవు. పరిచయం చేయగానే వాడు సీతని చూసి ఫార్మల్‌గా 'హలో' అన్చెప్పి, బామ్మకి మాత్రం పాదనమస్కారం చేసేడు. మేం ముగ్గురం 'ఉలికి' పడ్డాం. సీతతో స్నేహమయ్యాక, మాకీ మధ్య ప్రతిదానికీ ఉలికిపడటమూ, చెవుల్లో గొణగడమూ అలవాటైపోయింది.

"నయమే! బాలూ చెప్పకపోతే నిన్ను డ్రైవరనుకునేదాన్ని. నీ పేరేమిటబ్బాయ్.. అల్లాంటిది పెట్టేరు మీ వాళ్లు?" పాదాల మీంచి పైకి లేస్తున్న శ్రీశైలాన్ని అడిగింది బామ్మ. బామ్మకి కనీసం వాడి పేరూ నచ్చనందుకు మహదానందం కలిగింది మాకు.

"మా అమ్మా, నాన్నలు 'శ్రీశైలం' వెళ్లొచ్చాక నేను పుట్టానట. అందుకని ఆ పేరే పెట్టారు నాకు. ఫ్రెండ్సంతా 'శ్రీ' అంటారు బామ్మగారూ" ఏమీ ఫీలవ్వకుండా, స్టయిల్‌గా చెప్పేడు శ్రీశైలం.

వాళ్ల అమ్మానాన్నలు మా ఊరిలోని గుడికి వెళ్ళటం కూడా మేమెన్నడూ చూసెరుగం. మరి ఈ 'క్షేత్ర దర్శనం' మేం పుట్టకముందరి విషయం కాబట్టి దాని గురించి మాకేమీ తెలీదు. అసలు బామ్మలా వాడి నామ రహస్యం తెలుసుకోవాలన్న ఆలోచన కూడా మాకిప్పటిదాకా కలగనేలేదు. "ఇంకా నయం. వాళ్లు ఏ కీసరో, బాసరో వెళ్లినప్పుడు పుట్టేడు కాదు వీడు" నేను ల.నా. చెవిలో గొణిగాను.

విన్నదల్లే వుంది సీత, ముసిముసిగా

నవ్వింది.

"మరీ ఎక్కువ రకాలు చేసినా ఏదీ తృప్తిగా తినలేరని క్లుప్తంగానే ముగించాను వంట. చక్కగా కడుపునిండా తినండి నాయనా. దానాల్లోకెల్లా ఉత్తమమైంది అన్నదానమంటారు. దానివల్ల ఎంతో పుణ్యం వస్తుందంటారు" అంది బామ్మ భోజనాల దగ్గర 'డొక్కా అన్న పూర్ణమ్మ' తల్లికి అక్కగారిలా మొహం పెట్టి.

ఉలికిపడ్డాం మళ్లీ. అన్నదానమేమిటి? మేమేమన్నా ఏ 'సోమాలియా' నుండో వచ్చామనుకుంటున్నదా లేక 'సునామీ' బాధితుల్లా కన్పిస్తున్నామా? ఈ బామ్మ నోటికి ఏదివస్తే అది మాట్లాడేస్తుంటుంది శుద్ధీ, పద్ధీ లేకుండా. అసలీ బామ్మని భరించడమే 'అందాల సీత' కోసం కాబట్టి సర్దుకుపోయాం ఎప్పట్లానే.

మేం అందరం హోటల్లో భోంచేసేపుడు వాడిచ్చే పదిరకాల్లో ఒక్కటీ పిసరంత కూడా ఒదిలిపెట్టకుండా లాగించేసే బామ్మ ఆకుపచ్చ, నలుపూ కలగలిసి ఒక విచిత్రమైన రంగుతో ఉన్న 'పేస్టు' లాంటి పదార్థమూ, మాడిపోయి పొడుగ్గా కన్పిస్తోన్న గుప్పెడు ముక్కలూ, చారులా జారుతూ పళ్ళెంలో ఈ చివర్నుండీ ఆ చివరికి ప్రవహించిపోతున్న పసుప్పచ్చటి ద్రవపదార్థమూ వడ్డించింది మా కంచాల్లో. ఆ పేస్టు పేరు బీరకాయ చెక్కుల పచ్చడి అని, ఆ బొగ్గుముక్కలు దొండకాయ వేపుడని, ఆ ద్రవ పదార్థం దోసకాయ పప్పని చెప్పింది సీత, మంచినీళ్ళు పెడుతూ. పైగా సీతకి ఆ పచ్చడంటే ఇష్టమట. బీరకాయ ముక్కలు మొన్నే కూరొండుకుతిని, చెక్కులు మాకోసమని అట్టేపెట్టి ఈ రోజు పచ్చడి చేసిందట బామ్మ. ఎంతటి అతిథి మర్యాదనో?

పల్చటి ద్రవంలో పడవల్లా తేలుతోన్న పప్పు బద్దల మధ్య 'లాంచి'లా ఎక్కడన్నా ఓ దోసకాయ ముక్క తగుల్తుందేమోనని అందరం పడి వెతికేం. నై! ఇంక ఉండబట్టలేక అడిగేసేను 'ముక్కల్లేవేమిటి? ' అని.

"కాయ చేదయిందని వెయ్యాలా? " అంది బామ్మ తేలిగ్గా.

"ఇంకా నయం. ఆ చెక్కులు కూడా పచ్చడో, పులుసో చెయ్యాలా" చలం నా చెవిలో సంతోషించేడు.

ఇంటి భోజనం కదా, సుష్టుగా తినొచ్చని ఉదయం 'టిఫిన్' కూడా చేసుకోకుండా, రెండుసార్లు కాఫీ మాత్రం తాగొచ్చిన మాకు ఆ 'తిండి' చూడగానే భగ్గుమంది. ఇంత వయసొచ్చీ అన్నం కూడా ముద్దగా తప్ప వండలేకపోయిన ఆ ముసలావిడని ఎన్ని చిత్రహింసలు పెట్టినా పాపం లేదన్పించింది. అన్నం గంజివార్చి వండటం అలవాటట. ఆ గంజితో ఏ రసమైనా చేసిందేమోనని హడిలి చచ్చేం. కానీ మా అదృష్టంకొద్దీ అట్లాంటి అఘాయిత్యామేమీ చెయ్యలేదు. పాపం, సీత ఇన్నేళ్ళూ ఇట్లాంటి తిండి తింటూ పెరిగిందిగావచ్చనుకుని కడుపు తరుక్కుపోయింది.

"పచ్చడి చాలా బాగుంది బామ్మగారూ" శ్రీశైలం మెచ్చుకున్నాడు, వేలితో ఇంత సుద్ద తీసి నాలిక్కి రాసుకుంటూ.

"పట్టుకెళ్ళు ఆ గిన్నెని. ఏడాదిపాటు పళ్ళు తోముకోడానికి వస్తుంది" చలం గొణిగేడు.

"నచ్చిందా నాయనా? మరి కాస్త వేసుకో" బామ్మ హుషారుగా పెద్ద నిమ్మకాయంత పచ్చడి ముద్దలు అందరి కంచాల్లోనూ మళ్ళీ వడ్డించింది, అడక్కుండానే.

"మహాతల్లి! ఎంత పచ్చడి వేసిందో, అన్ని చెక్కులు ఎక్కడ ఏరుకొచ్చిందో, లేక ఎన్ని నెల్ల నుండీ దాచివుంచిందేమో!"

అప్పటికే కంచాల్లో ఉన్నదాన్ని ఎట్లా మాయం చెయ్యాలో అర్థంకాక అటూ ఇటూ చూస్తున్న మాకు మళ్ళీ వచ్చిపడ్డ ఈ కొత్త ముద్దల్నిచూడగానే మతిపోయింది.

దసరా శుభాకాంక్షలు

# కంచుకోట నాణ్యత... తరగని విశ్వాసం..



# KURNOOL

## OILS




**మా ఉత్పాదనలు:**

డబల్ ఫిల్టర్ గ్రౌండ్ నెట్ ఆయిల్

ఆర్.బి.డి పామోలిన్ ఆయిల్

వెజిటబుల్ కుక్కింగ్ ఆయిల్

రిఫైన్డ్ సన్ ఫ్లవర్ ఆయిల్

రిఫైన్డ్ గ్రౌండ్ నెట్ ఆయిల్

రిఫైన్డ్ కుక్కింగ్ ఆయిల్

వెరుశనగ పప్పు

MFD by :

## DAMODARA OIL MILLS

34 & 35, 3rd Phase, Industrial Estate, Kurnool - 518 003. A.P. Ph : 231552, 232879

పిచ్చెక్కినంత పనయింది. ఆ ముద్దల్ని పిడ కల్లా శ్రీశైలం ముఖం మీద కొట్టాలన్పిం చింది. ఈ ఉపద్రవానికి కారకుడైన శ్రీశై లాన్ని రెండోసారి కూడా పీక పిసికి చంపే అదృష్టం మాకు లేకపోయింది. ఎదురుగా సీత చిరునవ్వుతో మావేపు, పచ్చడి వేపు మార్చి మార్చి చూస్తోంది.

మా తెలివితేటల్ని ఉపయోగించి సీతని మంచినీళ్లకి, బామ్మని పప్పుకీ లోపలికి పంపించి, మా ముగ్గురి పచ్చడీ కలిపి పెద్ద వెలక్కాయంత చేసి శ్రీశైలానికి బహూక రించేం. చచ్చినట్లు దాన్ని గుటుక్కున అట్లానే మింగేడు రెండు దఫాలుగా, లోప లికి వెళ్లినవాళ్ళు బయటికొచ్చేలోగా!

"ఇట్లాంటి తిండి కాబట్టే సీత అంత సన్నగా, నాజూగ్గా ఉంది" నేను సీత సౌందర్య రహస్యం కనిపెట్టేశా.

"అదీ ఒకందుకు మంచిదేలే. బామ్మ మంచి వంటగత్తె అయితే మనం సీతని ఈ పాటికి 'శ్రీదేవి'లా కాక ఏ 'శ్రీవిద్య'లానో చూడాల్సివచ్చేది" ప్రతిదీ 'పాజిటివ్'గా ఆలో చించగల చలం సంతోషించాడు.

అసలు 'పప్పు' అనేదాన్ని కూడ ఇంత అధ్వాన్నంగా వండొచ్చునని నాకిప్పటిదాకా తెలీదు. బయటికొచ్చినప్పుడల్లా బామ్మ, సీతా కూడా హోటళ్ళలో అట్లా ఆవురావురు మని ఎందుకు తింటారో ఇప్పుడు బోధప డింది. దేవుడా! ఏదో ఆయన పుణ్యమాని 'నీళ్ళు' సృష్టించబట్టిగాని, లేకపోతే ఏమై వుందుమో ఆ పూట? కడుపులో ఉంగలు చుట్టుకుపోతున్న ఆకలి, కంచంలో మింగు డుపడని పదార్థాలు, ఎదురుగా 'గురిపెట్టిన తుపాకి' లాంటి చిరునవ్వుతో సీత. ఓ బిందెడు నీళ్ళసాయంతో అందరం ఆ పదా ర్థాల్ని మింగిపడేసేం, శ్రీశైలం తప్ప. అసలు ఈరోజు లేచి ఎవరి మొహం చూసామో? ఊహూఁ, అదే కాదు. బయలుదేరుతున్న పుడు ఈ శ్రీశైలమే ఎదురొచ్చేడు పళ్ళికిలిం చుకుంటూ. వాడివైపు క్రూరంగా చూసేం.

వాడు మాత్రం ఏమీఁ పట్టించుకోకుండా శుభ్రంగా భోంచేసేడు వేళ్ళు నాక్కుంటూ మరీ. వాడిట్లా 'సర్వభక్షకుడు' ఎప్పుడ య్యేడా? అని మేం ఆశ్చర్యపోయేం. మాతో ఉన్నపుడు పాపం బాగానే వుండేవాడు. మాకన్నా రుచులెక్కువ మనిషికి. మరిలాగై పోయేడు ఎప్పుడో, ఎందుకో?!

'మొలలోతు దుఃఖంలో మోకాలిలోతు సంతోష'మన్నట్లు భోజనహింస తర్వాత సీత 'ఐస్‌క్రీం' తెచ్చింది కప్పుల్లో. ప్రాణం లేచివచ్చింది మాకు.

అది కొనితెచ్చిందని స్పష్టంగా తెలుస్తూనే వున్నా, "ఇదికూడ మీరే చేసారా బామ్మా?" అనడిగేడు ఆశ్చర్యం ప్రదర్శిస్తూ శ్రీశైలం.

చెప్పొద్దూ, ముచ్చటగా మూడోసారి వాడి పీక పిసికి చంపేయాలన్న ఉత్సాహం మమ్మల్ని ఊపేసింది.

"చేసేదాన్నే కాని, ఎక్కడా? ఇవి వండేప్ప టికే ఓపిక పోయింది. అందుకే సీత బజారు నుండి తెచ్చింది"

ఓ దిక్కుమాలిన పప్పూ, పిచ్చి పచ్చడీ, కాసిని బొగ్గుముక్కలూ చేసి మా ముఖాన కొట్టి, అక్కడికేదో నవకాయ పిండివంటలూ చేసిపెట్టినట్లు, ఈ 'ఐస్‌క్రీం' ఒక్కటీ చెయ్య లేకపోయినట్లూ బాధపడింది బామ్మ.

"బతికించావు బామ్మ తల్లీ. అందుకే కనీసం ఈ ఒక్కటైనా ఆనందంగా తిని అఘోరిస్తున్నాం" అనుకొంటూ ల.నా, చలం కేసి చూశాను. వాళ్ళ ముఖాల్లోనూ అదే భావం.

"అయ్యయ్యో! అయితే ఈసారి మీ చేతి 'ఐస్‌క్రీం' మిస్సయ్యామన్నమాట!" ఏదో గొప్ప అదృష్టాన్ని చేజార్చుకున్నట్లు ముఖం పెట్టేడు శ్రీశైలం.

"నువ్వింతగా బాధపడుతున్నావు కాబట్టి మరో ఇరవై రోజుల్లో వచ్చే సీత పుట్టిన రోజుకి తప్పకుండా చేసిపెడతాలే" బామ్మ

జాలిపడుతూ అభయమిచ్చింది.

మేం ఉలికిపడ్డాం. మరిహ శ్రీశైలాన్ని ఒదిలిపెట్టదల్చుకోలేదు. వెధవ, పూరికే 'ఓవరాక్షన్' చేస్తున్నాడు అప్పట్నుంచీ. మేం వెళ్ళేపుడు దార్లో శ్రీశైలాన్ని పీక పిసికేసి, అంతగా అయితే 'ఆటో'లో ఇంటికెళ్ళిపోదామని నిశ్చయించుకున్నాం.

బామ్మ చెయ్యబోయే 'ఐస్‌క్రీం'ని తల్చుకుని 'కెవ్వు'మని గొంతులోంచి బయటికి రాబోయిన కేకని అతి కష్టంగా ఆఖరుక్షణంలో 'వావ్'గా మార్చి మా సంతోషం ప్రకటించేం- సీత 'పుట్టినరోజు' గురించి.

అట్లాంటి ఆనంద సమయంలో వచ్చిందా ఆలోచన నాకు.

"ఈసారి సీత పుట్టినరోజుని మా ఇంటిదగ్గర జరుపుకుందాం. ఏం అయిటమ్స్ కావాలో చెప్పండి, నేను చేస్తానీసారి" హుషారుగా చెప్పేను. వంటలో నాది బాగా మెలికలు తిరిగిన చెయ్యి. తిండి, వంట రెండూ నాకు ఆరో ప్రాణమే.

"టమాటో సూపు, వెజిటబుల్ మంచూరియా, నూడుల్సూ.." హోటల్లో వెయిటర్‌కి అర్డరిచ్చినట్లు టకటక చెప్పేడు శ్రీశైలం.

"నేనడిగింది సీతని, బామ్మనీ" నేను లోలోపల పళ్ళు కొరుక్కుంటూ, పైకి నవ్వేను.

సీత, ముందు మొహమాటపడినా, మా బలవంతం మీద చివరికి ఒప్పుకుంది.

"ఏవిఁటో ఈ రుణానుబంధం? మీరొచ్చాక మా జీవితం చాలా సందడిగా వుంది. ఇదే మొదటిసారి ఇట్లా సీత పుట్టినరోజుని బయటివాళ్ళు జరపడం. అంతా బాలూని కలిసిన వేళావిశేషం!" బామ్మ నావేపు ఆప్యాయంగా చూస్తూ అంది. గొంతులో జీర.

మేం కరిగిపోయాం. ముఖ్యంగా నేను మరీను. "పోన్లే పాపం, పెద్దావిడ!" అన్పించింది మాకు. ఆవిడ వండిన దిక్కుమాలిన వంటల్ని మర్చిపోయి, ఆవిడని ఓదార్చాం ఎంతో ఆత్మీయంగా. ఆ విధంగా ఇరవైరోజుల తర్వాత వచ్చే సీత పుట్టినరోజును మా ఇంట్లో జరపడానికి నిశ్చయమైంది. అబ్బ! మాకింక ఎన్ని పనులో? !

ఆహా సీతా! ఆహాహా సీతా!! ఆహాహాహా సీతా!!!

★ ★ ★

ఎన్నో యుగాల తర్వాత ఎదురుచూసిన రోజు రానే వచ్చింది.

లేచినప్పటినుండీ ఒక్క పనిలోనూ సాయం చెయ్యకుండా, 'భలే మంచి రోజు, పసందైన రోజు' అని పాడుకొంటూ ఏవిఁటో ఊరికే లోపలికీ, బయటికీ తిరిగేస్తున్నాడు ల.నా. చలం కూడా అంతే! ఇటువటూ, అటువిటూ సర్దినవే సర్దుతూ నానా హైరానా పడిపోతున్నాడు ఇంటిని 'ఆర్ట్‌గ్యాలరీ'లా తీర్చిదిద్దడానికి.

ఒప్పుకున్నందుకు నాకు తప్పదు కాబట్టి, ఆ రోజు నుండీ నిన్న రాత్రి వరకూ బామ్మ కిష్టమని సీత చెప్పిన రెండు పేజీల 'ఐటమ్స్'లోంచి ఓ ఆరేడు రకాలు ఎంపిక చేసి, వాటిని తయారు చేయడానికి పూనుకున్నా. బామ్మ ఇష్టమే తన ఇష్టమన్నది సీత. 'వంట' నాకొచ్చిన, ఇష్టమైన రెండో విద్య. దీనితో కూడా వాళ్ళని పడగొట్టాలి. అదీ నా తాపత్రయం. చెప్పినదానికన్నా ఓ అరగంట ఆలస్యంగా వచ్చేరు బామ్మా, సీతా. దారిలో గుడికెళ్ళి వచ్చేరుట. కొత్త చీరలో సీత కళ్ళు చెదిరేలా వుంది. ముఖంలో మాత్రం ఎందుకో 'బెంగ' కన్పిస్తోంది. ఏమైందోనని మేం ఆందోళన పడిపోయేం.

"పిచ్చి పిల్లకి రాత్రి నేను చచ్చిపోయినట్లు కలవచ్చిందట. పొద్దున్నే లేచి ఏడుస్తూ కూచుంది. అట్లా 'చావు' కలలోకి వస్తే చాలా మంచిది. చక్కగా 'పెళ్ళి' వార్త వింటావు అని ఎంత చెప్పినా వినిపించుకోవట్లేదు" బామ్మ చెప్పింది కారణం.



మేం ముగ్గురం ముఖముఖాలు చూసుకున్నాం. మేం రాత్రే నిర్ణయించుకున్నాం. ఎవరి వీలునుబట్టి వాళ్ళు సీతకి ఈరోజే మా మనసులో మాట చెప్పేయాలని. కాస్సేపు కబుర్లలో పెట్టి సీతను మామూలు 'మూడ్'లోకి తీసుకొచ్చేం.

అంతలో శ్రీశైలం కూడా హాజరయ్యేడు మేం పిలవకపోయినా. వస్తూనే బామ్మకి పాదనమస్కారం చేసి, సీతకి ఓ ఎర్రగులాబి పువ్వు చేతికిచ్చి పుట్టినరోజు శుభాకాంక్షలు చెప్పేడు. అది చూస్తూనే గుర్తుకొచ్చింది మాకు. మేం హడావిడిగా లేచాం.

నేను 'మల్లాది రామకృష్ణశాస్త్రి'వి, 'ముళ్ళపూడి'వి పుస్తకాల సెట్స్ బహుమతిగా ఇచ్చేను. ల.నా. సీతకిష్టమైన పాటలన్నీ రికార్డ్ చేసిన పది పాటల కేసెట్స్ ఇచ్చేడు. అన్నింటికన్నా బావుందన్పించింది చలం ఇచ్చిన సీత 'పెయింటింగ్.'

కేవలం తనది ఒక ఫోటో అడిగి తీసుకుని అంత బాగా బొమ్మ వేసేడంటే- నిజంగా మా అందర్లోకి తనదే 'గ్రేట్ ఆర్ట్' అనిపించింది. సీతయితే పూర్తిగా 'ఫ్లాట'యిపోయింది. బామ్మ కూడా మురిసిపోతూ వాడి బుగ్గలు పుణికి, ఖాళీగా వున్నప్పుడు తన బొమ్మనూ వెయ్యమంది. వెలిగిపోతున్న చలంముఖం మబ్బు కమ్మింది.

వెంటనే నా కర్తవ్యం గుర్తుకొచ్చినట్లు అందరినీ భోజనాలకి లేవదీసేను. పొద్దున్న అరింటినుండీ మొదలుపెట్టి నడ్డి విరక్కొట్టుకుంటూ ఒక్కచేత్తో చేసుకొచ్చేను. వంటంతా ఎందుకూ? నా 'సీత'కి రుచి చూపించి 'శభాష్' అనిపించుకోవడానికి. సీత కష్టంగా కాక ఇష్టంగా తింటుంటే, కళ్లారా చూసుకుని ఆనందించడానికీను. కమ్మని భోజనం తర్వాతే కదా మిగిలిన కళలన్నీ!

అందరూ లొట్టలు వేస్తూ తింటుంటే నాకు చాలా గర్వంగా అన్పించింది. "ఎంతయినా పప్పు మాత్రం ఆ రోజు బామ్మ చేసినట్లు లేదు" శ్రీశైలం సిగ్గు లేకుండా నాలుగో విడత పప్పు వడ్డించుకుంటూ చెప్పేడు.

"ఎన్ని చెప్పినా, ఎంత చేసినా ఆడవాళ్ల వంట మగవాళ్లకెట్లా వొస్తుంది చెప్పు శ్రీ? కాని బాలూకి వచ్చే భార్య అదృష్టవంతురాలే. చక్కగా వండిపెడతాడు, రోజూ కమ్మగా తినొచ్చు" వెజిటబుల్ నూడుల్స్ రెండోసారి లాగిస్తూ అన్నది బామ్మ ఇంత కూడ 'మనస్సాక్షి' లేకుండా. బాగానే గుర్తుపెట్టుకుంది 'శ్రీ' అని పిలవడం.

చెప్పొద్దూ, ఆ పప్పుగిన్నె శ్రీశైలంగాడి నెత్తిమీద, నూడుల్స్ బాణలి బామ్మ నెత్తిమీద బోర్లించాలన్న కోరికని అతి కష్టమ్మీద నిగ్రహించుకున్నా.

"నిజంగా వంట చాలా అమోఘంగా వుంది బాలూ! నువ్వింత బాగా వంట చేస్తావని ఎప్పుడూ చెప్పలేదేం? " సీత చెయ్యి కడుక్కుంటూ అడిగింది.

'మంచిదే అయింది చెప్పకపోవడం. లేకపోతే ప్రతి ఆదివారం బామ్మకి వండిపెట్టలేక చచ్చి సున్నమయ్యేవాడిని. నా జీవితం వంటగదిలోనే తెల్లారిపోయేది' అనుకున్నా మనసులో, ఈ ఒక్కరోజు కోసం బామ్మ చెప్పిన రెండు పేజీల లిస్టు గుర్తుకొచ్చి.

"నిజంగా నీక్కాబోయే భార్య అదృష్టవంతురాలే!" సీత అభినందించింది. 'ఆ అదృష్టం నీకు అక్ఖర్లేదా సీతా? ' అని అడుగుదామనుకున్నా సీత కళ్లలోకి లోతుగా చూస్తూ. కాని మొహమాటం నా నోరే నొక్కేసింది. పైగా ల.నా. చలం మావేపే 'డేగ' చూపులు చూస్తున్నారయ్యే. దాంతో సాదాసీదాగా 'థ్యాంక్యూ' అనేసి ఊరుకోవాల్సి వచ్చింది.

భోజనాల తర్వాత ల.నా. పాట కచేరీ మొదలుపెట్టేడు. అదో గంటపైనే సాగింది. సీత, బామ్మ కోరి మరీ పాడించుకున్నారు.

అవికాక, 'మనసున మనసై, ఓహో గులాబి బాల' అన్న పాటలు, తన కోసం పాడుకు న్నాడు ల.నా. కంఠం నిండా దిగులు వొలి కిస్తూ, సీత ముఖంలోకి భావగర్భితంగా చూస్తూ. నిజంగా చాలా గొప్పగా పాడేడు 'గుండె' చెమర్చేలా. కాని, సీతే పట్టించుకు న్నట్లు లేదు.

అందరం ఆపకుండా చప్పట్లు కొట్టేం, అయిదు నిముషాలు. ఆ తర్వాత ఇంటి వాళ్ల 'ఫ్రిజ్'లో ఉదయమే చేసివుంచిన 'ఫ్రూట్ సలాడ్' తెచ్చి అందరికీ ఇచ్చాను.

"మీరొకటి గమనించేరా? పాటలు పాడా ల్సిన బాలసుబ్రహ్మణ్యం కథలు రాస్తాడు. కథలు రాయాల్సిన వెంకటాచలం బొమ్మలు వేస్తాడు. బొమ్మలు వేయాల్సిన లక్ష్మీ నారా యణేమో పాటలు పాడుతాడు. భలే తమా షాగా వుంది కదూ. వీళ్ళ కాంబినేషన్? !" అప్పుడే ఆ విషయం కనిపెట్టినట్లు 'ఎక్సై టింగ్'గా అంది సీత 'ఫ్రూట్ సలాడ్' తింటూ.

మాకా విషయం చిన్నప్పటి నుంచీ తెలి సినా, ఇప్పుడే మేమూ మొదటిసారి తెల్సు కున్నట్లు ఆశ్చర్యాన్ని, సీత తెలివికి ఆనం దాన్ని ప్రకటించేం. "ఇప్పటివరకూ సీత గారి పుట్టినరోజుని మీరు 'సెలబ్రేట్' చేసేరు. ఈ సాయంత్రం నుండీ రాత్రివ రకూ నేను 'సెలబ్రేట్' చేస్తాను, మీ అందరూ అనుమతిస్తే" శ్రీశైలం మా అంద రివైపూ అభ్యర్థనగా చూసేడు.

"పీనాసి వెధవ. గొప్పగా ఓ గులాబిపువ్వు తెచ్చి చేతికిచ్చేడు పొద్దున్న. ఇంక సాయంత్రం 'టాంక్‌బండ్' మీదకు తీసికెళ్ళి పల్లీలు కొనిపెడతాడేమో? !" అన్నాడు ల.నా. చెవి కొరుకుతూ.

అందరం ముఖాలు కడుక్కుని, చక్కగా తయారై శ్రీశైలంతో బయలుదేరాం. బయ టికొచ్చి చూస్తూనే మాకు నోటమాట రాలేదు. కొత్తకారు మిలమిల మెరిసిపో తోంది. ఎవరినడిగి పట్టుకొచ్చేడో? బామ్మ అదే అడిగింది.

"నాదే బామ్మా, నిన్ననే కొన్నాను. ఈ రోజు మీ అందరినీ దీంట్లో తిప్పాలని నా కోరిక" చెప్పేడు శ్రీశైలం చాలా 'సింపుల్'గా.

"నా నాయనే, ఎంత పెద్ద మనసయ్యా నీది, శ్రీ" బామ్మ మెచ్చుకుంది, గునగునా వెళ్ళి కారులో ఎక్కి కూర్చుంటూ. శ్రీశైలం పక్కన బామ్మ, బామ్మ పక్కన సీత కూర్చు న్నారు.

కారు మాత్రం చిన్నదే. ఆరుగురం కూచో డానికి. గొణుక్కున్నాం మేం వెనక సర్దు క్కూర్చుంటూ.

బామ్మ బరువు సగం మోసుకుంటూ కారు నడిపేడు శ్రీశైలం.

"నీ జీతమెంత నాయనా శ్రీ? " బామ్మ దారిలో 'ఇంటర్వ్యూ' మొదలెట్టింది.

"నెలకి యాభైవేలండీ" శ్రీశైలం అదో సాధారణ విషయంలా చెప్పేడు.

"ఏవిటీ, యాభైవేలే? పాపం, వీళ్ళ ముగ్గురి జీతాలూ కలిపినా కూడా నీ అంత వుండదేమో కదూ? " అంది బామ్మ కళ్ళు తేలేసి, మూర్ఛకి సిద్ధమవుతూ.

"అస్సలుండవు. ఎందుకంటే మా జీతాలు మేం చచ్చినా కలపం కాబట్టి" ముగ్గురం ఒకేసారి చెప్పాం కోపంగా.

బామ్మ ఏమీ పట్టించుకోలా మమ్మల్ని. సీత కిటికీలోంచి బయటికి చూస్తోంది.

"అయితే నీకు కట్నమదీ బాగానే వస్తుందీ" బామ్మ దీర్ఘం తీసింది.

"ఛీఛీ. అట్లాంటి పనులు నేను చెయ్యను బామ్మా. అసలు మేం నలుగురమూ కట్నం తీసుకోకుండా పెళ్ళి చేసుకోవాలని చిన్న ప్పుడే ప్రతిజ్ఞ చేసుకున్నాం. మా అమ్మానా న్నలు కూడా నా పెళ్ళి నా ఇష్టానికే వదిలే సారు" శ్రీశైలం మా గురించి కూడ కలుపు కుని మరీ చెప్పినందుకు సంతోషపడ్డాం, అదెప్పుడు చేశామో తెలీకపోయినా.



"నీకు అమెరికా పిచ్చి అదీ లేదా? " బామ్మ ఆరాలు తీసింది.

"లేదు బామ్మా. మా అమ్మానాన్నల్నీ, మీలాంటి బామ్మల్నీ, ఇట్లాంటి స్నేహితుల్నీ, నా దేశాన్నీ ఒదిలి నేనెక్కడికీ వెళ్ళను. తెలివుండాలే కాని, ఇక్కడే బోలెడు డబ్బు సంపాదించుకోవచ్చు. హాయిగా అమ్మా, నాన్నల్నీ, బామ్మల్నీ చూసుకోవచ్చు" చెప్పేడు శ్రీశైలం. వింటున్న మాక్కూడ 'దేశభక్తి'తో దేహం పులకించింది.

చిన్నప్పటి స్నేహితుడే అయినా, ఏడాది క్రితం వరకూ మాతోనే కలిసున్నా, శ్రీశైలం గాడికిన్ని ఆదర్శ భావాలున్నట్లు మాక్కూడ తెలీదు ఇప్పటిదాకా. ఇట్లా లోతైన విషయాలు ఎప్పుడు మాట్లాడుకోలేదు మేము.

"ఎంత బుద్ధిమంతుడివి శ్రీ! నీలాంటి వాళ్ళు నూటికో, కోటికో ఒకరుంటారు ఈ కాలంలో" అంది బామ్మ మైమరచిపోతూ. అక్కడికి మేమేదో మర్డర్లూ, మానభంగాలూ చేసే ప్రపంచ ప్రఖ్యాత రౌడీ వెధవలమైనట్లు, వాడొక్కడే 'పురుషోత్తముడు' అయినట్లూను.

బామ్మ దారి పొడవునా ఇట్లానే శ్రీశైలాన్ని వాడి 'జీవితచరిత్ర' రాయబోతున్నదానిలా మనసు మూలల్లోకి, జీవిత మూలాల్లోకీ కూడా వెళ్ళిపోయి మరీ ప్రశ్నల మీద ప్రశ్నలు వేస్తుంటే, వాడు బాల్యమిత్రులమైన మాకే కాక, తనక్కూడా ఇప్పటిదాకా తెలియని ఎన్నో విశేషాల్ని అలుపూ సొలుపూ లేకుండా వినిపించేడు. ఏదో గుళ్ళో పురాణం వింటున్నదాన్లా తన్మయురాలైపోయింది బామ్మ. సీత మాత్రం పాపం, ఒక్కటంటే ఒక్క మాటా మాట్లాడలేదు. ఎంత 'బోరు' కొట్టిందో? అసలు వాడు ఏదైనా ఒకసారి చెప్తేనే వందసార్లు చెప్పినంత బోరు. మాకే కారు దూకి పారిపోవాలన్పించింది. కనీసం పాతిక సార్లయినా. ఇట్లా సుదీర్ఘంగా ఓ ముప్ఫై యుగాలు గడిచేక, కారుని ఓ పెద్ద 'కాంప్లెక్స్'లోకి పోనిచ్చి ఆపేసాడు శ్రీశైలం.

ఆనక మా అందర్నీ మూడో అంతస్తులోని ఓ 'అపార్ట్‌మెంట్'లోకి తీసుకెళ్ళేడు. లోపల 'ఇంద్రభవనం'లా వుంది అందంగా, విశాలంగా. అన్నిగదులూ తిప్పి చూపించేడు. బాల్కనీలోంచి చూస్తే దూరంగా టాంక్‌బండూ, బుద్ధవిగ్రహమూ కూడా కనిపిస్తున్నాయ్. చీకటి పడుతుండటంతో ఒడ్డునా, నీటిలోనూ కూడా దీపాలు అందంగా కన్పిస్తున్నాయి. నిజంగా 'వ్యూ' చాలా బాగుంది అక్కడినుండీ.

"ఎట్లా వుంది ఇల్లు? " అంతా చూపించేక అడిగేడు శ్రీశైలం.

"చాలా బాగుంది. అద్దె ఎంత? " అడిగేను.

"అద్దె ఇల్లు కాదు. ఈ మధ్యనే 'బాంక్ లోన్' తీసుకొని కొన్నాను" అన్నాడు శ్రీశైలం.

"అప్పుడే ఇల్లూ వాకిలీ కూడా ఏర్పాటు చేసుకున్నావు. ఎంత ప్రయోజకుడివయ్యా, శ్రీ!" బామ్మ 'భజన' అందుకుంది. ఈ 'శ్రీసూక్తం' విన్లేక చస్తున్నాం. హాయిగా పూర్తి పేరుతో పిలవొచ్చుకదా? !

ఇంతవరకూ ఎప్పుడూ మాలో మేము మిగిలినవాళ్ళని చూసి అసూయపడలేదు. కాని ఇప్పుడు మాత్రం మాక్కొంచెం కడుపులో మంటగానే అన్పించింది. ఆ భగవంతుడు మమ్మల్ని క్షమించుగాక!

నగరానికి నడిబొడ్డున ఇంతందమైన, ఖరీదైన 'ఫ్లాట్' కొనుక్కుని కూడా మాకు ఒక్కమాట చెప్పలేదు. మనసుకి కష్టం వేసింది. "ఒకేసారి మిమ్మల్ని గృహప్రవేశానికి పిలిచి 'సర్‌ప్రైజ్' చేద్దామని చెప్పలేదురా. అంతేకాని, మీ దగ్గర నాకు రహస్యాలేమిటి? " మా మనసులు గ్రహించినట్లు అనునయంగా చెప్పేడు శ్రీశైలం.

"ఇంతకీ గృహప్రవేశం ఎప్పుడు శ్రీ? "



బామ్మ కుతూహలంగా అడిగింది.

"ఇంకా ఇంటికి తగిన ఫర్నీచరూ అదీ చేయించాలి. అంతేకాదు. 'గృహలక్ష్మి' దొరి కాకనే గృహప్రవేశం బామ్మా!" చెప్పేడు శ్రీశైలం కొంచెం సిగ్గుపడుతూ, వీడి సిగ్గు బొగ్గులవ్వ!

"లక్ష్మీ కటాక్షం అనేది భగవంతుడిచ్చిన వరం. అది ఎంతో పూర్వజన్మ పుణ్యం వుంటేనేకానీ దొరకదు. చక్కగా బోలెడు డబ్బులు సంపాదించి, భార్యాబిడ్డల్ని సుఖ పెట్టి మంచి భర్తవనిపించుకో" బామ్మ ఆశీ ర్వదించింది.

"బామ్మ మాట బంగారు బాట" శ్రీశైలంగౌడ్ మళ్ళీ కాళ్ళమీద పడ్డాడు. వీడి వరస చూస్తుంటే అచ్చంగా బామ్మ కాళ్ల దగ్గరే కాపురం పెట్టేట్టున్నాడు.

"నిజంగా మీ ఫ్లాట్ చాలా బాగుంది శ్రీ గారూ. మంచి అభిరుచి వుంది మీకు. నాకయితే ఎంత నచ్చిందో!" మెరుస్తున్న కళ్లతో మొదటిసారి శ్రీశైలంతో సంతోషంగా మాట్లాడటమే కాదు, 'షేక్ హేండ్' కోసం చెయ్యికూడా చాపింది సీత.

"నచ్చితే తీసేసుకోండి" తేలిగ్గా చెప్పేడు శ్రీశైలం గులాబి పూల గుత్తినందుకొంటూ.

"ఎట్లా? మీరు అమ్మేసినా, కొనుక్కోడా నికి నా దగ్గర డబ్బుల్లేవుగా?" సీత అమా యకంగా అడిగింది. చెయ్యి ఇంకా శ్రీశైలం చేతిలోనే వుంది. అందమైన గులాబిని ఎండిపోయిన పొగాకు కాడలో చుట్టినట్లు.

"ఊహూఁ, అమ్మను. మీకు కానుకగా ఇస్తాను. నేనొకసారి ఓ ఫ్రెండ్‌తో కలిసి బంజారాహిల్స్‌లో ఓ కోటీశ్వరుడింటికి

వెళ్ళాను. ఆ ఇల్లు, పెద్ద తోట, స్విమ్మింగ్ పూల్ అవీ చూసి ఎప్పటికైనా డబ్బు సంపాదించి నా భార్యని అట్లాంటి ఇంట్లో ఉంచాలని ధ్యేయంగా పెట్టుకున్నాను. దాని కింకా చాలాకాలం పడుతుంది కాబట్టి, ప్రస్తుతానికి దీనిని కొన్నాను. మీరు 'వూ' అంటే ఎప్పటికైనా మీ కోసం అట్లాంటి ఇంటిని కట్టిస్తాను" శపథం చేస్తున్నట్లు చెప్పేడు శ్రీశైలం సీతతో.

అందరికీ ఒక్క నిమిషం వరకూ వాడేమన్నదీ అర్థం కాలేదు. అప్పటిదాకా నోరు తెరచి, చెవులప్పగించి వింటున్న మాకు అర్థమయ్యాక గుండెల్లో బాంబు పేలింది. ఊపిరాగిపోయింది. మేం పొద్దుట్నుంచీ చెప్పాలని, చెప్పలేక గుక్కిళ్ళు మింగుతున్న విషయాన్ని ఎంత చలాగ్గా గంట క్రితం తిన్న ఫ్రూట్ సలాడ్ అంత మధురంగా చెప్పేశాడూ?

"ఎంత చక్కగా మాట్లాడుతావు శ్రీ! నీ మాటలు నిజంగా చెవుల్లో అమృతం పోసినట్లే ఉంటాయి" బామ్మ గాలిలో తేలిపోతోంది. ఒంగలేక వూరుకునుంటుంది కాని, లేకపోతే తనే వాడి కాళ్ళమీద పడేలా వుంది. బామ్మను కిందికిదింపి గొంతులో ఇంత విషం పోద్దామనిపించింది.

సీత కూడా ముందు అయోమయంలో పడి, ఆనక అర్థమయ్యాక బామ్మవేపు చూసింది. బామ్మ ముఖంలోని ఆశ్చర్యానందాలు గమనించాక సిగ్గుపడుతూ తలొంచుకుంది. ఆ బుగ్గల్లో పూసిన మందారాలు మా గుండెల్లో మంటలు రేపాయి.

"చదువు, సంపద, మంచి మనసూ వున్న భర్త దొరకడమన్నది అందరికీ దొరికే వరం కాదు. ఎంతో పూర్వజన్మ పుణ్యం ఉండాలి. అందుకే చక్కగా శ్రీ మనసెరిగి మసలుకుని మంచి ఇల్లాలివనిపించుకో తల్లీ. ఆది దంపతుల్లా అన్యోన్యంగా బతకండి కలకాలం" బామ్మ ఈసారి సీతనాశీర్వదించింది.

శ్రీశైలం జబ్బు సోకినదాన్లా సీత, బామ్మ కాళ్ళమీద పడుతుంటే శ్రీశైలం కూడా ఠపీమని మళ్ళీ పడ్డాడు జంటగా. బామ్మ ఉబ్బి తబ్బిబ్బవుతూ ఇద్దర్నీ చెరో చేత్తో అవలీలగా లేపి నిల్చోబెట్టింది. అనూహ్యంగా జరుగుతున్న ఈ తతంగాన్నంతా వెర్రి మొహం వేసుకుని చూస్తూ నిలబడ్డాం. మా మెదళ్ళు స్తంభించి యుగాలైంది.

"బాలూ, బామ్మని, సీతని 'శిల్పారామం' తీసికెళ్దామనుకుంటున్నా. మీరూవస్తారా? " శ్రీశైలం అడగటంతో 'ధ్వని' మాకర్థమైంది.

"లేదు, మా కన్నులు కుదరదుగాక కుదరదు. మేము అర్జంట్‌గా రామకృష్ణ మఠానికి వెళ్ళాలి. స్వామి రామానందతీర్థులవారి ఉపన్యాసం వినాలి. మీరు వెళ్ళి రండి" అన్నాను ఉక్రోషం దాచుకొంటూ.

ఎవరంటారు జీవితంలో 'సునామీ'లు రావని? తప్పకుండా వస్తాయి. మాకు రాలేదూ 'శ్రీశైలం' రూపంలో? !

శ్రీశైలం, సీతా చేయీ చేయీ పట్టుకుని 'చెంగు చెంగు'మని మెట్లు దిగుతుంటే బామ్మ ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూస్తూ మాతో, "బాలూ, వాళ్ళనట్లా చిలకాగోరింకల్లా చూస్తుంటే కన్నుల పండగ్గా లేదూ? ! రేపు వాళ్ళ పెళ్లికి నువ్వే వంటలన్నీ దగ్గరుండి చూసుకోవాలి. చలమేమో పెళ్లిమంటపం అలంకరణ చూసుకుంటాడు. రిసెప్షన్లో లక్ష్మీ నారాయణది పాటల ప్రోగ్రాం పెడదాం, ఏమంటావు? " అంది ఏదో రేపొద్దున్నే పెళ్లి అన్నంత హడావిడిగా.

కన్నుల పండగా, పాడా? ఒళ్ళంతా కారం రాసుకున్నట్లు మండుతోంటే! "కమ్మని పులిహోరని తీసికెళ్ళి పాతకాగితంలో పొట్లం కట్టినట్లుంది. దీని మొహం మండ, ముసలి పీనుగ! ఎంతపని చేసిందీ? " నేను కుమిలిపోయేను.

"ఊహలు గుసగుసలాడే పాటని తెలం

గాణా శకుంతల, గద్దర్‌తో కలిసి పాడిన ట్లుంది" ల.నా. విలవిల్లాడిపోయేడు.

"బాపూ బొమ్మని బాత్‌రూం గోడకంటిం చినట్లుంది" చలం లబలబమన్నాడు.

మా అందరికీ కడుపు భగభగమం టోంది. ఏ మాత్రం పోటీలో వున్నట్లు కని పించకుండా, గుంభనంగా ఉండి ఏబ్రాసి వెధవ, ఎంత తేలిగ్గా మా 'అదృష్టదేవత'ని గద్దలా తన్నుకుపోయేడూ? అసలు మొద టిరోజు వాడు బామ్మకి 'పాద నమస్కారం' చేసినప్పుడే మేం పసికట్టలేకపోయాం దాని 'పవర్ని'.

చదువు, ఉద్యోగం, సిటీలో పాతదో పాడుదో ఓ సొంతిల్లూ, చందమామలాంటి చక్కదనమూ, అన్నింటికన్నా ముఖ్యంగా ఆ 'కళాభిమానమూ' వున్న సీతలాంటి అమ్మాయి మాకీ జన్మకి మళ్ళీ దొరికేనా? పర్వతమంత భారమైన గుండెని మోయ లేక మోస్తున్న శరీరాల్ని ఈడ్చుకుంటూ కిందికి దిగేం, బామ్మతో పాటు.

"బాలూ, మీరీసారి మఠానికి వెళ్లినపుడు నేను కూడా వస్తాను. ఇకనుండీ మనం కలిసే వెళ్దాం ఏ మఠానికైనా. సీత బండి మీ ఇంటిదగ్గరే ఉంచండి. రేపు వచ్చి తీసు కుంటుంది. రాత్రికి 'శ్రీ' మమ్మల్ని ఇంటి దగ్గర దింపేస్తాళ్ళే" పురమాయింపులు చేసేసి, బామ్మ ఎగురుకుంటూ వెళ్ళి కార్లో వెనకసీటు నాక్రమించింది ఠీవిగా.

"ఆహా, బ్రహ్మాండంగా వుంది. పువ్వు వాడికీ, ముల్లు మనకీను" గొణిగాను మంటగా.

"అనుకున్నామని జరగవు అన్నీ, అనుకో లేదని ఆగవు కొన్ని" ల.నా. విషాదంగా పాడుకొంటున్నాడు.

"వీడిరోగం బాగానే కుదుర్తుందిలే. ఎట్లానూ బామ్మని సీత కట్నంగా కాకపో యినా లాంఛనం కిందైనా తీసుకెళ్తుంది. ఇంట్లో వుంటే ఆవిడ వంట తిన్లేక, బయటి కెళ్తే ఆ హోటల్ బిల్లులు కట్టలేక చస్తాడు. వెధవకి పీచమణుగుతుంది బాగా" ప్రతిదీ 'పాజిటివ్'గా ఆలోచించగల చలం కసిగా సంతోషించేడు.

"మీరు కూడా రండి" అని కనీసం మాట వరసకైనా అనకుండా సీత చిరునవ్వుతో మాకు ఆఖరుసారి 'షేక్‌హాండ్' ఇవ్వడానికి చేయి చాపింది. మేం చేతులు జోడించి నమస్కరించేం గంభీరంగా. శ్రీశైలం తృప్తిగా చూసేడు మావేపు. సీత వెళ్ళి కారులో ముందు సీట్లో కూర్చుంది.

శ్రీశైలంగాడు మా దగ్గరకు వచ్చేడు,

"ఒరే పిచ్చి వెధవల్లారా! అన్ని కళల్లోకి గొప్ప కళ అన్నది డబ్బు సంపాదించడం. ఆ కళని అభిమానించనివాళ్లు ఈ భూమ్మీద ఎవరూ వుండరు. మిగిలిన కళ లన్నీ దాని తర్వాతనే. నేనీ విషయం మన చిన్నప్పటి నుంచీ చెప్తూనేవున్నా. నా మాట విన్నారు కాదు. ఆ 'కళ' వల్లనే సీత, బామ్మ నా అభిమానులయ్యారు. మీరు కూడా ముందు ఆ కళని నేర్చుకోండి. ఆల్ ది బెస్ట్", అంటూ.

ఆసరాగా అన్నట్లు ఒకరిచేయి మరొకరం పట్టుకుని, ఆరిపోయిన దీపపు సెమ్మెల్లా నేలకతుక్కుపోయి నిలబడ్డ మా ముగ్గురినీ జాలిగా చూస్తూ, మాకు 'జ్ఞానభిక్ష' పెట్టేడు.

మేం 'షాక్'లోంచి తేరుకోకముందే వెళ్లి కారులో కూర్చున్నాడు. "బై బావా!" మమ్మ ల్నుద్దేశించి చేయి వూపేడు కారులోంచి. మరోవేపు నుండి సీత, వెనకనుండీ బామ్మా కూడ చేతులూపేరు.

ఉలికిపడ్డాం మేం చివరిసారిగా. 'బై, బావా' అన్నాడా లేక 'బై, బాలూ' అన్నాడా? అర్థం కాలా. ఏమంటేముంది కనుక? ! అంతా అయిపోయింది. కొత్తకారు 'తెరచుకున్న' మా కళ్ళముందు నుంచి మెల్లగా, 'పగిలిన' మా గుండెల మీంచి మెత్తగా సాగిపోయింది.



# 'మాస్తి' కన్నడిగుల ఆస్తి

నవోదయ సాహితీ రూపకర్తగా కన్నడంలో కొత్త బాటలు పరచి నవీన దృష్టితో ఉత్తమోత్తమ కృతులు వెలయించిన మాస్తి వెంకటేశ అయ్యంగార్‌ను కన్నడిగులు 'మాస్తి కన్నడద ఆస్తి' అని అంటారు. 'శ్రీనివాస' కలంపేరుతో ఆయన అందించిన శతాధిక రచనలు వస్తువు, దృక్పథం, సంవిధానం, శైలి, అభివ్యక్తి, వైవిధ్యంతో వైశిష్ట్యాన్ని సంతరించుకున్నాయి. 'చిక్కవీర రాజేంద్ర' నవలకు ఆయన 1983లో జ్ఞానపీఠ పురస్కారం స్వీకరించారు. ఈ అత్యున్నత పురస్కృతి అందుకున్న నాలుగవ కన్నడ సాహితీవేత్త అయ్యంగార్.


మాస్తి వెంకటేశ అయ్యంగార్

మాస్తి వెంకటేశ అయ్యంగార్ 1891 జూన్ 6న కర్నాటక రాష్ట్రం కోలార్ జిల్లా హొంగేన హళ్లిలో జన్మించారు. వారిది వైష్ణవ కుటుంబం. ఇంట్లో మాట్లాడే భాష తమిళం. మాస్తి బాల్యం పేదరికంలో గడిచింది. చదువులో దిట్ట అనిపించుకున్నాడు. చిన్నతనంలోనే రచనపై ఆసక్తి పెరిగింది. 1904లో ఇంగ్లిషులో 'ఎల్.ఎస్' పరీక్ష ఉత్తీర్ణుడయ్యాడు. 1908లో మెట్రిక్యులేషన్‌లో మైసూర్ సంస్థానంలో సర్వప్రథముడిగా నిలిచాడు. ఆ సంవత్సరమే మాస్తి తండ్రి దివంగతులయ్యారు. పినతండ్రి కుటుంబ పోషణభారం వహించాడు. పేదరికం వెంటాడుతున్నా మాస్తి చదువు కొనసాగించాడు. 1914లో మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి ఇంగ్లిషు సాహిత్యంలో ఎంఏ డిగ్రీ పొందాడు. బెంగుళూరులోని ప్రెసిడెన్సీ కళాశాలలో అధ్యాపకునిగా ఉద్యోగపర్వం ప్రారంభమైంది. సివిల్ సర్వీసు పరీక్షలో అగ్రస్థానం పొంది ఉన్నతాధికారిగా నియమితుడయ్యాడు. ఉద్యోగధర్మంగా వివిధ ప్రాంతాలు సందర్శించి ప్రజల సమస్యలను అవగాహన చేసుకున్నాడు. వృత్తిని సమర్థంగా నిర్వహిస్తూనే రచనావ్యాసంగాన్ని చేపట్టడం ఆయనలోని విశేషం. అన్ని ప్రక్రియల్లోనూ అధిక సంఖ్యలో రచనలు చేస్తూ అనతికాలంలోనే అగ్రశ్రేణి సాహితీవేత్తగా ఖ్యాతిగాంచాడు. తన రచనా కార్యక్రమానికి కొంత అవరోధంగా నిలుస్తున్నట్లు గ్రహించి 1943లో తాను నిర్వహిస్తున్న జిల్లా కమిషనర్ ఉన్నత పదవిని కాస్త ముందుగానే విరమణ చేశాడు.

నవ కన్నడ సాహిత్య నిర్మాతల్లో మాస్తిది ప్రముఖ స్థానం. ఆ నూతన సాహితీ సృష్టికి ఆయన విలక్షణ మార్గం ఎంచుకున్నాడు. సాటి సాహితీ మిత్రులు కూడా ఆయనను అనుసరించారు. మాస్తి తాత్త్వికతతో పాటు మానవతావాదానికి, సంస్కృతీమూలాల పరిరక్షణకూ పెద్ద పీట వేశాడు. నిబద్ధతతో, స్పష్టమైన సైద్ధాంతిక భూమికతో రచనలు సాగించాడు. ప్రాచీన వైభవం, జాతి జీవితానికి సంబంధించిన సంప్రదాయ వారసత్వం పట్ల ఆయనకు అభిమానం. దానిని పునర్వ్యవస్థీకరించాలని ఆయన యత్నం.

"రామాయణ, భారత, భగవద్గీతల్లో కొన్ని ప్రక్షిప్తాలున్నాయని నా నమ్మకం. వీటివల్ల ఈ మహద్గ్రంథాల శోభ తగ్గింది. నరసింహావతారం,




వామనావతారం, గోపికా వస్త్రాపహరణం, రాసక్రీడ ఇత్యాది కథలకు నూతనార్థాలు సూచించాను" అంటాడాయన.

ఏ ప్రక్రియలో రచన చేసినా తన మౌలిక భావజాలానికి కట్టుబడి వున్నాడు. కన్నడ కథకు

# అపార్ట్‌మెంట్ ధరలకే
# ఇండిపెండెంట్ హౌస్

నిర్మాణరంగంలో 22 ఏళ్ళ సుదీర్ఘ అనుభవం గల
రాఘువ ఎస్టేట్స్ లిమిటెడ్ మరియు లక్ష్మీనివాస్ ఇన్‌ఫ్రా ప్రోజెక్ట్స్ వారు
183 ఎకరాల విస్తీర్ణంలో ప్రపంచ స్థాయి సౌకర్యాలను అందుబాటు ధరలలో అందిస్తున్న ప్రతిష్ఠాత్మక ప్రోజెక్ట్

## VUDA APPROVED HOUSING PROJECT

**Independent House Starts from 12.5 lacks**




Club house - Swimming pool - 18 Acres Natural lake - Parks & jogging tracks
Mineral water plant - Fitness zone - Sports complex - 24 hr. Security - Shopping Complex
Solar power back up - Individual Compound walls - Underground cabling & drainage

design.viiju@gmail.com




**RAGHAVA ESTATES LTD & LAKSHMINIVAS INFRA PROJECTS**

Corp Office : # 50-102-4, North Extn Lay Out, Seethammadhara, Visakhapatnam. A.P

B.O : 2nd Floor, Kranthi Arcade, Above Punjab National Bank. Auto Nagar Jn. Gajuwaka. Vizag.A.P

**Ph : 91601 37777 - 91602 53777**

Location : Near to visakhapatanm steel plant

కొత్తరూపు దిద్దిన ఘనత ఆయనదే. 'కన్నడ కథా జనక' బిరుదం ఆయన సొంతం. ఆయన చిన్న కథ ఒక విశిష్ట కళ. 'ఇందిరయో అల్లవో' లో దాంపత్య జీవనాన్ని రసార్ద్రంగా చిత్రించాడు. నారాయణమూర్తి భార్య ఇందిర మరణానంతరం సావిత్రిని వివాహమాడతాడు. ఇందిర కుమారుడు గోపాలుణ్ణి రెండో భార్య కష్టపెడుతుంది. నారాయణమూర్తి వేదనను హృదయస్పర్శిగా వర్ణిస్తాడు. ప్లేగువ్యాధికి గోపాలుడు బలి అవుతాడు. 'కల్మాడియ కోణ' కథలో గ్రామీణ సాంఘిక జీవనాన్ని నిశితంగా విశ్లేషించాడు. 1910లో మాస్తి తొలికథ వెలువడినప్పటి నుంచి ఆయన రచించిన వందకు పైగా కథలు పెన్నిధులే. కథాకావ్య రచనలో మాస్తి అద్భుత ప్రతిభా విశేషాలు ఆవిష్కృతమయ్యాయి. 'శ్రీరామ పట్టాభిషేక' ఒక మహాకావ్యంగా రూపొందింది. అందులో మాస్తి జీవితదర్శనం ప్రతీకాత్మకంగా అభివ్యక్తమవుతుంది. బోవనహళ్ళిలో ఒక చెట్టు కింద సీతారామలక్ష్మణులు వనవాస సందర్భంగా ఒక పగలు ఉన్నారని ఒక ముదుసలి చెబుతుంది. అక్కడ ప్రారంభించి సీతారాముల ఆదర్శ దాంపత్యాన్ని వివరించాడు. ఇది పదివేల పంక్తుల బృహత్ రచన. పందొమ్మిది పద్య కథల గుచ్ఛంగా 'నవరాత్రి' రచించాడు. గద్య పద్యాత్మకమైన సరళ రగడ దానిలో ప్రధానం. బిన్నహ, అరుణ, తావరె, చెలువ, మలార, సునీత, మానవి వంటి మరో పదకొండు కవితా సంపుటాలలో మాస్తి భావపుష్టిని, ఛందోవైభవాన్ని ప్రదర్శించాడు. 'తావరె'లో 'కెసరినవి హుట్టియూ హెసరాదె నీ జగకె'- కమలమా! బురదలో జన్మించినా ప్రపంచంలో పేరు తెచ్చుకున్నావు- అంటాడాయన. మాస్తి కలంనుంచి శాంత, సావిత్రి, ఉష, మంజుల, యశోధర, అనార్కలి, పురందర దాస, కాళిదాస తదితర నాటకాల్లో పురాణాలకు, చరిత్రకు తనదైన పద్ధతిలో అన్వయం చెప్పాడు. చిత్రాంగద, చంద్రమారుత, శ్రీకృష్ణకర్ణామృత వంటి అనువాదాలు చేశాడాయన. పాపులర్ కల్చర్ ఇన్ కర్ణాటక, రవీంద్రనాథ్ టాగూర్, ది మహాభారత్ మొదలైన కృతులను ఇంగ్లిష్‌లో రచించాడు.

సుబ్బణ్ణ, చెన్నబసవనాయక, చిక్కవీర రాజేంద్ర అనేవి మాస్తి నవలలు. పరిమాణంలో చిన్నదైనప్పటికీ 'సుబ్బణ్ణ'లో మాస్తి ఒక గాయకుని జీవితాన్ని రమణీయంగా చిత్రించాడు. సాంస్కృతిక వారసత్వం ఎంత అమూల్యమైనదో నిరూపించాడు. చరిత్రను కొత్త కోణంలో చెప్పాలనే మాస్తి ఆకాంక్ష 'చిన్న బసవ నాయక'లో కనిపిస్తుంది. బిదునూరు రాణి వీరమ్మాజీ, ఆమె పుత్రుడు చన్నబసవల మధ్య అన్యోన్యత లోపించింది. ఈ పరిస్థితిని హైదర్‌ఆలీ అసరాగా తీసుకుంటాడు. ఫలితం బిదునూరు పతనమవుతుంది. ఇందులో మానవీయ సంబంధాలను మాస్తి చూపిన తీరు కనువిప్పు కలిగించేదిగా వుంది. జ్ఞానపీఠ పురస్కృతి పొందిన నవల చిక్కవీర రాజేంద్ర. ఇది కూర్గుల సంస్థాన వృత్తాంతాన్ని తెలియజేస్తుంది. వస్తువులోను, శిల్పంలోనూ ఈ నవల మకుటాయమానం. చరిత్రను చూపిన విధం నిరుపమానం. స్వరాజ్య సమరాన్ని పరోక్షంగా చూపిన నవల యిది. చిక్కవీర రాజేంద్ర కూర్గుల రాజు. రాణి గౌరమ్మ. రాజు జాతకంలో కంసుని జాతక లక్షణాలున్నాయని జ్యోతిష్యులు చెబుతారు. అది నమ్మి రాజు తన సోదరిని చెరసాలలో బంధిస్తాడు. కాని రాకుమారి తన మేనత్తను ఉపాయంతో భర్త వద్దకు పంపుతుంది. రాజు మేనల్లుడు మాత్రం తప్పించుకోలేకపోతాడు. చిక్కవీరరాజేంద్రలో కాఠిన్యం, నిరంకుశత్వం పెచ్చరిల్లుతాయి. మంత్రులు దీనిని సహించలేక అధికారాన్ని రాణి వశం చేయాలనుకుంటారు. కాని ఆ పని జరగలేదు. రాజును సింహాసనం నుంచి తొలగించేందుకు ఈస్టిండియా కంపెనీకి చెందిన కల్నల్ ఫ్రేజర్ ప్రయత్నాలు ఫలించాయి. కూర్గుల సంస్థానం పతనమై ఆంగ్లేయుల వశమవుతుంది. ఈ నవలలో గౌరమ్మ పాత్ర చిత్రణ అసాధారణం. భారతీయ స్త్రీకున్న పరిమితులు ఆమెలో కనిపిస్తాయి. ఒకవైపు గొప్ప గరిమ, మరోవైపు సహజ సౌకుమార్యం ఆమెకు విజయాన్ని చేకూర్చలేకపోయాయి. కన్నడ సాహిత్యంలో ఇదొక మణిదీపం.

మాస్తి వెంకటేశ అయ్యంగార్ కన్నడలో 120 పైగా, ఇంగ్లిష్‌లో 17 కృతులు సాహితీలోకానికి అందించాడు. ఆయన 'జీవన' అనే మాస పత్రికకు సంపాదకత్వం వహించి ఎందరో రచయితలకు అవకాశాలు కల్పించారు. మైసూరు మహారాజా కృష్ణరాజ వడయార్ మాస్తికి 'రాజసేవాసక్త' బిరుదు ప్రదానం చేశారు. 1969లో సాహిత్య అకాడమీ పురస్కృతి లభించింది.

మాస్తి 1986 జూన్ ఆరోతేదీన మైసూరులో నిర్యాణం చెందారు. ఆయన సాహిత్యానికి చేసిన సేవలు నిత్యనూతనాలు, అనన్య సామాన్యాలు.

*– గోవిందరాజు రామకృష్ణారావు*

# ఆంధ్రా ఊటీ మదనపల్లెలో



కిరాయి క్లాస్‌రూమ్స్ - అరకొర సౌకర్యాలు
విద్యార్థుల వికాసానికి విఘాతం కాదా ?

అందుకే గ్రీన్ వ్యాలీ

**13ఎకరాల స్థలం, లక్ష చ.అ విస్తీర్ణం గల**
**స్వంత భవనాలలో, ఆహ్లాదకర వాతావరణంలో**
**విద్యార్థుల మనోవికాసానికి**

## గ్రీన్ వ్యాలీ
## ది ప్లేస్ ఆఫ్ లెర్నింగ్ ఫర్ లైఫ్




## ఎల్.కె.జి నుండి
## 10 వ తరగతి వరకు

**గ్రీన్‌వ్యాలీ ప్రత్యేకతలు**

| ఆంధ్రా ఊటీ మదనపల్లిలో 13 ఎకరాల్లో సుమారు లక్ష చదరపు అడుగుల విస్తీర్ణంలో స్వంత భవనసముదాయం | సోలార్ హాట్ వాటర్ ప్లాంట్ | మినరల్ వాటర్ ప్లాంట్ | స్మార్ట్ క్లాస్ ఎడ్యుకేషన్ | కాన్సెప్ట్ ఓరియంటెడ్ ఎడ్యుకేషన్ విత్ ప్రాక్టికల్ అప్రోచ్ | సెమినార్స్, అప్లికేషన్ స్కిల్స్ మరియు జనరల్ ఎవేర్‌నెస్ | రీజనింగ్, ప్రోగ్రామింగ్ మరియు పర్సనల్ కౌన్సిలింగ్ | రిలాక్సేషన్ టెక్నిక్స్, రిఫరెన్స్ స్కిల్స్ మరియు వర్క్‌షాప్స్ | స్లో లెర్నర్స్‌పై ప్రత్యేక వ్యక్తి గత శ్రద్ధ | క్రియేటివ్ రైటింగ్, కంప్యూటర్ అప్లికేషన్స్ మరియు ఆటిట్యూడ్ ఎడ్యుకేషన్ | రకరకాల జాతీయస్థాయి ఒలంపియాడ్స్, టాలెంట్ సర్చ్ ఎగ్జామ్స్, గ్రూప్ మరియు సివిల్ సర్వీసెస్‌కు తర్ఫీదు | కరాటే, కుంగ్‌ఫూ నన్‌చాక్ లాంటి మార్షల్ ఆర్ట్స్ | జూడో మరియు బాక్సింగ్ | అథ్లెటిక్స్, జిమ్నాస్టిక్స్, ఫాలున్ దాఫా యోగా | డాన్స్, మ్యూజిక్, క్యాలీగ్రఫీ, ఫైన్ ఆర్ట్స్, డ్రాయింగ్ మరియు పెయింటింగ్ | బాస్కెట్‌బాల్, లాన్‌టెన్నిస్, ఫుట్‌బాల్, వాలీబాల్, త్రోబాల్, క్రికెట్, బాల్ బాడ్మింటన్ లాంటి అవుట్‌డోర్ గేమ్స్ | చెస్, క్యారమ్స్, టేబుల్ టెన్నిస్ లాంటి ఇండోర్ గేమ్స్ మరియు గుర్రపు స్వారీ.

ఎ/సి క్లాస్ రూమ్స్ & బాలబాలికలకు ప్రత్యేక ఎ/సి హాస్టల్స్ (I to X)

K.Srinivasulu
Principal

Rtn. PHF. K.Kanakaraja
Chairman

**International School**
(ICSE Syllabus)
LKG to X Class

**Medical / IIT Olympiad School**
(Integrated CBSE, ICSE, A.P. State Syllabi)
VI to X Class

**Concept School**
(A.P State Syllabus)
LKG to X Class



# Greenvalley
## Educational Institutions

Greenvalley, Punganur Road, MADANAPALLE, Chittoor Dt.
Ph: 08581-257933, 257577, Cell: 9701659666, 9701816444.
E-mail: gvins_mpl@yahoo.co.in



# చతుర ప్రవేశిక



## అక్టోబరు - 2010

అక్టోబరు 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. శివయ్య పార్వతిని ఏమని పిలుస్తాడు?
2. రామచంద్రుడికి ఇష్టమైన పక్షి ఏది?
3. రామచంద్రుడికి సాయపడిన స్నేహితుడెవరు?
4. సీత బొమ్మ పెయింటింగ్ వేసి బహుమతిగా ఇచ్చిందెవరు?
5. కథల పోటీలో బహుమతులు గెలుచుకున్నది ఎవరు?
6. మాస్తికి జ్ఞానపీఠం తెచ్చిన రచన పేరు?
7. 'నా చుట్టూ ఉన్న సంఘమే నా కలంలో సిరా' అన్న రచయిత?
8. సెల్‌ఫోన్‌లో వీడియో తీసిన లేడీ కానిస్టేబుల్?
9. విశ్వేశ్వరరావు ఎవరి హోటల్లో సాయంత్రం టిఫిన్ చేస్తాడు?
10. బారిస్టర్ పార్వతీశం రచయిత?

---

పంపినవారి పేరు: ---------------------------- వయసు (   )

చిరునామా: -----------------------------------------

-----------------------------------------------------

పిన్‌కోడ్:                    ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర,
ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

ప్రవేశికలకు చివరి తేదీ 19

నోట్ : చతుర ప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపవచ్చు.

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813;  Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

Olive's global footprint
**ASIA · EUROPE · AFRICA · AMERICAS**

**Olive** Convergence
www.olive.net

# భారతదేశపు మొట్టమొదటి క్వర్టీ ట్రిపుల్ సిమ్

## Olive Wiz / V-GC800

GSM-1 + GSM-2 + CDMA



ఉత్తమ స్వేచ్ఛా ప్రపంచంలోకి అడుగుపెట్టండి:

- GSM & CDMA నెట్‌వర్క్స్ రెండింటిపై మాట్లాడే స్వేచ్ఛ
- ఉత్తమ టారిఫ్‌ను ఎంచుకోవడం ద్వారా మీ ఖర్చును తగ్గించుకునే స్వేచ్ఛ
- పటిష్టమైన నెట్‌వర్క్‌ను ఎంచుకొని, సంబంధాలు సదా నిలుపుకునే స్వేచ్ఛ,

వినూత్న పోకడల ద్వారా మిమ్మల్ని సంతృప్తిపరచాలనేదే మా ఉద్దేశం.

- FREE - Changeable Back Panels: Black, Silver & Yellow
- Email
- Instant Messenger: Yahoo, MSN, Gtalk, etc
- 2 MP Camera
- Social Networking: Facebook, Twitter etc
- Digital Audio Player
- Video Record & Playback
- Java
- Webcam
- Bluetooth (A2DP support)
- Expandable Memory (upto 4 GB)
- FM Radio with Recording & Alarm




*Conditions apply

**Olive Pwrr** V-G200



Dual SIM, 18 hrs Talk-time

**Olive Touch** V-G300



Dual SIM, Touchscreen, Multimedia, Expandable Memory

**V-G400**



Dual SIM, Clamshell

**V-G500**



Dual SIM Slider

**Olive FrvrOn** V-G2300



India's first dual power phone with Pencil Cell (AAA Battery)

**Olive Compacta** V-G1100



Stylish Entry Level

**Olive Glide** V-G2100



Sleek, Color, FM, Hindi Support

**Olive Harmony** V-G3000



Dual SIM, FM Radio, Digital Audio Player, Expandable Memory

**Olive Lumen** V-G3200



Dual SIM, Stereo FM Radio, Camera, Bluetooth, Torch

**Olive msgr** V-G8000



Qwerty SMS, Long Battery, FM

**Olive Buzz** V-G800




Ultra Slim Qwerty, Mobile Maps, 2MP Camera Email, Opera Mini, Social Networking

*Comprehensive Network of Service Centers, countrywide.*

**Super Distributor: Preethi Motors:** Purushottam 9491030564, 9394091909, Babu 9494063555. **Distributors: Hyderabad (mehdipatnam):** Bhanu Enterprises Babu - 9347713837 / 32446754, **Marredpally (secunderabad)**: Veeren Enterprises - Veda Kumar - 9966571111, **Hyderabad(narayanaguda):** Sri Nidhi Enterprises - Mr. Venugopal.9291519999, **Nizamabad**: Rajkamal Distributors: Mr.rajkamal/srikanth 9989361166/9848979579, **Warangal Dist:** Vaarahi Distributors Dinakar 9959876076, **Kodad (Miryalaguda):** chandu-9866023053, **Suryapet (Nalgonda Dist):** Marru Chokkarao-9347349914, **Mahboobnagar:** N.R.K. Communications-mr.sreedhar Reddy-9441341444, **Addanki (Prakasham Dist):** mr.gururaj-9848402757. **Vijayawada:** M/s. Vannur Distributors-mr.immanual- 9394508111, **West Godawari Dist (Bhimavaram)**: Sri Renuka Communication-Narayana/suresh-8897878866, **East Godavari (Amalapuram):** Lakshmi Cosmetics & General Agencies Mr.nanaji-9908124369, **Vishakapatnam**: Ajay Electronics-mr.kamal Jain-9848483183, **Srikakulam:** Venus Electronics-mr.nageshwar Rao-9848274128, **Ananthapur:** Nagruru Marketing-mr.nagendra Prasad-9866414544, **Kurnool:** Hima Sai Agencies-mr.venkatesh-9440291131, **Chitoor District (Tirupathi):** G.N.S. Marketing-mr.naga Saran-8801572866 /9440075698, **Kadapa:** Parshvanath Communications-mr.chandrakanth/ramesh Kumar-9866318663/9177191778, **Ananthpur Hindupur (ananthapur Dist):** Noorulla-9394784110/9849163181, **Micro Distributors:** Daras Mobiles-9291508345, **Krishna Dist Rural:** Manasvi Distributors-9908607777, **Guntur Dist:** Hitech Communication-9397955550, **Prakasam Dist**: V.N.R. Distributors-9966133173.

**For Distribution Enquiry:** Jaripiti Bhaskar 9966393000, Jaya S 9966717177, Abdul Jillani 9396674702, Abdul Khader K 9030282090.

Corporate HQ: **Olive Telecommunication Pvt. Ltd.**, 862, Udyog Vihar, Phase V, Gurgaon 122 016. Fax: +91-124-4648222, Email: india@olive.net. **Customer Enquiry No. (Toll Free):** 1800-266-65483.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78